# మహనీయుల ముచ్చట్లు

వేమూరి జగపతిరావు



MAHANEEYULA MUCHATLU

By

VEMURI JAGAPATHI RAO

FIRST EDITION

SEPTEMBER 1990

PUBLISHED By

PALLAVI PUBLICATIONS

Eluru Road, VIJAYAWADA–520 002

COVER DESIGN

CHANDHRA

PRINTED AT

RAGHAVENDRA

PRICE Rs. 20-00



ప్రముఖ పత్రికా రచయిత శ్రీ వేమూరి జగపతిరావు వృత్తిరీత్యా వ్యవసాయదారులు. బందరు ఆంధ్రజాతీయ కళాశాలలో బి. ఎ. వరకూ చదివారు. హాబీగా పత్రికలకు వ్యాసాలు వ్రాస్తూ వుంటారు. వీరు గత 30 సంవత్సరాలుగా ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఈనాడు పత్రికలకు అసంఖ్యాకంగా వ్యాసాలు వ్రాశారు. వీరు రచించిన "ప్రపంచ రాజ్యాల సంగ్రహచరిత్ర" బహుళ ప్రచారం పొంది అనేక ముద్రణలు పడింది. ప్రస్తుతం "తెలుగు విద్యార్థి"కి "మన రాష్ట్రాల కథలు" వ్రాస్తున్నారు. జగపతిరావుగారి వయస్సు 54 సంవత్సరాలు.

—పబ్లిషర్స్

# ముందుమాట

"మహనీయుల ముచ్చట్లు" ఎవరికైనా చదవడానికి, వినడానికి కూడా ముచ్చటగా వుంటుంది.

"వ్యక్తుల ప్రయివేటు బ్రతుకు వారి వారి సొంతం. పబ్లికులో నిల బడితే ఏమైనా అంటాం." అని మహాకవి శ్రీశ్రీ అన్నట్టు, పబ్లిక్ రంగంలో అంటే ప్రజాజీవితంలో వున్నవారి వింతలు, విశేషాలు, మంచి చెడ్డలు, వారి అలవాట్లు అందరికీ ఆసక్తి కలిగిస్తాయి. కొన్ని ఆనందం కలిగిస్తే, మరికొన్ని ఆశ్చర్యం కలిగిస్తాయి.

ఉదాహరణకు, కాంగ్రెసు చరిత్ర కారుడు డాక్టర్ పట్టాభి పొదుపరి, తనకు వచ్చిన ఉత్తరాల కవర్లను భద్రపరచి, వాటి రెండవ వైపున తిరిగి తాను వ్రాసుకునేటంత పొదుపరి అని చాలా మందికి తెలిసినా, ఆయన ఒక బ్లేడును ఆరు నెలలు వాడేటంతటి పొదుపరి అని ఎందరికి తెలుసు? ఆయన ఒకానొక సందర్భంలో "దేశభక్త" కొండ వెంకటప్పయ్యగారిని ఎడ్లబండి ఎక్కించి, తోలారని ఎందరికి తెలుసు ?

అలాగే "ఆంధ్రరత్న" దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు రాజ మండ్రిలో హిస్టరీ లెక్చరర్‌గా వున్నప్పుడు ఒక రోజున కాలేజీగేటు దూకి వెళ్ళారని, ఎందుకు వెళ్లారోనని ఎందరికి తెలుసు ?

డిగ్రీలేని వి. పి. మీనన్ స్వశక్తితో, స్వయంకృషితో పైస్థాయి సలహాదారు, కేంద్రహోమ్, సంస్థానాలశాఖ కార్యదర్శి కాగలిగారని ఎందరికి తెలుసు ?

ఐక్యరాజ్య సమితి అధ్యక్షురాలుగా, మూడు అగ్రరాజ్యాలలో ఇండియా దౌత్య ప్రతినిధిగా పనిచేసిన శ్రీమతి విజయలక్ష్మి పండిట్ (జవహర్‌లాల్ నెహ్రూ సోదరి-ఇప్పుడు ఆమె వయస్సు 91 సం॥లు) ఒకప్పుడు తన తండ్రి మోతీలాల్ నెహ్రూవద్ద కాంపౌడర్‌గా పనిచేసిందని ఎందరికి తెలుసు? అమాటకుపస్తే, తన బట్టలను పారిస్‌లో ఇస్త్రీ చేయించుకునే మహా భోగలాలసుడు, శ్రీమంతుడు మోతీలాల్ హోమియో వైద్యం చేసేవారని ఎంతమందికి తెలుసు ?

"లోక్‌నాయక్" జయప్రకాశ్ నారాయణ్ టిక్కెట్టు లేకుండా రైలు ప్రయాణంచేసి, జరిమానా కట్టడం కోసం తనచేతి గడియారం తాకట్టు పెట్టారు !

కాంగ్రెసు అధ్యక్షుడుగా వ్యవహరించిన ఆచార్య కృపలానీ ఒకసారి కొబ్బరి చెట్టెక్కాడు ! ఎందుకు ?

ఇవి చదువుతుంటేనే "ఏమాకథ! ఏమిటా కమామీషు!" అని నోరు-కాదు, మనస్సు-ఊరుతున్నది కదూ!

ఔను! ప్రసిద్ధ రచయిత శ్రీ వేమూరి జగపతిరావుగారు వ్రాసిన "మహనీయుల ముచ్చట్లు" అన్న ఈ గ్రంథంలో నేను పేర్కొన్న ముచ్చట్లు కొన్ని మాత్రమే! అలాంటివి - అంతకంటె ఆసక్తికరమైనవి, ఆశ్చర్యకరమైనవి కూడా ఈ గ్రంథంలో కోకొల్లలు!

ఇంతవరకు చదివితేనే ఈ పుస్తకంలోని మహనీయుల ముచ్చట్ల పఠన మాధుర్యాన్ని గ్రోలాలని ఇప్పటికే పాఠకులకు ఉత్కంఠ కలిగి వుంటుంది!

అందువల్ల, పాఠకుల ఉత్కంఠకు ఉత్సుకతకు నేను అడ్డురాను కాని, ఒక్కమాట-

ఇలాంటి (Anecdotes) (ఇదివరకు చాలామందికి తెలియని అత్యంత ఆశ్చర్యకరమైన, ఆసక్తి దాయకమైన సంఘటనలు) వ్రాయడంలో జగపతిరావుగారు సిద్ధహస్తులు. ఆయన శైలి సర్వజన సుబోధకం. ఆయా సన్నివేశాలకు, ముచ్చట్లకు అనుగుణమైన శైలితో ఆసక్తికరంగా వీటిని రచించారు.

దాదాపు 25 సంవత్సరాల క్రితం ఆయన తొలి రచనలకు ప్రోత్సాహమిచ్చిన నాకు ఆయన ఇంత ప్రజారంజకుడైన, చెయ్యి తిరిగిన రచయిత కావడం ఎంతో ఆనందదాయకం. ఆయన లేఖిని నుంచి పుంఖాను పుంఖంగా వెలువడుతున్న ఈ రచనలు ఇలా ధారావాహికంగా వెలువడు తూనే వుండాలని నా ఆకాంక్ష, ఆయనకు నా అభినందనలు.

విజయవాడ,
(4-9-90).

"కళాసరస్వతి"
తుర్లపాటి కుటుంబరావు
ఎడిటర్ "జ్యోతిచిత్ర"

# ముందు ముచ్చట

One ancedote of a man is worth than a Volume of biography.

—William Ellery Chamming

Everybody's life consists of Episodes chained together by boredom. In memory it seems to me, the boredom is forgotten and the Episodes remain.

—Dom Moraes.

ప్రసిద్ధ వ్యక్తుల జీవితాల్లోని ముచ్చట్లు (anecdotes) ఉపాఖ్యానాలే (Episodes) ఈ మహనీయుల ముచ్చట్లు. జీవిత చరిత్రలు అవి ఎంతటి గొప్పవ్యక్తి చరిత్ర అయినా విసుగు పుట్టించవచ్చు. కాని ఈ ముచ్చట్లు, హాస్య సంఘటనలు చదవటానికి ఆసక్తిదాయకంగానే గాక మన మస్తిష్కంలో చిరకాలం నిలబడి వుంటాయి. పైగా ఈ ముచ్చట్లు ఆయా ప్రసిద్ధ వ్యక్తుల వ్యక్తిత్వాన్ని కూడా చెప్పకనే చెబుతాయి.

ఇందులోని ముచ్చట్లన్నీ ఆంధ్రపత్రిక, ఆంధ్రజ్యోతి (డైలీ) ఈనాడు, ఆంధ్రజ్యోతి (వీక్లీ)లలో ప్రచురించబడినవే. కొద్దిగా మాత్రం అదనంగా చేర్చటం జరిగింది. వీటిని పుస్తక రూపంలో ప్రచురించటానికి అనుమతిచ్చిన ఆయా పత్రికాధిపతులకు కృతజ్ఞతలు.

పరిచయం వ్రాసిఇచ్చిన మిత్రులు శ్రీ తుర్లపాటి కుటుంబరావు గార్కి నా కృతజ్ఞతలు.

— వేమూరి జగపతిరావు

లంకపల్లి (Po)
మేడూరు (Via)
కృష్ణాజిల్లా
PIN 521 247

# ఇందులోని మహానీయులు ...

## ఎడంచేత్తో బాడ్మింటన్ ఆడిన

# గాంధీజీ

రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యాన్నే గడ గడ లాడించి, ఏ ప్రభుత్వానికి, ఏ అధికారికి, మరే వ్యక్తికి లొంగక, మరణమన్నా, జైలన్నా భయపడని గాంధీజీ భార్యకు భయపడేవారట. ఈ భయపడటానికి కొంత కారణం లోగడ కస్తూరిబాపట్ల అనుచితంగా ప్రవర్తించి, అందుకు పశ్చాత్తాప సూచనగా కస్తూరిబా మాటకు ఎదురు చెప్పే ధైర్యం వుండేది కాదు గాంధీజీకి.

చేసిన శపథాన్ని కూడా వదులుకొని మేకపాలు పుచ్చుకోవడానికి కస్తూరిబా పట్టుదలే కారణం. ఆవిడ మాటను కాదని ఆమెను నొప్పించడం గాంధీజీకి ఎంతమాత్రం ఇష్టం వుండేదికాదు. ఇదివరకే కస్తూరిబాను అనేక హింసలకు గురిచేసి రాచి రంపాన పెట్టానని బాధపడుతూ వుండేవారు ఇక ఎంతమాత్రం ఆవిడకు ఇష్టంలేని పని చేసి నొప్పించడం గాంధీజీకి సుతరాము ఇష్టంలేదు. అంత మాత్రంచేత కస్తూరిబా గాంధీజీ మాటను తిరస్కరించిందిలేదు. భారతీయ స్త్రీ గా భర్తను అనుసరించి వుండడమే ఆమె ధ్యేయం పోతే గాంధీజీ ఆరోగ్య విషయాలలో ఆమె కొంత స్వాతంత్ర్యం చనువు తీసుకునేవారు. అది ఆమె ధర్మంకూడా! కాని, గాంధీజీ మాత్రం ఆవిడ ఎదుట భయపడేవారు.

## బాపూజీ అంట్లుతోమడం

బాపూజీ వార్ధాలో వున్నప్పుడు జరిగిన సంఘటన ఇది. ఆశ్రమ వాసు లందరు వంతుల ప్రకారం వంటపని చేయాలని ఒక నియమం వుండేది.

ఆ నియమం ప్రకారం ఒకరోజున బాపూజీ. కుమారప్పలకు అంట్లుతోమే పని వచ్చింది. ఆ విధంగానే తోముతున్నారు. కస్తూరిబాకు ఈ విషయంతెలిసి గబగబా వారివద్దకువచ్చి "మీరిద్దరకు వేరేపనిఏమీలేదూ? ప్రజా కార్యాలు అనేకం మీకోసం ఎదురు చూస్తూవుండగా ఈ చిల్లరపనులు చేస్తారు! లెండి!" అని అడ్డుపెట్టసాగింది.

గాంధీజీ ఈ మాటను లెక్కచేయకుండా నవ్వుకుంటూ పాత్రలు శుభ్రపరిచేపనిలోనే నిమగ్నమైపోయారు. కస్తూరిబా కోపం తెచ్చుకొని గాంధీజీ తోమే గిన్నె లాక్కున్నారు. తోమడానికి వుపయోగించే కొబ్బరి పీచు మాత్రం బాపుజీ చేతులలో మిగిలిపోయింది.

బాపూజీ నవ్వుతూ కుమారప్పవైపు చూస్తూ" కుమారప్పా : నీవు నిజంగా అదృష్టవంతుడవయ్యా నాలాగా నీకు భార్య లేదుకదా, నీమీద ఈ విధంగా పెత్తనం చెలాయించడానికి గృహస్థ ధర్మం ప్రకారం ఆవిడను అనుసరించడంకన్నా నాకు మార్గాంతరం లేదుకదా? ఇక మా ఆవిడ నన్ను ఎలాగూ అంట్లు తోమనీయదు. నీవు కస్తూరిబా మిగతా అంట్లు తోమిరండి. ఈ విధంగా నిన్ను ఒక్కడినే చేసి వెడుతున్నందుకు క్షమిస్తావనుకుంటా" అని హాస్యోక్తిగా పలుకుతూ చేతులు, కాళ్ళు కడుక్కొని అక్కడినుంచి వెళ్ళిపోయారు.

బాపూజీ రెండవ రౌండ్ టేబుల్ సమావేశానికి లండన్ వెళ్ళి నప్పుడు కింగ్స్లే హాలులో మకాం చేశారు. ఈ సందర్భంలో గాంధీజీ లండన్‌లో దాదాపు మూడు మాసాలు వుండవలసి వచ్చింది.

గాంధీజీ ప్రతి రోజు ఉదయం పూట కింగ్స్లే హాలు చుట్టుపట్ల వున్న జన సమ్మర్ధమైన బజార్లలో షికారుగా తిరుగుతూ వుండేవారు.

గాంధీజీని చూడడంతోనే అనేక మంది స్త్రీ పురుషులు ఆయనను అభినందించేవారు. కొంత మంది గాంధీజీతో సంభాషణకు దిగేవారు. ఇంకా కొంతమంది బాపూను తమ ఇండ్లకు రమ్మని ఆహ్వానించేవారు. పిల్లలు "గాంధీ మామయ్య" అని పిలుస్తూ బాపూజీ చేయిపుచ్చుకుని నడిపించేవారు. వారిలో ఒక కొంటె కిష్టయ్య ఒకసారి మామూలుగా పంచె మోకాళ్ళపైకి కట్టుకున్న గాంధీజీని చూసి "హే గాంధీ: నీ లాగూ చొక్కాఏవీ?" అని ప్రశ్నించడంతో బాపూజీ విరగబడి నవ్వేశారట.

## సాష్టాంగ నమస్కారం

లండన్‌లో గాంధీజీ ప్రసంగాలను గురించి యూరప్, అమెరికాల లోని పత్రికలు విశేష ప్రచారం ఇచ్చాయి. అనేక పత్రికలు గాంధీజీ జీవిత చరిత్రను వ్యాసాలుగా ప్రకటించాయి. జార్జిస్లో కంబి అనే విలేకరి బాపూజీ "ఉదార బుద్ధి" గురించి వ్రాస్తూ అందుకు ఒక ఉదాహరణగా వేల్సు యువరాజు ఇండియా వచ్చినప్పుడు గాంధీజీ వినయంగా సాష్టాంగ నమస్కారం చేశారని వ్రాశాడు. కొద్ది రోజుల తర్వాత ఆ విలేకరి గాంధీజీ వద్దకు వచ్చాడు. గాంధీజీ చిరునవ్వునవ్వి "వేల్సు యువరాజు కాదుగదా మీ చక్రవర్తిముందుకూడా సాష్టాంగ నమస్కారం చేయవలసిన అవసరం నాకు లేదు. నా దేశంలో అతి నిరుపేద అయిన హరిజనుడి ఎదుట మాత్రమే సాష్టాంగ నమస్కారం చేయవలసిన అవసరం నాకున్నది. ఆ హరిజనుని పాదధూళి నాకళ్ళకు అద్దుకోవలసిన అవశ్యకత వున్నది ఎందువలనంటే శతాబ్దాలుగా అతణ్ణి పీడించి, అణగ ద్రొక్కడంలో నేను కూడా ఒక భాగస్వామిని కాబట్టి" అని అన్నారట.

## ప్లస్ నాలుగు, మైనస్ నాలుగు

పంచమజార్జి గాంధీజీని విందుకు బంకింగ్ హామ్‌ప్యాలెస్‌కు ఆహ్వానించాడు. రవిఅస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యపు చక్రవర్తితో విందు అంటేమాటలా?

విందుకు వెళ్ళే పెద్దలు దాబు దర్పంగా బట్టలు ధరించాలికదా? గాంధీజీ ఏ దుస్తులు ధరించి విందుకు వెడతారోనని ఇంగ్లండు ప్రజలంతా ఎదురు చూశారు. గాంధీజీ మాత్రం అందరికీ ఆశ్చర్యం కల్గించేటట్టు మామూలు గానే మోకాళ్ళపైకి పంచెకట్టి, శాలువాకప్పుకొని, చెప్పులు వేసుకొని, జేబుగడియారం మొలలో కట్టుకొని వెళ్ళారు పత్రికావిలేకరులు గాంధీజీని దుస్తులను గురించి ప్రశ్నిచగా "మీరు ప్లస్‌నాలుగు ధరిస్తారు. నేను మైనస్ నాలుగు ధరిస్తాను" అని సమాధానం ఇచ్చారట.

## చార్లీ చాప్లిన్‌తో సమావేశం

ప్రఖ్యాత హాస్యనటుడు చార్లీచాప్లిన్ బాపూజీని చూడాలనికుతూహల పడ్డాడట. గాంధీజీ చాప్లిన్ పేరు ఎన్నడూ విని వుండలేదు. అసలుగాంధీజీ ఎన్నడూ సినిమా చూడలేదు. అందువలన చాప్లిన్‌ను చూడడానికి ఇష్టపడ లేదు. కాని చాప్లిన్ అతి నిరుపేద కుటుంబంలో పుట్టాడని తెలియజేసిన మీదట చాప్లిన్‌ను చూడడానికి అంగీకరించారు. ఆ విధంగా చాప్లిన్ గాంధీజీల సమావేశం ఏర్పాటయింది.

చాప్లిన్ గాంధీజీని యాంత్రిక విప్లవం గురించి అనేక ప్రశ్నలు అడిగాడట.

## మైనర్ మహాత్మ

బాపూజీని కలుసుకున్న వారిలో బెర్నార్డ్‌షా, లార్డు ఇర్విన్, ఆర్చి బిషప్ ఆఫ్ కాంటర్బరీ, హెరాల్డు లాస్కీ మొదలైన వారెందరోవున్నారు. విన్‌స్టన్ చర్చిల్ మాత్రం బాపూజీని చూడడానికి తిరస్కరించాడట. బెర్నార్డుషాకు తనగొప్ప తానే స్వయంగా చాటుకోవటం ఒక అలవాటు. ఆ అలవాటు చొప్పున గాంధీజీని కలుసుకున్నప్పుడు తనను "మైనర్ మహాత్మా" అని చెప్పుకున్నాడట.

## ఇద్దరు డిటెక్టివ్‌లు

గాంధీజీ లండన్‌లో వున్నప్పుడు బ్రిటిష్ ప్రభుత్వం బాపూ రక్షణ కోసం ఇద్దరు ప్రముఖ డిటెక్టివ్‌లను నియమించింది. వీరిని సామాన్యంగా రాజకుటుంబాన్ని రక్షించడానికి తప్ప వేరొకరి రక్షణకు నియమించరు. గాంధీజీ వీరిని మిక్కిలి ఆదరించేవారు. మిగతా ప్రముఖులవలె అంగ రక్షకులపట్ల నిర్లక్ష్యంగా ప్రవర్తించకుండా వారి ఇళ్ళకుకూడా వెళ్ళి వారి కుటుంబ క్షేమ సమాచారాలను తెలుసుకువస్తూ వుండేవారు గాంధీజీ ఇండియాకు తిరిగి రాగానే వారిద్దరికీ చెరొక గడియారం కృతజ్ఞతా సూచనగా పంపారు ఆ గడియారాలపై "గాంధీ నుంచి ప్రేమానురాగాలతో" అనే మాటలు చెక్కించి పంపారు.

## స్విస్ ప్రజల ఆదరాభిమానాలు

లండన్ నుంచి వచ్చేటప్పుడు గాంధీజీ స్విట్జర్లెండ్‌లో వున్న రోమారోలాను కలుసుకొని అక్కడ అయిదు రోజులు గడిపారు· గాంధీజీ వచ్చే ముందు రోమారోలాకు అసంఖ్యాకమైన వుత్తరాలు వచ్చాయి. ఒక ఇటాలియన్ వ్యక్తి జాతీయ లాటరీలో ఏ నెంబరుగల టిక్కెట్టు నెగ్గుతుందో తెలుసుకో గోరుతూ వుత్తరం వ్రాశాడు· కొంత మంది స్విస్ సంగీత విద్వాంసులు గాంధీజీ ఎదుట కచేరీ చేయాలనే కోరిక తెలియజేస్తూ ఉత్తరాలు వ్రారు పాలి వుత్పత్తిదారులసంఘాలు "ఇండియా చక్రవర్తి"కి పాలు ఉచితంగా సరఫరాచేయగలమని వ్రాశారు. పత్రికా రచయితలు గాంధీజీ సమాధానాలకోసం ప్రశ్నలు పంపారు విలేకరులు, ఫోటోగ్రాఫర్లు రోమారోలా ఇంటిని చుట్టుముట్టారు. రోమారోలా వుంటున్న "విల్లెనెవె" పట్టణంలో వున్న హోటళ్ళన్నీ గాంధిజీని చూడవచ్చిన జన సందోహంతో నిండిపోయినవట. ఈ జనాన్ని అదుపు చేయడానికి పోలీసులకు కష్టం అయిపోయిందట.

## ముస్సోలినితో భేటీ

స్విట్జర్లెండ్ నుంచి బాపూజీకి ఇటలీ వెళ్ళాలని తలంపు కలిగింది. ఇటలీలో ముస్సోలినీ, క్రైస్తవ మతాధిపతి పోప్‌ను కలుసుకోవాలని బాపూ అభిలాష. కాని, రోమారోలా ముస్సోలినీని గాంధీజీ చూడడానికి అభ్యంతరం చెప్పాడు. గాంధీజీ ముస్సోలినీని కలుసుకోవడంవలన ఫాసిస్టులు గాంధీ పేరును తమ అవసరానికి వాడుకుంటారని రోమారోలా అభిప్రాయం. కాని, ఇటలీ ప్రభుత్వ అతిధిగా మాత్రం వుండనని రోమా రోలాకు హామీ ఇచ్చారు. ఫాసిస్టుల వలలో పడననే గాంధీజీ ధైర్యం.

గాంధీజీ ఇటలీ వెళ్ళగానే ఆ ప్రభుత్వం తమ అతిథిగా వుండ వలసిందని కోరింది. కాని, రోమారోలాకు ఇచ్చిన హామీ మేరకు అందుకు నిరాకరించి తను ఎరుగున్న స్నేహితుని ఇంట బస చేశారు. ఇటలీ నియంత ముస్సోలినీని కలుసుకున్నారు. సమావేశం 10-15 నిమిషాలు జరిగింది తరువాత గాంధీజీ ముస్సోలిని గురించి మాట్లాడుతూ, "ముస్సో లిని కళ్ళు పిల్లి కళ్ళలాగా వుంటాయని. అతణ్ణి దర్శించేవారు పిల్లిని చూస్తే ఎలుకలు భయమెత్తి పరిగెత్తినట్టుగా అతడి కళ్ళుచూచి తత్తరపాటు చెందుతారని" అన్నారు. గాంధీజీకి పోప్ దర్శనం లభించలేదు.

గాంధీజీ ఏ పని చేయడంలోనైనా చాలా నిర్దుష్టంగాను ఖచ్చితం గాను వుండేవారు. ఇతరులు కూడా అదేవిధంగా వుండాలని ఆయన భావన. ఆ విధంగా చేయలేనివారిపై ఆయన కోపిస్తూ వుండేవారు.

ఒకసారి ఎవరో ఒక నూతన వ్యక్తి గాంధీజీతో కొన్నాళ్ళు ఆశ్ర మంలో ఉండటానికి వచ్చాడు. ఒకనాడు బాపూజీ ఆ వ్యక్తిని తన కాళ్ళు ఒత్తమని కోరారు. గాంధీజీ పద్ధతులు ఎరుగని ఆ వ్యక్తి "కాళ్ళు ఒత్త డానికి ఎవరినైనా అనుభవం కలిగిన వ్యక్తిని పెట్టుకున్నట్లయితే బాగుండే దేమో" అన్నాడు. అందుకు గాంధీజీ "లేదు-నాకు స్నేహితుడు గాని,

బంధువు గాని అయిన వ్యక్తికే ఈ పని చెబుతూ వుంటాను "అన్నారు.
"నాకు కాళ్ళు వొత్తడం బొత్తిగా తెలియదే : అయినా, మీరు ఎలాగో నేర్పితే నేను ప్రయత్నిస్తాను" అన్నాడా నూతనవ్యక్తి.

అప్పుడు గాంధీజీ ఆ వ్యక్తికి కాళ్ళు ఒత్తడం ఎలాగో చూపించారు. ఆ వ్యక్తి అవిధంగానే బాపూజీ కాళ్ళు ఒత్తసాగాడు. కాని, గాంధీజీకి ఆపద్ధతి నచ్చక "కస్తూరిబాయికి తప్ప ఎవరికి కాళ్ళు ఒత్తడం చేతకాదు" అని విసుక్కున్నారు.

తరువాత ఆ వ్యక్తి కస్తూరిబాను కలుసుకొని "ఇంతకాలం నుంచి మీరు గాంధీజీతో ఎలా వేగుతున్నారు?" అని ప్రశ్నించాడు కస్తూరిబా పక్కున నవ్వి "బాపూజీ వద్ద చాలా జాగ్రత్తగా మసులు కోవాలి. ఏ మాత్రం లోటుపాట్లు వచ్చినా సహించరు" అన్నారు

బాపూజీ దస్తూరి

బాపూజి కుడి ఎడమ అనే భేదం లేకుండా ఏ చేతితోనైనా అవలీలగా వ్రాసేవారు. అయితే, ఆయన దస్తూరి ఏమంత సొంపుగా వుండేదికాదు. అందరికీ అర్థం అయ్యేదికాదు. దస్తూరి మెరుగుపర్చుదామని కొంత ప్రయత్నం చేశారుగాని అది ఏమంత మెరుగుపడలేదు.

బాపూ చనిపోయేవరకు అనేక భాషలు నేర్చుకోవడానికి కృషి చేస్తూనే వున్నారు. చనిపోవడానికి కొద్దిరోజుల ముందుకూడా ఆబాగాంధీ వద్ద బెంగాలీ నేర్చుకున్నారు, బాపూజీ పది భాషలలో సంతకం చేయగలిగే వారు.

విదేశాలనుంచి గాంధీజీకి వచ్చే ఉత్తరాలలో కొన్నింటిపైచిరునామా ఈ విధంగా వుండేది "మహాత్మా గాంధీ, కేరాఫ్ గాంధీ జైలు, ఇండియా" మరికొన్ని ఉత్తరాలపై గాందీజీ బొమ్మవేసి కేవలం "ఇండియా" అని

మాత్రం చిరునామా వ్రాసివుండేది. వీటి నన్నిటిని తపాలా అధికారులు జాగ్రత్తగా గాంధీజీ ఎక్కడ వున్నా అందజేసేవారు.

"ఎక్కువ పని: తక్కువ తిండి"

గాంధిజీ తన ఆహారం విషయంలో చాలా జాగ్రత్తగా వుండేవారు. తన శరీరానికి ఎన్నికెలరీలు కావాలో అన్ని కెలొరీలను సమకూర్చే ఆహారాన్ని మాత్రమే తీసుకునేవారు. అంతకుమించి ఒక్కముద్ద కూడా ఎక్కువ తినేవారుకాదు. అంతేకాదు, ఎక్కువ శ్రమ చేసినప్పుడు తక్కువ ఆహారం తీసుకోవాలని ఆయన నియమంగా వుండేది.

గాంధిజీ చేయని పనిలేదు. వంటచేసేవారు, బట్టలు కుట్టేవారు, ఇల్లు ఊడ్చేవారు, వడ్రంగి పని చేసేవారు, చెప్పులు కుట్టేవారు. గాంధీజీ అనేక రకాల వంటకాలు చేసేవారు అనేక రకాల కూరలు వండేవారు. ఆయన స్వయంగా కుట్టిన చెప్పులు ఒక జతను జనరల్ స్మట్స్‌కు బహూకరించారు కూడా.

బాపూజీ ప్రతిరోజూ గడ్డం స్వయంగానే చేసుకునేవారు. అద్దం కూడా లేకుండా రేజర్‌తో చేసుకోవడం ఒక విశేషం. అప్పుడప్పుడు మనూబెన్ గాంధికూడా బాపూకు గడ్డంచేస్తూ వుండేది. ఒకసారి మనూ గాంధీని మౌంట్‌బాటెన్ దంపతులకు పరిచయంచేస్తూ గాంధీజీ "ఈ పిల్ల నాకు సబ్బు రుద్దకుండా కూడా గడ్డం చేస్తూవుంటే హాయిగా గడ్డం చేస్తున్నంతసేపు నిద్ర పోతూవుంటాను" అన్నారట.

రైలు, ఓడ, చిన్నకారు, సైకిల్, పడవ రిక్షా ఒంటె మొదలైన అన్నిరకాల ప్రయాణ సాధనాలపైన ప్రయాణించారుగాని గాంధీజీ ఎన్నడూ విమానం ఎక్కలేదు. వార్ధా ఆశ్రమం మీదుగా ఎన్నడైనా విమానం వెడుతూ వుంటే గాంధిజీ బయటకు వచ్చి వింతగా చూస్తూవుండేవారట.

గాంధీజీ మొట్టమొదటిగా చూసిన సినిమా "మిషన్ టు మాస్కో" అనబడేది. అయితే ఈ సినిమా ఆయనకు నచ్చలేదట. తరువాత ఒకసారి గాంధీజీ "రామరాజ్యం" అనబడే మరొక సినిమాకూడా చూశారట.

## ఎడంచేత్తో బాడ్మింటన్

అవి గాంధీజీ పూనాలోని అగాఖాన్ ప్యాలెస్‌లో బందీగానున్న రోజులు శ్రీమతి సరోజినీనాయుడు మొదలైన కాంగ్రెస్ నాయకులుకూడా అక్కడే బందీలుగా వున్నారు. అరోజు బాపూజీ జన్మదినంకావడంతో ప్యాలెస్‌లో వున్న కాంగ్రెస్ నాయకులంతా ఎంతో సంబరంగా గాంధీజీ జన్మదినోత్సవం జరుపుకున్నారు.

ఆ సందర్భంగా ఆ సాయంత్రం ఆటలపోటీలు జరిగాయి. శ్రీమతి సరోజినీనాయుడు తదితరులు బాడ్మింటన్ ఆడుతున్నారు. ఆట ఆసక్తిగా చూస్తూ కూర్చున్న గాంధీజీతో "బాపూజీ మీరుకూడా బాడ్మింటన్ ఆడతారా?" అన్నారు ఒకరు అందుకాయన ఒకింత దర్పంగా "ఏం? ఈమాత్రం ఆట నేను ఆడగలను" అంటూ ఓ ఆటగాని చేతిలోని బాట్ పుచ్చుకున్నారు. నిజానికి ఆయన అంతకుముందెన్నడూ బాట్ పుచ్చుకొని గాని, ఆడిగాని ఎరగరు.

శ్రీమతి సరోజినీనాయుడు తన అలవాటు చొప్పున ఎడమచేత్తో బాట్ పుచ్చుకొని సర్వీసు ప్రారంభించారు. బాపూజీ కూడా ఎడమ చేత్తోనే ఆడాలి కాబోలనుకొని వెంటనే ఎడంచేత్తో బాట్ పుచ్చుకొని బాల్ అందుకోబోయారు చుట్టూ కూర్చొన్నవారంతా అదిచూచి పగలబడి నవ్వారు. తనపొరబాటు గ్రహించిన బాపూజీ తన అమాయకత్వాన్ని బయటపడనివ్వకుండా "ఏమిటి అలా పిచ్చిగా నవ్వుతున్నారు? నేను కావాలనే ఎడమచేత్తో ఆడుతున్నా ఆడవాళ్ళతో ఆడేందుకు కూడా కుడిచెయ్యి ఎందుకు?" అన్నారు సమయస్ఫూర్తిగా. గాంధీజీ సమయస్ఫూర్తికి అక్కడివారంతా మరోసారి నవ్వారు. 

తన ఆంగ్ల పాండిత్యంతో గాంధీజీని
విరగబడి నవ్వేట్లు చేసిన

# కస్తూరిబా గాంధీ

---

కస్తూరిబాకు చదువుసంధ్యలు పెద్దగా లేకపోయినా లోకజ్ఞానం, విచక్షణా పరిజ్ఞానం ఎక్కువగా వుండేవి. ఆవిడలోని సనాతన భావాలు



త్వరగా మారేవికావు గాని గాంధీజీ సహచర్యంతో ఆవిడ కూడా సర్వ మత సమానత, హరిజనులపట్ల ప్రేమ అలవర్చుకోసాగింది. ఉదాహరణకు, గాంధీజీ పెంచిన హరిజన బాలిక లక్ష్మిని తన స్వంత కుమార్తె వలెనే ఆదరించేది. హిందూ పర్వదినాలలో చేసిన పిండి వంటలను హిందూ, ముస్లిం, పారసీల మత విభేదం లేకుండా అందరకూ పంచి పెట్టేవారు. అలాగే ముస్లిం, హరిజనులనే తారతమ్యం లేకుండా వారు చేసిన వంటకాలను తాను భుజించేవారు.

## అ తి థి మ ర్యా ద

ఆశ్రమానికి వచ్చిన అతిథులను మిక్కిలి ఆదరాభిమానాలతో చూసే వారు కస్తూరిబా. వారి వారి కుటుంబ క్షేమ సమాచారాలను అడిగి తెలుసు కునేవారు. అతిథుల సౌకర్యం కోసం ఒక్కొక్కప్పుడు ఆశ్రమ నియమా లను కూడా ఉల్లంఘించిన సందర్భాలుకూడా వుండేవి.

ఉదాహరణకు పండిట్ నెహ్రూకు, సి.ఎఫ్. ఆండ్రూస్‌కు టీ త్రాగ డం అలవాటు. రాజాజీకి కాఫీ అలవాటు. కాని ఈ రెండు పానీయాలు ఆశ్రమంలో నిషిద్ధం. అయినా వీరు వచ్చినప్పుడు కస్తూరిబా వీరి కోసం ప్రత్యేకంగా కాఫీ, టీలు తయారుచేసి ఇచ్చేవారు.

ఈ విధంగా చేయడంతో ఒక్కొక్కప్పుడు గాంధిజీ జోక్యం కలుగచేసుకొని "ఈ కాఫీ, టీలతో వారిని పాడుచేస్తున్నావు" అనేవారు కస్తూరిబాతో.

రాజేంద్రప్రసాద్, జవహర్‌లాల్ నెహ్రూ, అబుల్‌కలాం అజాద్, సర్దార్ పటేల్ మొదలైనవారంతా ఆశ్రమానికివచ్చి గాంధీజీతో చర్చలు ముగించుకొని వెళ్ళేటప్పుడు కస్తూరిబాను కలుసుకొని కాసేపు పిచ్చాపాటీ మాట్లాడి వెళ్ళుతూ వుండేవారు. అబుల్‌కలాం ఆజాద్ కస్తూరిబా ఆరో గ్యం గురించి ముచ్చటించుతూ వుండేవారు. నెహ్రూ కాస్త ఉద్రేకస్వభా వం కలవాడు కావడంచేత విప్లవ ధోరణులుగురించి చెబుతూ వుండేవారు. ఇక సర్దార్ పటేల్ చిన్నపిల్లవాడిలా కస్తూరిబా మనుమడితో ఆటలాడుతూ వుండేవారు.

జవహర్‌లాల్ నెహ్రూ ఎప్పుడైనా కస్తూరిబాతో ముచ్చటించకుండా కేవలం నమస్కరించి వెళ్ళిపోతే, కస్తూరిబా దిగులుపడి పోయేవారు. వెంటనే గాంధీజీవద్దకు వెళ్ళి "జవహర్ ఇవ్వాళ నాతో ఏమీ మాట్లాడకుండానే వెళ్ళిపోయాడు. మనిషి అదోలా వున్నాడు. మీకు, జవహర్‌కు ఏమైనా అభిప్రాయభేదాలు వచ్చినాయా? మీ రేమైనా అతడికి కష్టం కలిగించే మాటలు అన్నారా?" అని ఆదుర్దాగా ప్రశ్నించేవారు. గాంధీజీ తేలిగ్గా నవ్వేసి "నెహ్రూలాగా నీకూ చిరుకోపం జాస్తిసుమా! అయినా, నెహ్రూను నేనేమీ అనలేదే" అని సమాధానపర్చేవారు. ఈ విధంగా కస్తూరిబా ఆశ్రమానికి వచ్చిన వారిని ఎంతో అప్యాయంగా చూసేవారు.

## కస్తూరిబా ఆంగ్ల పాండిత్యం

కస్తూరిబాకు పెద్దగా చదువు సంధ్యలు ఏమీ లేవు. మాతృ భాష మాత్రం కొద్దిగా చదవనూ, వ్రాయనూ వచ్చు. బాపూజీ కొంతకాలం ఆవిడకు చదువు నేర్పడానికి ప్రయత్నించారు, గాని కస్తూరిబాకు అబ్బలేదు.

1930లో ఒకసారి కస్తూరిబా జైలులో వున్నప్పుడు ప్రక్క ఖైదీ ఒకరికి ఇంగ్లీషు వచ్చునని తెలుసుకున్నారు. ఆవిడకు ఇంగ్లీషు నేర్చుకోవాలని కోర్కె కలిగింది. అప్పటికి ఆవిడకు 60 ఏళ్ళు. అక్షరాలు నేర్చుకోవడానికే అనేక రోజులు పట్టింది. ఎలాగైతేనేమి కొన్ని మాసాలు తంటాలుపడిన తర్వాత కొన్ని మాటలు నేర్చుకొన్నారు. ఎలాగైనా బాపూజీ అడ్రసు ఇంగ్లీషులో తనంతట తాను స్వయంగా వ్రాయవలెనని ఆవిడ తాపత్రయం.

ఒకసారి కస్తూరిబా భోపాల్ నవాబ్ అతిథిగా వెళ్ళారు. భోజన సమయంలో గాంధీజీకి కొద్దిగా తేనె కావలసివచ్చింది. ప్రక్కనే వున్న సేవకుడికి హిందీరాదు: ఇంగ్లీషు మాత్రం వచ్చునట. అందువలన కస్తూరిబా అతడిని తేనె తెమ్మనడానికి 'హనీ' (తేనె) అనే ఇంగ్లీషు మాట వెంటనే రాక బీస్ (తేనె టీగలు) ఫ్లవర్స్ (పువ్వులు) హనీ అని నత్తులు నత్తులు కొడుతూ మాట్లాడటంతో బాపూజీ కస్తూరిబా ఆంగ్ల పాండిత్యానికి విరగబడి నవ్వేశారు. సేవకుడు మాత్రం ఎలాగో అర్థం చేసుకొని తేనె తెచ్చి గాంధీజీకి ఇచ్చాడు.

## ఆటలంటే ఆసక్తి

కస్తూరిబా, బాపూజీలు ఆటపాటలంటే అమిత ఆసక్తి చూపేవారు. ఆగాఖాన్ ప్యాలెస్‌లో వారు నిర్బంధంలో వున్నప్పుడు బ్యాడ్మింటన్, పింగ్‌పాంగ్, క్యారమ్సు ఆడుతూ వుండేవారు. ఒకసారి వారిద్దరు పింగ్ పాంగ్ ఆడుతున్న సందర్భంలో బాపూ విసిరిన బంతి కస్తూరిబా తీయలేక పోవడంతో చుట్టూ చేరిన జనం విరగబడి నవ్వారు. కస్తూరిబాకు ఉబ్బసం వుండడంతో ఈ పింగ్‌పాంగ్ ఆటకు స్వస్తి చెప్పవలసి వచ్చింది.

కస్తూరిబా క్యారమ్సు ఆడేటప్పుడు ఎప్పుడూ ఎర్రబిళ్ళ వేసుకోవడం కోసం చూస్తూ వుండేవారు. ఎర్రబిళ్ళ వేసుకుంటే ఆట పోయినా ఫరవా లేదని అంటూ వుండేవారు. క్యారమ్సు ఆడుతూ తన జబ్బు విషయంకూడా మర్చిపోయేవారు.

తీవ్రంగా సుస్తీచేసి క్యారమ్సు ఆడలేని పరిస్థితిలో మిగతా ఆట గాళ్ళను బోర్డు తన మంచం వద్దకు తెచ్చి ఆడమని కోరేవారు. కస్తూరిబా వారి ఆటవంక చూస్తూ ఆనందిస్తూ వుండేవారు. చనిపోవడానికి 4, 5 రోజులు ముందుకూడా కస్తూరిబా క్యారమ్సు ఆడారు. ★

## మాష్టారు కుర్చీలో కూరున్న

# పటేల్

కేంద్ర హోంశాఖ మాజీ మంత్రి సర్దార్ వల్లభాయ్ పటేల్ విద్యార్థి దశలో చాలా చురుకుగా వుండేవారు. అన్ని క్లాసులలోను ప్రథము



డుగా ఉత్తీర్ణుడవుతూ వుండేవారు. అంతేగాక ఆయన చిన్నప్పటినుంచి ఎంతో పట్టుదల గల మనిషి. అన్యాయం అనేది ఎక్కడ జరిగినా సహించని మనిషి. ఆయన విద్యార్థి దశలో జరిగిన ఈ క్రింది సంఘటనలు సర్దార్ పటేల్ సాహసానికి, నిర్భీతికి మచ్చుతునకలు.

## ఉపాధ్యాయుడికి గుణపాఠం

ఒకసారి పటేల్ స్కూలులో చదువుకుంటున్న రోజులలో ఒక ఉపాధ్యాయుడు అన్యాయంగా ఒక విద్యార్థిని కొట్టడం జరిగింది. దానితో పటేల్‌కు ఆ ఉపాధ్యాయునిపై ఎంతో కోపం వచ్చింది. వెంటనే తోటి విద్యార్థులను సమావేశపర్చి "ఈ అన్యాయాన్ని సహించడానికి వీల్లేదు. అన్యాయంగా విద్యార్థిని కొట్టిన ఆ ఉపాధ్యాయుడికి గుణపాఠం నేర్పాలి. ఆ ఉపాధ్యాయుడు క్షమార్పణ చెప్పేవరకు మనం క్లాసుల్ని బహిష్కరించాలి" అని ఉద్బోధించాడు. వెంటనే విద్యార్థులు స్కూలు బహిష్కరించి సమ్మె ప్రారంభించారు. మూడు రోజులు సమ్మె బ్రహ్మాండంగా సాగింది. నాలుగవ రోజున ఆ ఉపాధ్యాయుడు క్షమాపణ చెప్పుకోక తప్ప లేదు.

## "మీసం తీసేదాకా కదలం"

పటేల్‌కు అన్యాయంగా ప్రవర్తించే టీచర్లంటే ఎంత ద్వేషమో సద్గుణ సంపన్నులైన టీచర్లంటే అంత భక్తికూడా వుండేది. ఒకసారి విద్యార్థులలోను, ప్రజలలోను మంచివాడుగా పేరొందిన ఒక టీచరు స్థానిక మున్సిపాలిటీ మెంబరుగా ఎన్నికలలో పోటీచేయడం జరిగింది. ఆ ఉపాధ్యాయుడికి పోటీగా మంచి పలుకుబడి, ధనబలం కల్గిన వ్యక్తి నిలబడ్డాడు. ఆ వ్యక్తి సామాన్యుడైన ఆ ఉపాధ్యాయుడిపై గెలవడం ఎంతో సునాయాసం అనుకున్నాడు. అంతేగాక ఆ టీచరుపైనే గనుక గెలవలేకపోతే మీసం తీసివేస్తానని బహిరంగంగానే చెబుతూ వుండేవాడు.

పటేల్ విద్యార్థులను సమీకరించి ఇంటింటికీ తిరిగి ఆ ఉత్తమ ఉపాధ్యాయుని తరపున తీవ్రమైన ప్రచారం చేశారు. విద్యార్థుల కృషి ఫలితంగా ఉపాధ్యాయుడు గెలవడం, మీసం గొరిగించుకుంటానన్న పెద్దమనిషి ఓడిపోవడం జరిగింది. ఆనందాతిరేకంతో తోటి విద్యార్థులు వెంట రాగా

పటేల్ ఓడిపోయిన వ్యక్తి ఇంటికి వెళ్ళి "మీసం తీసివేసే వరకు మేము ఇక్కడనుంచి కదలం" అంటూ నినాదాలు ప్రారంభించారు. పాపం ఆ పెద్దమనిషి మీసం తీసివేయక తప్పలేదు.

## మాష్టారు కుర్చీలో కూర్చున్న పటేల్

మరొకమారు జరిగిన సంఘటన ఇది. క్లాసులో టీచరు ఆల్ జీబ్రా లెక్క బోర్డుపై వేసి చూపుతున్నాడు. ఆ టీచర్ కు ఆ లెక్కకు ఎంత సేప టికి ఆన్సర్ రావడంలేదు. చురుకైన పటేల్ లేచి "సార్! ఈ లెక్క మీ వల్ల కాకపోతే నేను చేస్తాను" అన్నాడు. టీచర్ ఉక్రోషంతో మండిపడి "చేసి నువ్వే మాష్టారు అనిపించుకో" అన్నాడు.

పటేల్ చకచకా బోర్డువద్దకు వెళ్ళి లెక్కవేసి చూపాడు విద్యార్థులు హర్షధ్వానాలు చేశారు. పటేల్ దర్జాగావెళ్ళి మాష్టారుగారి కుర్చీలో కూర్చు న్నాడు. మాష్టారుగారు విసవిసా హెడ్ మాష్టారు వద్దకు వెళ్ళి పటేల్ తన కుర్చీలో కూర్చున్నాడని రిపోర్టు చేశాడు. హెడ్ మాష్టారు పటేల్ ను పిలి పించి సంజాయిషీ అడిగాడు. "అవును సార్, నన్ను మాష్టారుగారు లెక్క చేసి మాష్టారు అనిపించుకో అన్నారు. లెక్కచేసి మాష్టారులాగానే కుర్చీలో కూర్చున్నాను, ఇందులో నా తప్పేమున్నది?" అని పటేల్ ఎలాంటి జంకు లేకుండా సమాధానం చెప్పాడు.

హెడ్ మాష్టారు పరిస్థితిని అర్థం చేసుకున్నారు. అయినా హెడ్ మాష్టారు హోదాలో "ఏమైనా నీవలా మాష్టారుగారి కుర్చీలో కూర్చో కూడదు. ఈసారి అలా చేస్తే స్కూలునుంచి గెంటివేస్తా. జాగ్రత్త" అన్నాడు. పటేల్ విసురుగా "మీరు గెంటవలసిన పనిలేదు. ఇటువంటి స్కూల్లో వుంటే నాకేమి చదువు వస్తుంది? నేనే పోతున్నాను" అంటూ బయటకు వచ్చేసి మర్నాడు మరొక స్కూల్లో చేరాడు.



## పటేల్ గుండె నిబ్బరం

సర్దార్ పటేల్‌కు చిన్నతనంలో ఒకసారి చంకలో సెగ్గడ లేచింది. ఆ రోజుల్లో ఇంగ్లీషు మందులు లేవుకదా ఇటువంటి వాటికి గ్రామాల్లో నాటువైద్యులు కాల్చటం ద్వారా చికిత్స చేసేవారు. పటేల్ నాటు డాక్టరు వద్దకు చికిత్సకోసం వెళ్ళాడు. ఆ డాక్టరు ఇనుపకడ్డీ ఎర్రగాకాల్చి చిన్న పిల్లవాడయిన పటేల్ ఆ బాధకు తట్టుకుంటాడో లేదోనని కాల్చటానికి తటపటాయించుతూవుండగా "అలా గడగడలాడతారేంటి. నేనుకాల్చుకుంటా ఆ కడ్డీ ఇటివ్వండి" అని తనే కడ్డీ తీసుకుని స్వయంగా కాల్చుకున్నాడట. అలాగే పటేల్ ఇంగ్లాండులో బారిస్టర్ చదివేరోజుల్లో కాలుపై నారి కురుపు లేచింది. మత్తుమందు లేకుండానే దానికి ఆపరేషన్ చేయించుకున్నారు. ఆపరేషన్ చేసిన డాక్టర్ పటేల్ గుండె నిబ్బరానికి ఆశ్చర్యపోయాడట!

## తాగుబోతు మేజిస్ట్రేట్

సర్దార్‌పటేల్ వకీలు జీవితంలో జరిగిన సంఘటన— ఒకసారి అబ్కారీ ఇన్‌స్పెక్టర్ దొంగసారా తయారు చేసేవాడ్ని పట్టుకొని కేసు పెట్టాడు. అందుకు సాక్ష్యంగా రెండు సీసాలు అక్రమంగా తయారుచేసిన సారాకూడా మేజిస్ట్రేట్ కోర్టులో ప్రదర్శించాడు. దొంగసారా నేరస్తుడు పటేల్‌ను తన వకీలుగా పెట్టుకున్నాడు.

సర్దార్ పటేల్ ఈ కేసుని వాదిస్తూ కోర్టులో ప్రదర్శించబడ్డ రెండు సారాసీసాల్ని పరీక్షకు పంపాలనికోరాడు. తీరా వాటిని పరీక్షించితే వాటిలో సారాగాక నీరు మాత్రమే వున్నట్లు తేలింది. దాంతో అబ్కారీ ఇన్‌స్పెక్టర్ పెట్టిన కేసు ఓడిపోయింది. దొంగ సారావారు నిర్దోషి అని తీర్పు యిచ్చారు.

కోర్టు బయటకు వచ్చిన ఇన్‌స్పెక్టర్ పటేల్ వద్దకు వెళ్ళి "వకీలు గారూ నాకు ఆశ్చర్యంగా వుంది. ఆ సీసాలలో సారా ఏమైనట్లు? నీరు

ఉండటమేంటి?" అని ప్రశ్నించగా పటేల్ బిగ్గరగా నవ్వుతూ "నీకు మేజి స్ట్రేట్ సంగతి తెలియదనుకుంటా. ఆయన కట్టు త్రాగుబోతు. సీసాలలో సారాకొస్తా త్రాగి ఎవరు చూస్తారులెమ్మని నీరు నింపాడు. అదీ అసలు విషయం" అనటంతో ఇన్స్పెక్టర్ తెల్లముఖం వేశాడట!

## పటేల్ రాజనీతి

సంస్థానాలను విలీనం చేసే ప్రయత్నంలో సర్దార్ పటేల్ దేశ పర్య టన చేస్తున్నారు. ఒరిస్సాలో 26 సంస్థానాలున్నాయి. ఈ సంస్థానాధీశుల్ని అందర్నీ కటక్‌లో సమావేశపర్చారు. వీరు ఎలాగైనా భారత్‌లో విలీనం గాకుండా స్వతంత్రంగా వుండాలనే యత్నంలో వున్నారు. సర్దార్ పటేల్ వీరికి ఎంత నచ్చజెప్పినా ఆయన మాటలను పెడచెవిని పెడుతున్నారు. చివరకు విసిగిపోయిన సర్దార్ పటేల్ తీవ్రస్వరంతో "మీకు 24 గంటలు టైం ఇస్తున్నాను. మీ మనస్సు మార్చుకొని భారత్‌లో విలీనం అయితేసరే లేకపోతే భారత సైన్యం మిమ్మల్ని ముట్టడించక తప్పదు." అంటూ చర చరా సమావేశంనుంచి బయటకువచ్చి రైల్వేస్టేషన్‌కు వెళ్ళి వెయిటింగ్ రూంలో కూర్చున్నారు.

సమావేశంలో పటేల్‌తోపాటు పాల్గొన్న భారత ప్రభుత్వ సలహా దారు వి. పి. మీనన్ పటేల్ వెంట వెళ్ళకుండా వెనుక వుండిపోయి 26 గురి సంస్థానాధీశులకు మరోమారు నచ్చచెప్పటానికి ప్రయత్నించారు. భారత ప్రభుత్వంతో ముఖ్యంగా పటేల్‌తో విరోధం తెచ్చుకోవటం వలన అన ర్థాలు, భారత్‌లో చేరటంవలన లాభాలు వగైరా గురించి ఏకరువు పెట్టారు. పటేల్‌తో విరోధం పెట్టుకోవటం వలన తాము సాధించేది ఏమీలేదని తెలుసుకున్న సంస్థానాధీశులు వి.పి. మీనన్ వెంటపడి సర్దార్ పటేల్‌ను కలుసుకోవటానికి రైల్వేస్టేషన్‌కు వచ్చారు. భారత్‌లో చేరటానికి తమ అంగీకారం తెలియజేసి పటేల్‌వద్ద సెలవు తీసుకున్నారు. 

# పండిట్ నెహ్రూని "నోరుమూసుకు కూర్చో" అన్న హాస్య చక్రవర్తి

# రాజాజీ

రాజాజీగా సుప్రసిద్ధుడైన రాజగోపాలాచారి గవర్నర్ జనరల్‌గా వున్నప్పటి సంగతి. ఒకనాడు రాజాజీ ఢిల్లీ నుంచి ఓక్లా వెళుతున్నారు. మధ్యలో రైల్వేలెవెల్ క్రాసింగ్ ఒకటివుంది. రాజాజీకారు, ఆయనను అనుసరిస్తున్న సిబ్బంది కార్లు అక్కడికి వచ్చేటప్పటికి రైలుగేటు వేసివుంది. సిబ్బంది హడావుడిగా గేటు కాపలా దారు వద్దకువెళ్ళి తామెవరోచెప్పి రైలు రావటానికి కొంత ఆలస్యం వుంది కాబట్టి, గేటు తీస్తే తాము వెళ్ళిపోతా మన్నారు. కాపలాదారు అందుకు నిరాకరించి గవర్నర్ జనరల్‌గానిమరెవరైనాగాని ఇప్పుడు



రాజాజీ ప్రశ్నించారు. ఆ పెద్దమనిషి సిగ్గుపడుతూ "నా కట్టుడు పన్ను దాంట్లో ఇరుక్కుపోయింది" అనటంతో రాజాజీతో సహా మట్లావున్న అతిథు లందరూ పిరగబడి నవ్వారు!

## స్వచ్ఛమైన నెయ్యా? డాల్డానా?

రాజాజీ గవర్నర్ జనరల్‌గా వున్నప్పుడుజరిగిన మరో సంఘటన. ఒకసారి ఢిల్లీలో ఏదో సమావేశానికి వచ్చిన రాష్ట్ర ముఖ్యమంత్రుల గౌర వార్థం గవర్నర్ జనరల్ విందు ఏర్పాటుచేశారు.

దేశానికి స్వతంత్రం రాకముందు గవర్నర్ జనరల్ చేసే విందు ల్లో శాకాహారులకుప్రత్యేకవంటకాలువుండేవికావు. కేవలంమాంసాహారమే ఏర్పాటు చేసేవారు. మరి ఇప్పటి గవర్నర్ జనరల్ రాజాజీ పూర్తిగా శాకాహారి కాబట్టి మాంసాహార భోజనాలు, శాకాహార భోజనాలు వేరు వేరుగా ఏర్పాటుచేశారు. శాకాహార భోజనాలు వడ్డించే బల్లమీద "V" అనే అక్షరం గుర్తుగా అంటించారు. శాకాహార భోజనం చేస్తున్న ఒక పెద్ద మనిషి ప్రక్క బల్లమీద మాంసాహార వంటలు లొట్టలువేస్తూ తింటున్న తన మిత్రులను చూసి నోరూరి వడ్డిస్తున్న సర్వర్‌ను మెల్లగా పిల్చి ఆవంట కం నాకు కూడా తెచ్చిపెట్టమని కోరాడు. ఆ తెచ్చిన వంటకాన్ని సంకోచం లేకుండా అమాంతంగా గుటుక్కుమనిపించిన తర్వాత మళ్ళీ ఆ సర్వర్‌ని పిల్చి ఇదిగో ఈ మాట ఎవరితోనూ చెప్పమాక. నా పరువు పోతుంది" అన్నాడట.

అదేవిందులో మరొక శాకాహార పెద్దమనిషి వడ్డన అజ్మాయిషీచేసే అధికారిని పిల్చి "ఏమయ్యా ఈ వంటలు స్వచ్ఛమయిన నేతితో తయారు చేశారా లేక డాల్డాతోనా?" అని ప్రశ్నించాడట. ఆ అధికారి ఈ మాట కాస్తా తీసుకువెళ్ళి రాజాజీకి చెబితే రాజాజీ "ఇంకానయం. ఆ నెయ్యి తెల్ల

ఆవు నెయ్యా, నల్ల ఆవు నెయ్యా అని ఆరా తీయలేదు" అని నవ్వు కున్నారట.

## "నోరుమూసుకు కూర్చో"

రాజాజీ పశ్చిమ బెంగాల్ గవర్నర్‌గా వున్నప్పుడు ఒకసారి ప్రధాని నెహ్రూ ఆ రాష్ట్రి పర్యటనకు వచ్చారు. రాజాజీ నెహ్రూ గౌరవార్థం విందు ఏర్పాటుచేశారు. రాజాజీ నిఖార్సయిన శాకాహారికదా, మాంసాహారి అయిన ప్రధాని నెహ్రూ విందుకు వస్తూ రాజాజీ సెక్రటరీతో "విందు ఏర్పాటు చేశారు బాగానేవుంది కాని వట్టి కాయగూరలతో కడుపు మాడ్చరుగదా" అని నవ్వారట.

ఆ సందర్భంగానే గ్రూప్‌ఫోటో ఏర్పాటు చేయబడింది. రాజాజీ ముఖ్యమంత్రి ఇతర మంత్రులు వరుసగా కూర్చున్నారు. ప్రధాని నెహ్రూ వచ్చి రాజాజీ ప్రక్కన కూర్చున్నారు. ఫోటోగ్రాఫర్ యథాలాపంగా వారివద్దకు వచ్చి ఒక్కొక్కళ్ళనీ సర్దుతున్నారు. పండిట్ నెహ్రూ చికాకు పడి "ఈ ఫోటోగ్రాఫర్ మనల్ని ఏంచేయమంటాడు?" అనగా, రాజాజీ తక్షణం అందుకుని "అట్టే ఏం చేయమనటంలేదు. మనల్ని నోరుమూసు కుని కూర్చోమంటున్నాడు" అని చమత్కరించారు.

## "కొండవద్దకు తరలివచ్చాను"

రాజాజీ పశ్చిమబెంగాల్ గవర్నరుగా వున్నప్పుడు శరత్‌బాబు... (శరత్‌చంద్రబోస్)ను కలుసుకోవాలనుకున్నారు. శరత్‌బాబుకు ఆహ్వానం పంపుతూ తోడ్కొనిరమ్మని తన సెక్రటరీని పంపారు. కానీ శరత్‌బాబు గవర్నరు సెక్రటరీతో తాను వృద్ధాప్యం కారణంగా బయటకు ఎక్కడకూ వెళ్ళటంలేదనీ పైగా ఆరోగ్యం కూడా సరిగాలేదనీ మరొకసారి ఎప్పు డయినా గవర్నరుగార్ని కలుసుకుంటానని విన్నవించుకున్నారు.

ఆ మాట వచ్చి రాజాజీకి సెక్రటరీ చెప్పగా "అయితే మనమే ఆ కొండ వద్దకు వెళ్ళాలి. వారివద్దకు వెళ్ళటానికి ఏర్పాట్లు చెయ్యి" అని ఆజ్ఞాపించారు. మర్నాడు ప్రొద్దున్నే రాజాజీయే స్వయంగా శరత్‌బాబు ఇంటిముందు ప్రత్యక్షమయ్యారు. రాజాజీని గేటువద్ద చూడటంతోనే శరత్ బాబు గబగబా వచ్చి రాజాజీని కౌగిలించుకున్నారు. అప్పుడు రాజాజీ "నేనే కొండవద్దకు తరలివచ్చాను" అన్నారు.

## గవర్నర్లు ఉత్సవ విగ్రహాలే

రాష్ట్ర గవర్నర్ల అధికారాలు ఏపాటివో 40 సంవత్సరాల క్రిందట రాజాజీ పశ్చిమ బెంగాల్ గవర్నరుగా వున్నప్పుడు జరిగిన సంఘటనచూస్తే తెలుస్తుంది. ఒకసారి కొంతమంది సంఘ సేవికలు తమ సంస్థ సహాయార్థం చేతిపనుల ప్రదర్శన ఏర్పాటు చేయదలిచామని, అందుకుగాను గవర్నరు బంగళాలో కొంత భాగం కేటాయించవలసిందిగా కోరారు. అందుకు రాజాజీ "మీరు చేయదలుచుకున్న పని మంచిదే, అయితే ఈ బంగళా నా స్వంతం కాదు. ప్రభుత్వానిది, గవర్నరును అయినా ఈ భవంతిమీద నాకు ఏ మాత్రం అధికారం లేదు. ఈ భవంతిలో నేనొక ఉత్సవ విగ్రహాన్ని. అప్పుడప్పుడు ఈ విగ్రహాన్ని మేళతాళాలతో ఊరేగింపుగా బజార్లవెంట తిప్పి తిరిగి దాన్ని తీసుకువచ్చి ఈ భవంతిలో ప్రతిష్ఠిస్తూ వుంటారు. నేనేది చెయ్యదలుచుకున్నా ముఖ్యమంత్రి ద్వారా మాత్రమే చేయవలసి వుంటుంది. ఏ పని స్వతంత్రించి చేయాలనుకున్నా ఏదో ఒక రూలు అడ్డు వస్తుంది. కాబట్టి మీరు ముఖ్యమంత్రిని కల్సుకోండి" అని వాళ్ళను పంపేశారట.

## ప్రాక్టికల్ జోక్ అంటే ఇదేనా?

రాజాజీ గవర్నర్ జనరల్‌గా వున్నప్పుడు ఒకానొక కామన్‌వెల్తు దేశ ప్రధాని గౌరవార్థం విందు జరిగింది. విందుకు కొద్దిమందిని మాత్రమే ఆహ్వానించారు. ఒక టేబుల్ ముందు గవర్నర్ జనరల్ రాజాజీ, ఆయన స్నేహితుడు టి. విజయరాఘవాచారి, ప్రధాని పండిట్ నెహ్రూ, కామన్ వెల్తు దేశ ప్రధాని కూర్చున్నారు.

అది వేసవికాలం కావడంవల్ల రసం మామిడిపళ్ళు విందులో వడ్డించారు. ఆ కామన్‌వెల్తు దేశ ప్రధాని లోగడ ఎప్పుడూ మామిడి పళ్ళ రుచి చూడినవాడు కాకపోవడంవల్ల పండిట్ నెహ్రూ వాటిని గురించి వివరించి చెబుతున్నారు. వడ్డించిన మామిడిపండుకు ఒకవైపున చాకుతో కొద్దిగా రంధ్రంచేసి ఎలా పిండుకోవాలో ముఖ్య అతిథికి వివరించారు.

ముఖ్య అతిథి ఆ విధంగానే మామిడికాయను కోసి ప్లేటులో రసం పిండుకోబోయారు— అది బాగా మగ్గిన మామిడి పండేమో, పైగా ముఖ్య అతిథికి కొత్త కాబట్టి మామిడిపండును గట్టిగా పిండేసరికి అందులో టెంకె కాస్తా రివ్వున ఎగిరి ఎదురుగా కూర్చున్న టి. విజయరాఘవాచారి ముఖానికి కొట్టుకుని జారి వొళ్ళో పడింది. పాపం! విజయరాఘవాచారిగారి ముఖం అంతా ఖరాబు అయింది. బట్టలనిండా మామిడిరసం చిందింది.

ఇదంతా చూస్తున్న పండిట్ నెహ్రూ విరగబడి నవ్వుతూ వుండగా, ముఖ్య అతిథి బిక్కమొహం వేసి చూస్తూ వుండిపోయాడు. విజయరాఘవా చారి కుర్చీమీద నుంచి లేచి "ప్రాక్టికల్ జోక్ అంటే ఇదే కాబోలు!" అన్నారట.

రాజాజీ జోక్యం చేసుకుని "మామిడిపండ్లు బాగా పండివుంటే అప్పుడప్పుడూ ఇలాగే జరుగుతూ వుంటుంది" అంటూ విజయరాఘవాచారి

వైపు చూస్తూ "అయినా, మీరు ఒక్కో చేతిరుమాలు వేసుకుని వుంటేవల సంది" అన్నారట.

విజయరాఘవాచారి కామన్‌వెల్తు దేశ ప్రధానితో "మీరేమీ బాధపడ కండి. జరిగిందేదో జరిగిపోయింది. నేనువెళ్ళి ముఖం కడుక్కొని బట్టలు మార్చుకుని వస్తాను" అంటూ ఆదరాబాదరాగా వెళ్ళారట.

## గవర్నరు జనరల్‌ను వేధించిన భద్రతాదళం

మరొక సంఘటన కూడా రాజాజీ గవర్నర్ జనరల్‌గా వున్నప్పుడే జరిగింది. ఒకసారి ఆయన ఢిల్లీలోనే తన దగ్గర బంధువు ఇంటికి భోజనా నికి వెళ్ళవలసి వచ్చింది. సెక్రటరీ ఎంత చెప్పినా వినకుండా రాజాజీ గవర్నర్ జనరల్‌కు కేటాయించిన కారు, మందీ మార్బలం ఏమీ లేకుండా ఒక చిన్నకారులో బంధువు ఇంటికి వెళ్ళారు. వెడుతూ తన మిలటరీ సెక్రటరీతో తాను రాత్రి 10-30కి తిరిగివస్తానని చెప్పివెళ్ళారు. ఈ సంగతి మిలటరీ సెక్రటరీ మెయిన్ గేటువద్ద వుండే భద్రతా సిబ్బందికి తెలియ చేశాడు.

అలా వెళ్ళిన రాజాజీ త్వరగా భోజనాలు ముగియడంతో 9-30కే వచ్చేశారు. మెయిన్ గేటువద్ద సిబ్బంది రాజాజీ కారు ఆపేసి లోపలికి వెళ్ళడానికి వీలు లేదన్నారు. కారు డ్రైవరుదిగి కారులో గవర్నర్‌జనరల్ గారు వున్నారని లోపలికి పోనిమ్మని చెప్పినా, అలా వీల్లేదు గవర్నర్ జనరల్‌గారు 10-30కి వస్తారని మాకు వర్తమానం అందింది. ఈ కారు వారిది కాదు. మరెవరిదో! లోపలికి వెళ్ళడానికి వీల్లేదని కారును వెనక్కి త్రిప్పమని పేచీ పెట్టారు.

ఈలోగా దగ్గరలోనే వున్న కొంతమంది భద్రతా సిబ్బంది టార్చి లైటు రాజాజీ ముఖానికి వేసి ఆయనో కాదో శోధించడం మొదలుపెట్టారు. అంతలోనే భోజనంచేస్తున్న భద్రతాదళ అధికారి ఈ గొడవ విని హడా

విడిగా వరుగెత్తుకుంటూ వచ్చి రాజాజీని గుర్తించి భద్రతా సిబ్బందినీ చివాట్లువేసి మెయిన్‌గేటు తెరిచాడట.

తరువాత భద్రతాదళ అధికారి మిలిటరీ సెక్రటరీవద్దకు వెళ్ళి తన సిబ్బందిని క్షమించవలసిందిగా రాజాజీకి నచ్చచెప్పవలసిందిగా ప్రార్థించాడట. అయితే, ఇటువంటి స్వల్ప విషయాలు పట్టించుకుని ఎవరినీ శిక్షించే స్వభావంకాదు రాజాజీది.

## మళ్ళీ బంతిలో కూర్చోవచ్చులే !

ఆ రోజుల్లోనే జరిగిన వేరొక సంఘటన. ఒకానొక సందర్భంగా గవర్నర్ జనరల్ భవంతిలో విందు జరుగుతోంది. వడ్డించే సర్వర్ల సౌలభ్యంకోసం ఎర్ర లైట్లు, పచ్చలైట్లు ఏర్పాటు చేయబడ్డాయి.

సర్వర్లకు ఇచ్చిన ట్రెయినింగ్ ప్రకారం పచ్చలైట్లు వెలగగానే సర్వర్లువచ్చి పదార్థాలన్నీ వడ్డించి వెళ్ళాలి. ఎర్రలైటు వెలగగానే భోజనాలు చేయడం అయిపోయిందని, విస్తళ్ళు, ఖాళీ ప్లేట్లు తీసుకువెళ్ళి బల్లలు శుభ్రం చేయమని చెప్పడం.

పచ్చలైట్లు వెలిగాయి. సర్వర్లు బిల బిలావచ్చి భోజనాలు వడ్డించి వెళ్ళారు. కొంతసేపటికి అతిథులందరు భోజనాలు చేయడం అయింది కాని ఒక్క పెద్దమనిషి మాత్రం ఇంకా తాపీగా తింటూనే వున్నాడు. లైట్లువేసే వ్యక్తి అది గమనించకుండా ఎర్రలైట్లు వేశాడు.

సర్వర్లు హడావుడిగావచ్చి ప్లేట్లన్నీ తీస్తూ ఇంకా భోజనం పూర్తి చేయని పెద్దమనిషి వారిస్తున్నా ఆయనవద్ద ప్లేట్లుకూడా తీసివేశారు. పరిస్థితి గమనించి రాజాజీ అక్కడకువచ్చి "ఏం బాధపడకండి; మళ్ళీ బంతిలో కూర్చుందురుగానిలే" అని నవ్వుతుండగా ఆ పెద్దమనిషి మాత్రం తెల్లబోయాడట!



"భార్య కాలంతలేని"

# బాలగంగాధర్ తిలక్

"స్వాతంత్ర్యం నా జన్మహక్కు దాన్ని నేను సాధించి తీరు తాను" అని ఎలుగెత్తి చాటి, నాటి కాంగ్రెసు పార్టీలోని మితవాదులకు, ఆ నాటి బ్రిటిష్ ప్రభుత్వానికి సింహ స్వప్నంగా వుండేవారు లోకమాన్య బాలగంగాధర్ తిలక్. ఆయన రాజకీయాలు ఎప్పుడూ అతివాదంవైపు వుండేవి. అసలు బాలగంగాధర్ తిలక్ మొదటినుంచి తీవ్ర స్వభావం గల మనిషి, మాటలకంటె చేతల మనిషి. ఆయన విద్యార్థిగా వున్నప్పుడు జరిగిన సంఘటనలు ఇవి:



తిలక్ కాలేజీలో చదువుతున్న రోజులవి. హాస్టల్‌లోని కుర్రవాళ్ళందరూ డాబామీద కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. ఉబుసుపోక బాతాకాని కబుర్లు చెప్పుకుంటున్న ఆ కుర్రవాళ్ళలో ఒకడు "ఈ హాస్టల్‌కు హఠాత్తుగా నిప్పంటుకుంటే మనం ఈ డాబామీదనుంచి తప్పించుకోవటం ఎలా?"అని ఒక శంక లేవదీశాడు

విద్యార్థులందరూ తలా ఒక మార్గం చెబుతున్నారు తిలక్ ఈ మాటలేమీ పట్టించుకోకుండా గబగబా పంచె పైకికట్టి "ఇదే తప్పించుకునే మార్గం" అంటూ అమాంతంగా డాబా మీదనుంచి క్రిందకు దూకేశాడు. తోటి విద్యార్థులు ఆయనకు ఏమైనా దెబ్బ తగిలిందేమోనని హడావుడిగా మెట్లమీద నుంచి క్రిందకు దిగి వస్తుంటే తిలక్ మాత్రం తాపీగా మెట్లు ఎక్కుతూ పైకి వస్తున్నాడట.

## "భార్య కాలంత లేదు"

బాల గంగాధర్ హైస్కూల్లో చదివే రోజులలో ఒక రోజున ఎవరో విద్యార్థి వేరుశనగకాయలు తిని తొక్కలు క్లాసురూంలో పడేశాడు. పంతులుగారు వచ్చి "ఎవరాపని చేసింద"ని ప్రశ్నించగా ఎవరూ సమాధానం చెప్పలేదు. మీ రెందుకు చెప్తారు అంటూ బెత్తం తీసుకొని కుర్రవాళ్ళను ఒక్కొక్కడ్ని దగ్గరకు రమ్మని రెండేసి దెబ్బలు వడ్డించసాగారు. తిలక్ వంతు వచ్చేసరికి ఆయన చేతులు సాచకుండా నిర్భయంగా నిల్చొని "నేను వేరుశనగ కాయలు తినలేదు నేను దెబ్బలు తినవలసిన పనిలేదు" అన్నారు.

"అయితే తిన్నదెవరో చెప్పు మరి" అని హూంకరించారు పంతులుగారు.

"ఏమో నాకు తెలియదు" అన్నారు తిలక్.

ఈ సమాధానంతో ఉగ్రుడైన పంతులుగారు తక్షణం తిలక్‌ను స్కూలునుంచి గెంటివేశాడు. తను చేయని తప్పుకు ఆ ఉపాధ్యాయునిపై తిలక్ మహాశయుడు జీవితాంతం కోపంగానే వుండేవారట!

తిలక్‌కు 1 సంవత్సరాలకే పెండ్లి అయింది. ఆ తర్వాతనే ఆయన మెట్రిక్ ప్యాసై కాలేజిలో చేరాడు. భార్య సత్యభామ. తిలక్‌కంటే లావుగా పుష్టిగా వుంది. తిలక్ పన్నగా వుండేవాడు. ఈ దంపతులను చూసిన కొంటె కుర్రగాళ్ళు "వీడు చూడరా, భార్య ఒక కాలంత లేదు" అని చాటుగా, హేళనగా నవ్వుకునేవారు. ఇది గమనించిన తిలక్ దండీలు, బస్కీలుతీసి ఇంకా అనేక రకాల వ్యాయామాలుచేసి దండిగా తిని ఒక్క సంవత్సరంలోనే బస్తాదుగా తయారై కొంటె కుర్రవాళ్ళ నోళ్ళు మూయించారట!

★

క్లాసుకు 10 నిమిషాలు ఆలస్యంగా వచ్చి
20 నిమిషాలు ముందే వెళ్ళిపోయే
ఉపాధ్యాయుడు

# డాక్టర్ రాధాకృష్ణన్

---

మాజీ రాష్ట్రపతి డాక్టర్ సర్వేపల్లి. రాధాకృష్ణన్ ప్రపంచ ప్రసిద్ధ తత్వశాస్త్రవేత్త, మహావక్త. గంగాప్రవాహంలా సాగే ఆయన ప్రసంగాలు, ఆనాటి రాజనీతిజ్ఞుల్ని, మహా పండితుల్ని సైతం మంత్రముగ్ధుల్ని చేసేవి. ముఖ్యంగా ఇంగ్లీషు భాషపై ఆయనకున్న పట్టు ఆంగ్లేయ పండితుల్ని కూడా ఆశ్చర్యచకితుల్ని చేసేది. ఆయన ఉత్తమ ఉపాధ్యాయుడిగా ఉపాధ్యాయవృత్తికే ఎనలేని గౌరవాన్ని సంపాదించి పెట్టారు.



## "ఉపన్యాస కేసరి"

డాక్టర్ రాధాకృష్ణన్ ఉపరాష్ట్రపతిగా ఉన్న రోజుల్లో ఒకసారి ఆ నాటి బ్రిటిష్ ప్రధాని సర్ ఆంథోని ఈడెన్ ఇండియాలో పర్యటించారు. ఆ సందర్భంగా పార్లమెంటు ఉభయసభల సంయుక్త సమావేశంలో ఉపన్యసించారు. ఆయన ప్రసంగించటానికి ముందు రాజ్యసభ ఛైర్మన్‌గా రాధాకృష్ణన్ పార్లమెంటుకు ఈడెన్‌ను పరిచయం చేస్తూ మాట్లాడారు. రాధాకృష్ణన్ మాట్లాడిన తర్వాత ప్రసంగించటానికి ఇంగ్లీషులో గొప్ప పాండిత్యం కల్గి, మహావక్తగా కూడా పేరు పొందినప్పటికీ తను చాలా యాతన పడవల్సి వచ్చిందని తరువాత ఈడెన్ "జ్ఞాపకాలు" అనే స్వీయచరిత్రలో రాశారు. "ఆ ఉపన్యాస కేసరి తరువాత మాట్లాడటానికి నేను పసిపిల్లవాడిలా వణికిపోవల్సి వచ్చింది" అని రాశారాయన.

## ఉపన్యాస ప్రభావం

రాధాకృష్ణన్ అద్భుత ప్రసంగాల ప్రభావం ఎలా ఉండేదో ఓ సంఘటనలో తెలుస్తోంది. 1958లో ప్రపంచ తత్వవేత్తల మహాసభలు హవాయి దీవులలో జరుగుతున్నాయి. ఒకనాటి సాయంత్రం రాధాకృష్ణన్ మహోపన్యాసం చేస్తున్నారు. జనంతో హాలు కిక్కిరిసిపోయింది. సభకు ఆలస్యంగా వచ్చిన ఒకానొక చైనా వర్తకుడికి కూర్చోవటానికి చోటుకూడా దొరకలేదు. అతను బయటే నిలబడి రాధాకృష్ణన్ ప్రసంగం ఆసాంతం విని ఎంతో పులకించిపోయి. ఆ తత్వ మహాసభలకు అయ్యే మొత్తం ఖర్చు తానే భరిస్తానని అప్పటికప్పుడే సభాముఖంగా ప్రకటించాడు.

తన ప్రసంగాలను- అవి ఎంతటి ముఖ్య ప్రసంగాలైనా, ఎంత సుదీర్ఘ ప్రసంగాలైనా, ఎన్నడూ ముందుగా రాసుకునేవారుకాదు. రాధా

కృష్ణన్. ఎప్పుడైనా రాసుకున్న ప్రసంగ పాఠాన్ని చూసుకోకుండానే ఒక్క మాటైనా వదిలిపెట్టకుండా ఎక్కడా నట్టుపడకుండా ప్రసంగించేవారు ఒకసారి ప్రపంచ ఆహారసభలో నోట్సు లేకుండానే రాధాకృష్ణన్ చేసిన మహోపన్యాసం విన్న ఆనాటి అమెరికా అధ్యక్షుడు జాన్ ఎఫ్. కెన్నడీ ఆశ్చర్యచకితులయ్యారు.

రాధాకృష్ణన్ 1909లో యం.ఎ. పరీక్షకు వెళ్ళారు. ఆ సంవత్సరం తత్వశాస్త్రంలో పరీక్షకువెళ్ళిన విద్యార్థులలో రాధాకృష్ణన్ ఒక్కరే ఉత్తీర్ణులయారు. మిగతావారంతా తప్పారు. ఆయన మద్రాసులో యల్. టి. పరీక్షకు చదువుతున్నప్పుడే తన అధ్యాపకుల బలవంతంపై తోటి విద్యార్థులకు సైకాలజీపై బ్రహ్మాండంగా 12 ఉపన్యాసాలిచ్చి అందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేశారు.

## 10 నిమిషాలు ఆలస్యం 20 నిమిషాలు ముందు

అధ్యాపక వృత్తిలో ఉన్నప్పుడు రాధాకృష్ణన్ ఎక్కువగా క్లాసుకు 10 నిమిషాలు ఆలస్యంగా వచ్చి 20 నిమిషాలు ముందే వెళ్ళిపోయేవారు. అయినా ఆయన పాఠం చెప్పిన మిగతా 20 నిమిషాలలో విద్యార్థుల్ని మంత్రముగ్ధుల్ని చేసేవారు. ఆయనది ప్రసంగం కాదు, గంగా ప్రవాహం, రాధాకృష్ణన్ పాఠాలు చెబుతున్నప్పుడు ఆ క్లాసు విద్యార్థులేగాక మిగతా క్లాసుల విద్యార్థులుకూడా తమ క్లాసులు ఎగ్గొట్టి ఆయన ప్రసంగాలు విన టానికి చేరేవారు.

1921లో రాధాకృష్ణన్ మైసూరు విశ్వవిద్యాలయంనుంచి కలకత్తా విశ్వవిద్యాలయానికి వెళ్ళినప్పుడు ఆయన్ని విద్యార్థులు గుర్రపుబండిలో కూర్చోబెట్టి, గుర్రాన్ని విప్పేసి తామే బండి లాగుతూ రైలు స్టేషన్‌కు తీసుకువెళ్ళి జయజయధ్వానాలు చేస్తూ కన్నీటితో వీడ్కోలు చెప్పారు.

రాధాకృష్ణన్ హయాంలోనే ఆంధ్రా యూనివర్సిటీలో అంతకు పూర్వం అమలులో ఉన్న బ్రాహ్మణ, బ్రాహ్మణేతర భోజనశాలలను రద్దుచేసి శాకాహారం మాంసాహార భోజనశాలలను ఏర్పాటుచేసి అనాడే కులాలపట్ల తన విముఖత ప్రదర్శించారు.

## ఇక్కడ పోలిక చూడకూడదు ?

రాధాకృష్ణన్ ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా ఉన్నప్పుడు ఒకసారి బందరు వచ్చారు. ఆ సందర్భంగా వారి గౌరవార్ధం ఒక సన్మాన సభను ఏర్పాటు చేశారు. అప్పుడు కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ సర్వేపల్లిని పొగుడ్తూ "నైలునది లోయలో ప్రత్తి చేలో కాయలు దూస్తున్న నీగ్రోకన్నె చెక్కిలి తళుకు..." అంటూ ఒక ఉపమానం ప్రారంభించారు సర్వేపల్లి తక్షణం అందుకుని "అయ్యా విశ్వనాథగారూ! నేను ఆంధ్రుణ్ని! ఎక్కడో ఈజిప్టులోనున్న కన్యతో నన్ను పోల్చటం ఎందుకు? ఇక్కడ పోలిక ఏదైనా చూడకూడదూ?" అనేటప్పటికి సభ అంతా బిగ్గరగా నవ్వులు !

## తత్వవేత్త-నియంత

రాధాకృష్ణన్ మాస్కోలో రాయబారి పదవిని ఎంతో హుందాగా నిర్వహించారు. రష్యాలాంటి అతి చలిదేశంలో కూడా మామూలుగానే పంచె, లాంగ్‌కోటు, తలపాగా మాత్రమే ధరించేవారు.

ఈనాటి భారత్, సోవియట్ మైత్రికి డా॥ రాధాకృష్ణన్ అనాడే గట్టి పునాదులు వేశారు. కేవలం ఆయన విశిష్ట వ్యక్తిత్వంవల్లనే కరుకు మనిషిగా పేరొందిన మార్షల్ స్టాలిన్‌ని కూడా చలింపచేశారు.

అంతకు పూర్వం ఏ రాయబారికీ దర్శనం ఇవ్వని స్టాలిన్ డా॥ రాధాకృష్ణన్‌ను ప్రత్యేకంగా ఆహ్వానించి సంభాషించారు. డా॥ రాధాకృష్ణన్ మాస్కోలో రాయబారిగా పదవీ విరమణచేసి తిరిగి స్వదేశం వస్తున్నప్పుడు కూడా తిరిగి స్టాలిన్‌ను కలుసుకోగలిగారు. స్టాలిన్ అప్పుడు తీవ్ర అనారోగ్యంతో వున్నారు. ముఖం అంతా ఉబ్బివుంది. డా॥ రాధాకృష్ణన్ స్టాలిన్ దగ్గరకువెళ్ళి బుగ్గలను చేతితోనిమిరి తల్నినిమిరారు. ఆప్యాయంగా వీపుపై చేయి వేశారు. తన సహజ ప్రేమాభిమానాలతో ఆయన చేసిన ఈ పని స్టాలిన్ గుండెలను కదిలించింది. మార్షల్ స్టాలిన్ కళ్ళవెంట గిర్రున నీరు తిరిగినాయి. గద్గదస్వరంతో "అందరూ నన్ను రాక్షసునిగా చూస్తున్నారు, మీరు మాత్రమే నన్ను మానవునిగా చూచిన ప్రథమ వ్యక్తి. మీరు మా దేశంనుంచి వెళ్ళిపోవటం నాకెంతో విచారంగా వుంది మీరు చిరకాలం జీవించాలని నా కోర్కె. నేనిక ఎంతోకాలం జీవించను" అని కన్నీళ్ళతో డా॥ రాధాకృష్ణన్‌కు వీడ్కోలు చెప్పారు. మార్షల్ స్టాలిన్ ఆ తర్వాత కొద్దిరోజులకే చనిపోయారు.

## నియంతలంటే వ్యతిరేకత

డాక్టర్ రాధాకృష్ణన్‌కు నియంతలంటే గిట్టేదికాదు. వారితో మాట్లాడటానికి చిరాకు కూడా ప్రదర్శించేవారు. తప్పనిసరై మాట్లాడవల్సివస్తే నియంతల చర్యలను అన్యాపదేశంగా హెచ్చరిస్తూ వుండేవారు. ఒకసారి కమ్యూనిస్టు చైనా ఆహ్వానంమీద పెకింగ్‌వెళ్ళిన రాధాకృష్ణన్ అచ్చట ఒక సభలో వ్యక్తి స్వేచ్ఛగురించి తన మనస్సులోవున్న మాటలను దాచుకోకుండా చెప్పేశారు అలాగే ఒకసారి ఈజిప్టు వెళ్ళినప్పుడు సైనిక నియంత జనరల్ నజీబ్‌తో కొంత సేపు మాట్లాడిన తర్వాత సైనిక నియంతృత్వం యొక్క ప్రమాదాల గురించి రెండుమాటలు చెప్పి మరీ వచ్చారట! ★

ఎడ్ల బండి తోలిన చరిత్ర కారుడు

# డాక్టర్ పట్టాభి

కాంగ్రెసు పార్టీ చరిత్రకారుడు, ఆనాటి కాంగ్రెసు అతిరథమహారథులలో ఒకరు, గాంధీయిజం భాష్యకారుడు డాక్టర్ పట్టాభి సీతారామయ్య.



అసాధారణమేధావి, మంచివక్త! పట్టాభి 'కాంగ్రెసు చరిత్ర'ను పట్టాభిరచించినతీరుచూస్తేఆయన ఎంతటి కార్యదీక్షపరుడో ఎంతటి మేధావో అర్థంకాగలదు. 1600 పేజీలుగల కాంగ్రెసు చరిత్రను డాక్టర్ పట్టాభి కేవలం 59 రోజులలో రచించారంటే ఎవరికైనా ఆశ్చర్యం కలుగకపోదు.

## కరణం బిడ్డ

కాంగ్రెసుపార్టీ చరిత్ర రచన 1935మే 1న ప్రారంభమై జూన్ 29కి పూర్తిఅయింది. ఆ 1600 పేజీలు రాయటంలో 1922, 1925 సంవత్సరాలలో కాంగ్రెసుకు సంబంధించి ప్రకటితమైన మూడుబులిటెన్లు మాత్రమే ఆధారాలుగా ఉపయోగించుకున్నారు. మరే విధమైన గ్రంథాలుగాని పత్రాలుగాని ఆధారంలేకుండా మరొకరి సహాయంలేకుండా డాక్టర్ పట్టాభి తన జ్ఞాపకశక్తి ప్రతిభమాత్రమే ఆధారంగా ఆ పుస్తకం రాశారు.

ఆ పుస్తకాన్ని మొదట 5 వేల ప్రతులు అచ్చువేద్దామనుకున్నారు. కాని ముద్రణకి ముందే 4 వేల ప్రతులకు ఆర్డర్లువస్తే 10 వేల కాపీలు అచ్చువేశారు. అప్పట్లో ఆ పుస్తకం వెల 8 రూపాయలు. గ్రంథం అచ్చు కాగానే డాక్టర్ పట్టాభికూడా అందరిలా 4 ప్రతులు సొంత సొమ్ముతో కొనుక్కున్నారు.

పట్టాభి రాసిన కాంగ్రెసు చరిత్రను చదివిన మహాత్మాగాంధీ ఆయనని "ఏమయ్యా! నీవు మాట్లాడే మాటలు ములుకుల్లా ఉంటాయిగదా! మరి నీవు రాసిన ఇంతగ్రంథంలోనూ ఎవ్వరినీ విమర్శించకుండా, ఎవ్వరినీ నొప్పించకుండా ఎలా రాయగలిగావు" అని ప్రశ్నిస్తే అందుకు పట్టాభి చిరునవ్వుతో "బాపూజీ! నేను కరణం బిడ్డను. కరణం ఎప్పుడూ రాతలో దొరకడు" అన్నారు.

## 6 మాసాల్లో హిందీ ప్రావీణ్యం

గాంధీజీ ఒకసారి పట్టాభితో "మీరు హిందీ ఎందుకు నేర్చుకోరు?" అన్నారు. అందుకు పట్టాభి "సరే చూడండి-వచ్చే కాంగ్రెసు సమావేశాలలో హిందీలోనే ఉపన్యసిస్తాను" అని పట్టుదలతో ఆరుమాసాలలోనే హిందీలో ప్రావీణ్యం సంపాదించి కాంగ్రెసు సమావేశంలో అనర్గళంగా మాట్లాడారు. ఆయన వాగ్ధోరణి చూసి హిందీ ప్రాంతంవారే ఆశ్చర్యపడ్డారు. ఆనాటి పట్టాభి ఉపన్యాసంలోని ఒకవాక్యం "జోకుచ్ కహనా హైతో హాత్ సే కరో"దాన్ని పెద్ద అక్షరాలతో అట్టపైన రాయించి తన ఆశ్రమంలో వేలాడదీయించారు గాంధీజీ. ఆమాటకు తెలుగు అనువాదం ఇది "మనము చెప్పదలచిన విషయము చేసిచూపిన మంచిది."

## పాకశాస్త్ర ప్రావీణ్యం

ఒకదఫా కాంగ్రెసు మహాసభలు జరుగుతూ వుండగా వంటవాళ్ళు హఠాత్తుగా సమ్మెచేశారు. కాంగ్రెసు నాయకులు, ప్రతినిధులు భోజనాలు

తయారుచేయించటం ఎలాగాని కిందామీదా పడుతూవుండగా డాక్టర్ పట్టాభి చటుక్కున కొంతమంది కాంగ్రెసు వాలంటీర్లను వెంటబెట్టుకుని వంటశాలకు వెళ్ళి వంటలన్నీ స్వయంగా చేసి తన పాకశాస్త్ర ప్రావీణ్యాన్ని కూడా నిరూపించుకున్నారు.

## ఒకబ్లేడు ఆరునెలలు

డాక్టర్ పట్టాభి ఖర్చువిషయంలో చాలా పొదుపుగా వుండేవారు. ప్రతిపైసా ఆచితూచి ఖర్చుచేసేవారు. అతితక్కువ వ్యయంతో జీవనం గడిపేవారు. ఆయన గడ్డం గీసుకునే బ్లేడును 6 మాసాలు జాగ్రత్తగా వాడేవారు.

డాక్టర్ పట్టాభి ప్రసిద్ధవైద్యుడేకాక ఆర్థికవేత్త కూడా. ఆయన అనేక ఆర్థికసంస్థలు నెలకొల్పి పెంచిపోషించారు. ఆంధ్రాబ్యాంకు, భారత లక్ష్మి బ్యాంకు, ఆంధ్రా ఇన్సూరెన్సు కంపెనీ మొదలయినవి ఆయన స్థాపించినవే. బందరులోని ఆంధ్ర జాతీయకళాశాల నెలకొల్పటానికి విశేష కృషి చేశారు.

## ఎడ్లబండి తోలిన చరిత్రకారుడు

1906లో కలకత్తా కాంగ్రెసు మహాసభకు హాజరైన ఆంధ్రప్రతినిధులు బందరులో జాతీయ కళాశాల ఏర్పాటుచేయాలని నిర్ణయించారు. 1907లో కోపల్లె హనుమంతరావు, డాక్టర్ పట్టాభి మొదలైనవారితో ఒక కమిటీ ఏర్పాటయింది. ఆ కమిటీ గ్రామగ్రామాన తిరిగి చందాలు వసూలు చేసి నిర్మించిన కళాశాలకు 1910 ఫిబ్రవరిలో ప్రారంభించాలని ముహూర్తం నిర్ణయించారు. ప్రారంభోత్సవానికి హైకోర్టు న్యాయమూర్తి గురుదాస్ బెనర్జీని ఆహ్వానించారు. తీరా ఆ సమయానికి తాను రాలేకపోతున్నానని కబురుపంపారాయన. అప్పటికప్పుడు డాక్టర్ పట్టాభి బందరులో వుంటున్న దేశభక్త కొండా వెంకటప్పయ్యగారిని ప్రారంభోత్సవం జరిపించవల్సిందిగా

కోరారు. అందుకు వెంకటప్పయ్యగారు సంతోషంగా అంగీకరించగా పట్టాభి సీతారామయ్య స్వయంగా ఎడ్లబండి తోలుకువచ్చి వెంకటప్పయ్య గారిని అందులో కూర్చోబెట్టుకుని ప్రారంభోత్సవానికి తీసుకెళ్ళారు. ఆ విధంగా డాక్టర్ పట్టాభి ఎడ్లబండి తోలటంలో కూడా తనకు ప్రవేశమున్నట్టు నిరూపించుకున్నారు.

## ఆత్మాభిమానం

పట్టాభి గొప్ప ఆత్మాభిమానం గల మనిషి కూడా. ఒకసారి సర్దార్ పటేల్ పట్టాభితో "మిమ్మల్ని ఎ.ఐ.సి.సి. వర్కింగ్ కమిటీ మెంబరుగా తీసుకోవాలనుకుంటున్నాం. ఏమంటావ్?" అంటే "వర్కింగ్ కమిటీ మెంబరుగా తీసుకుంటానంటే కాదనే అహంకారినికాదు. మీరు తీసుకోక పోయినా ప్రాధేయపడే స్వభావంకాదు నాది" అని సమాధానం చెప్పారు పట్టాభి.

## కొడుకు పెళ్ళి కన్నా ముఖ్యం క్రిప్సు రాయబారంతో చర్చలు

**1942**లో క్రిప్సు రాయబారం వచ్చింది. అదే సమయంలో పట్టాభి గారి చిన్నకొడుకు పెళ్ళి నిశ్చయమైంది. పట్టాభి కుమారుడి పెళ్ళి నిమిత్తం ఢిల్లీ నుంచి వచ్చే ప్రయత్నంలో వున్నారు. అప్పుడు గాంధీజీ పట్టాభిని పిలిపించి "క్రిప్సు రాయబారంతో చర్చించాలంటే నీవు తప్పని సరిగా వుండాలి స్వదేశీ సంస్థానాలు లాంటి విషయాలపై వారితో మాట్లాడాలంటే నీ కన్నా సమర్థుడు మరెవ్వరూ లేరు. కాబట్టి నీవు పెళ్ళికి వెళ్ళటానికి వీల్లేదు" అనగానే పట్టాభి గాంధీజీమాట శిరసావహించి తాను వివాహానికి రావటంలేదని పెళ్ళి నీవే జరిపించవల్సిందని తక్షణం పట్టాభి భార్యకు ఉత్తరం ద్వారా తెలియజేశారు. తన కుమారుని పెండ్లి ఆ విధంగా తను లేకుండానే జరిగిపోయింది. క్రిప్సురాయబారంతో మంతనాలు చేయటంలో పట్టాభి రాజకీయ చతురత, విషయ పరిజ్ఞానం గొప్పగా వెల్లడయినాయి. ★

కాలేజి గేటు దూకి వెళ్ళే
కాలేజి లెక్చరర్ "ఆంధ్రరత్న"

# దుగ్గిరాల గోపాలకృష్ణయ్య

చీరాల పేరాల ఉద్యమ నిర్మాత, రామదండు సేనాపతి "ఆంధ్ర రత్న" దుగ్గిరాల గోపాలకృష్ణయ్య లండన్‌లో విద్యాభ్యాసం పూర్తి చేసుకు



వచ్చిన తర్వాత రాజమండ్రి ట్రయినింగ్ కాలేజీలో హిస్టరీ లెక్చరర్‌గా నియమితులయ్యారు. గోపాల కృష్ణయ్యగారు విద్యార్థులకు చరిత్ర నేర్పటంలో వినూత్న పద్ధతులు అవలంబించారు. సాంప్రదాయకమైన ఇంగ్లీషు చరిత్ర, ఆంగ్ల చరిత్రకారులు రాసిన పాక్షికమైన చారిత్రక విషయాలు నేర్పకుండా పురాణాలు,

కావ్యాలు, వీరరసప్రధానమైన బొబ్బిలికథ, దేశింగురాజు కథ, పల్నాటి వీర చరిత్ర మొదలైన వాటిని నేర్పటం ప్రారంభించారు. దీనితో ఆనాటి కళాశాల ప్రిన్సిపాల్ రాస్ దొరకు గోపాలకృష్ణయ్య గారికి తీవ్ర అభిప్రాయ భేదాలు వచ్చినై. ఇద్దరకు ఏ మాత్రం సరిపడేది కాదు. దీనికి తోడు రాస్ దొర డిసిప్లిన్‌కు ప్రాధాన్యం ఇచ్చే మనిషి. కాలేజీ 10 గంటలకు ప్రారంభం అంటే అందరూ 10 గంటలకల్లా రావాల్సిందే. ఆ తర్వాత విద్యార్థులైనా అధ్యాపకులైనా సరే లోనికి రానీయకుండా గేట్లు మూయించేసేవారు.

## రోజూ ఆలస్యం — గేటుకు తాళం

అయితే గోపాలకృష్ణయ్యగారికి ఏనాడూ టైంకు వెళ్ళే అలవాటు లేదు. ఇంటివద్ద భార్య అనారోగ్యం, పైగా ఈయన కొంచెం బద్ధకస్తుడు. కాలేజీకి వెళుతూ దారిలో ఆ రోజుల్లో రాజమండ్రి ఆర్ట్సు కాలేజీలో ఫిలాసఫీ లెక్చరర్‌గా వుండే సర్వేపల్లి రాధాకృష్ణ గారితో కాసేపు మాట్లాడిగానీ కాలేజీకి వెళ్ళేవారు కాదు. దాంతో ఆయన నిత్యం కాలేజీకి ఆలస్యం అయేవారు. అయినా గేటు కాపలా మనిషిని బెదిరించి కాలేజీలో ప్రవేశించేవారు.

రాస్ దొర ఇదంతా గమనించి ఇలా లాభంలేదని ఒక రోజున గేటుకు తాళం వేయించారు. యథాప్రకారం ఆలస్యంగా వచ్చిన గోపాలకృష్ణయ్యగారు తాళం చూసి వెంటనే గేటు దూకి లోపల ప్రవేశించారు. ప్రిన్సిపాల్ ఆగ్రహావేశంతో ఎదురు వచ్చి "ఇదేం పని?" అని ప్రశ్నించగా "అదేంపని ఇదేం జైలు అనుకున్నారా?" అంటూ క్లాసుకు వెళ్ళిపోయారట.

## "డొక్క చీరేస్తానని చెప్పు"

ఈ సంఘటనతో ప్రిన్సిపాల్‌కు గోపాలకృష్ణయ్యకుమధ్య వైరం పెరిగిపోయింది. ఒక సందర్భంలో రాస్ దొర గోపాలకృష్ణయ్యగారిని ఏదో పరుషంగా అనగా "ఇందాక అన్నమాట మళ్ళీ అను" అంటూ చెయ్యెత్తి కొట్టబోయారట. రాస్ దొర భయపడి తన రూంలో దూరారట. ఇది జరిగిన కాసేపటికి రాస్‌దొర తన బంట్రోతును పిలిచి గోపాలకృష్ణయ్య ఏం చేస్తున్నాడో చూసిరమ్మన్నాడట వాడు వెళ్ళి గోపాలకృష్ణయ్యగారు పాఠం చెబుతున్న క్లాసుముందు తచ్చాడుతూ వుండగా, గోపాలకృష్ణయ్య గారు వాడ్ని పిల్చి, "ఏమిట్రా ఇక్కడ తచ్చాడుతున్నావ్?" అని ప్రశ్నించారు. ఆ అమాయకుడు తడబడుతూ "మరేం లేదండి. ప్రిన్సిపాల్ దొర గారు తమరు ఏం చేస్తున్నారో చూసి రమ్మనారండి" అనగానే గోపాల కృష్ణయ్యగారు ఉగ్రుడై "ప్రిన్సిపాల్ డొక్క చీరేస్తానని చెప్పు" అన్నారట. వాడు ఆ మాటలు తీసుకువెళ్ళి రాస్ దొరకు చెప్పగా ఆయన గోపాల కృష్ణయ్యగారి మీద విద్యాశాఖ డైరెక్టర్‌కు ఫిర్యాదు చేశారట.

మరోసారి ప్రిన్సిపాల్‌కు గోపాలకృష్ణయ్యగారికి ముష్టి యుద్ధం జరిగే పరిస్థితి ఏర్పడగా తోటి ఉపాధ్యాయులు సర్దవల్సి వచ్చింది. ఈ వివాదాల మూలంగా వీరిద్దరి పట్ల విద్యార్థులకు చులకన భావం ఏర్పడింది. ఇంతలో గోపాలకృష్ణయ్యగారు బందరులో జరిగిన ఆంధ్ర విద్యార్థి సభకు అధ్యక్షత వహించగా ప్రభుత్వం గోపాలకృష్ణయ్యను రాజకీయాలలో పాల్గొంటున్న నెపంమీద లెక్చరర్ పదవి నుంచి తొలగించింది. దాంతో గోపాలకృష్ణయ్య గారు రాజమండ్రిలో 9 నెలల నుంచి చేస్తున్న లెక్చరర్ ఉద్యోగం ఊడింది.

## బందరు కుంకలు

గోపాలకృష్ణయ్యగారు రాజమండ్రిలో ఉద్యోగం తర్వాత బందరు జాతీయ కళాశాలలో వైస్ ప్రిన్సిపాల్ ఉద్యోగంలో ప్రవేశించారు. అక్కడ కూడా ఎక్కువ కాలం వుండలేక పోయారు. జాతీయ కళాశాల వ్యవస్థాపకులైన కోపల్లె హనుమంతరావు, ముట్నూరి కృష్ణారావు, పట్టాభి సీతా రామయ్య గార్లతో పేచీ పడ్డారు. దాంతో ఆ ఉద్యోగానికి రాజీనామా చేయాల్సి వచ్చింది. పైపెచ్చు వీరూ గోపాలకృష్ణయ్యగారికి జీవితాంతం విరోధులుగానే మిగిలిపోయారు.

అందువల్లనే గోపాలకృష్ణయ్యగార్ని 1920లో మహానందిలో జరిగిన ఆంధ్ర మహాసభ సందర్భంగా బందరు నుంచి వచ్చిన డాక్టర్ పట్టాభి, ముట్నూరి, కోపల్లె మొదలైన పెద్దలు "సుంకర కొండడు" అని హేళన చేయగా గోపాలకృష్ణయ్య గారు ఆశువుగా ఈ క్రింది పద్యం చదివారట.

బింకాలు పలుకు బందరు
కుంకల ఛీంకారమెల్ల గీష్పద సేయన్
శంకరుడె మహానందిని
సుంకరుకొండయయాయె జోద్యం బేలా?

## కొక్కిరాయి

గోపాలకృష్ణయ్యగారు 34వ ఏటనే అఖిల భారత కాంగ్రెసు కార్యదర్శిగా నియమించబడ్డారు. ఆంధ్రలో ప్రప్రథమంగా కాంగ్రెసు కార్యదర్శి పదవి చేపట్టిన వారుకూడా ఆయనే! ఇంత చిన్న వయస్సులో తారాజువ్వలా పైకి వచ్చిన ఆయనంటే చాలా మందికి అసూయగా వుండేది. ఇది మనస్సులో పెట్టుకొని ఒకసారి ఆంధ్ర కాంగ్రెసు నాయకుల్ని ఈ విధంగా ఎగతాళిగా ఎత్తిపొడిచారు గోపాలకృష్ణయ్యగారు —

కొండెంకటప్పన్న గుండుసున్న గదన్న
గోపాలకిట్టాయి కొక్కిరాయి
టంగుటూరు ప్రకాశమింగిలీసు పిశాచి
నాగేశ్వరుడు పట్టి నాగజెముడు
పట్టాభి సీతన్న తుట్టు పురుగుగదన్న
ఉన్నవ లచ్చుమన్న దున్నపోతు
గొల్లపూడి సీతన్న కళ్ళులేని కబోది
బులుసు సాంబడు పట్టి పుట్టకుంక
అయ్యదేవరవాడు పెయ్యనాకుడుగాడు
అయ్యంకి రమణయ్య దయ్యమయ్య
దువ్వూరిసుబ్బమ్మ దృష్టిబొమ్మ
అనుచు బిల్కొచునుందురీ ఆంధ్రజనులు
నాయకత్వంబు నడచిన నాటనుండి
తపములేనిది మొన్నరేనెపములెల్ల
రామనగరీనరేంద్ర శ్రీరామచంద్ర

## చీరాల రామదాసు

గోపాలకృష్ణయ్య మొదటిసారిగా దేశబంధు చిత్తరంజన్‌దాస్‌ను కల్సుకున్నప్పుడు "నీ పేరేమిటి?" అన్నారట సి.ఆర్.దాస్. అందుకు గోపాలకృష్ణయ్య "నా పేరుకూడా సి ఆర్.దాస్ (చీరాల రామదాసు) అన్నారట. చీరాల పేరాల ఉద్యమ నిర్మాత గోపాలకృష్ణయ్యగారి వాక్ చమత్కృతికి చిత్తరంజన్‌దాస్ ఎంతో ముచ్చటపడి ఆయన పట్ల అభిమానంగా వుండేవారట. గోపాలకృష్ణయ్యగారు ప్రారంభించిన "సాధన" పత్రికకు 3 వేల రూపాయలు విరాళం కూడా ఇచ్చారట.



అల్లరిపనుల ఆంధ్ర కేసరి

# టంగుటూరి ప్రకాశం

ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశం పంతులు చిన్నప్పుడు ఊళ్ళో అల్లరిపిల్లలకు నాయకత్వం వహించి అనేక తుంటరిపనులు చేస్తూండేవాడు.

బడిపంతుళ్ళకి ప్రకాశాన్ని అదుపులో పెట్టడం దుస్సాధ్యమయ్యేది. ఎన్ని సార్లు చింతబరికెలతో బాదినా ప్రకాశాన్ని దారి మళ్ళించలేక పోయేవారు. ప్రకాశం విద్యార్థిగా వున్నంతకాలం తుంటరిచేష్టలు, పోకిరీల సహవాసం మానలేదు.



## పంతులుగారి గోచీ

ఇది ప్రకాశం హైస్కూలులో చదువుతున్నప్పుడు జరిగిన సంగతి. ఒకరోజు క్లాసుటీచర్ బోర్డు మీద లెక్కలు వేసి చూపిస్తూ ఉండగా, ప్రకాశం మెల్లగా లేచివెళ్ళి వేలాడుతూఉన్న ఆయన గోచీని కుర్చీకికట్టాడు. దాంతో మాష్టారు పంచెఊడటం, పిల్లలు పకపకా నవ్వటం, మాష్టారు ఆగ్ర

హంతో మండిపడి ప్రకాశాన్ని చావబాది స్కూలునుంచి గెంటివేయటం వెంటవెంటనే జరిగాయి. ప్రకాశం తండ్రి పైఅధికారులను కలిసి, తిరిగి ఎలాగో ప్రకాశాన్ని స్కూల్లో చేర్పించారు.

## పేచీ మ ని షి

ఇక టంగుటూరి ప్రకాశంపంతులు రాజమండ్రి మున్సిపల్ చైర్మన్‌గా ఎన్నికైనప్పటి సంగతి. అప్పటికి ప్రకాశం చైర్మన్‌గా ఎన్నికైనా ఆయన పేరు ఇంకా అధికార రీత్యా గజెట్‌లో ప్రకటించబడలేదు. పంతులుగారు చైర్మన్‌గా ఎన్నికవటం పట్టణంలో కొంతమందికి సుతరామూ ఇష్టంలేదు. వారు ప్రకాశంమీద ఒక నేరారోపణ పత్రాన్ని తయారుచేసి గవర్నర్‌కు పంపారు. ఆ నేరారోపణ పత్రంలో వారు ప్రకాశంగార్ని "చైర్మన్‌కు వుండవల్సిన వయస్సులేదని, ఆస్తిపాస్తులు లేని బిక్కాపకీరని, మున్సిపల్ నిధులు స్వాహాచేసేవాడని, రౌడీ మూఠాలతో సహవాసం చేసేవాడని, నాటకాల రాయుడని, ఖూనీలు చేసేవాడని, దొంగసాక్ష్యాలు చెప్పేవాడని మొదలైన తీవ్ర విమర్శలతో ముంచెత్తారు. దాంతో ఆగక ఈ నేరారోపణ పత్రాన్ని పరిశీలించిన గవర్నర్ ప్రకాశం ఎన్నికను రద్దు చేస్తారని పుకారు లేపారు. అప్పుడు ప్రకాశం మద్రాసువెళ్ళి గవర్నరును కలుసుకొని తనపై వచ్చిన ఆరోపణలు నిరాధారమైనవని గవర్నర్ ఎదుట తీవ్రంగా వాదించారు. ఆయన వాదనను విన్న గవర్నర్ తన సెక్రటరీతో "అతడు పేచీకోరు మనిషే అయినా అతడ్ని కాదనలేం. అతనిపేరు గజెట్‌లో ప్రకటించండి" అన్నాడు. అలా చైర్మన్‌గా ప్రకాశం ఎన్నిక అధికారరీత్యా ధృవపరచటంతో ప్రకాశం ప్రత్యర్థులకు తలకొట్టేసినంత పనైంది. తరువాత కొంతకాలానికి ప్రకాశంపంతులు బారిష్టరు చదవటంకోసం చైర్మన్‌పదవికి రాజీనామా చేసి ఆ పత్రాన్ని మద్రాసు గవర్నర్‌కు పంపుతూ "రాజమండ్రి

మున్సిపాలిటీ సొమ్మును జాగ్రత్తగా ఒప్పగించుతున్నానని" వ్యంగ్యంగా ఉత్తరం వ్రాశాడు.

## 70 వేల ఫీజు

ప్రకాశంపంతులు బారిస్టరైన తర్వాత మద్రాసులో ప్రాక్టీసు పెట్టాడు. అతి త్వరలోనే ప్రాక్టీసు పెరిగి లక్షలు సంపాదించాడు. వారాలు తిని చదువుకున్న ప్రకాశం బారిస్టరుగా విపరీతంగా ఆర్జించాడు. ధరలు చాలా తక్కువగా ఉండే ఆ రోజుల్లోనే గోదావరి జిల్లా పోతునూరు గ్రామానికి చెందిన ఒక కేసులో ప్రకాశంగారికి 70 వేల రూపాయలు ఫీజుగాముట్టింది. ప్రకాశానికి ఆదాయం ఎంత అధికంగా వుండేదో ఖర్చుకూడా అంత ధారాళంగా వుండేది ప్రకాశం అనేకమంది దగ్గర బంధువులకు, సన్నిహితులకు విరివిగా ఆర్థికసహాయం చేసేవారు. నిత్యం వారిల్లు అతిథి అభ్యాగతులతో సందడిగావుండేది. ఊటీలో ఒక బంగ్లాకొన్నారు. ఒంగోలులో ఒక పెద్దమేడ కట్టించారు. మద్రాసులో రెండున్నరెకరాల విస్తీర్ణంలోగల ఒక భవంతికొన్నారు, రాజమండ్రిలో రెండు పెద్ద ఇళ్ళుకొన్నారు. ఇంకా మంచిమాగాణి పొలం కొంతకొన్నారు. ఆయనకు బ్యాంకులో 4, 5 లక్షల రూపాయలు తగ్గకుండా నిల్వవుండేదని, ఆనాడు ప్రకాశం సంపాదించిన ఆస్థి మొత్తం 30 లక్షల దాకా వుంటుందని చెప్పుకునేవారు.

ఇలా సంపాదించిన ఆస్థిని ప్రకాశంగారు తన వారసులకని దాచి పెట్టుకోలేదు. స్వాతంత్రోద్యమంలో చేరి డబ్బంతా దానికే ఖర్చు పెట్టారు. అందులో చాలాభాగం ఆయన ప్రారంభించిన 'స్వరాజ్య' పత్రికకు ఖర్చయింది. 'స్వరాజ్య' పత్రిక పోషణకు తను సంపాదించిన డబ్బు చాలక పోగా అప్పు కూడా చేయాల్సి వచ్చింది. కొంతకాలానికి అప్పుకూడా దొరకని పరిస్థితులలో స్వరాజ్య పత్రికను నిలిపివేయాల్సి వచ్చింది.

## ప్రకాశంగారి ఆరోగ్యం

ప్రకాశం పంతులు ధైర్యసాహసాల గురించేగాక ఆయన ఆరోగ్యం గురించి కూడా తెల్సుకోదగిన విషయాలున్నాయి. 1942 ఆగస్టులో క్విట్ ఇండియా ఉద్యమంలో బొంబాయి నుంచి మద్రాసు వస్తున్న ప్రకాశాన్ని కడప స్టేషన్‌లో అరెస్టుచేశారు. వెల్లూరు జైలులో కొద్దికాలం వుంచి అక్కడ నుంచి ఆయనతోపాటు మరికొంతమందిని, మండుటెండలలో పోలీసులారీలలో మధ్యప్రదేశ్ లోని అమ్రోతి జైలుకు పంపించారు. వెల్లూరు నుంచి అమ్రోతీకి దూరం 700 మైళ్ళు. అన్ని మైళ్ళూ తీవ్రమైన ఎండలో లారీలలో ప్రయాణించటంతో అమ్రోతి చేరగానే అందరూ మంచంపట్టారు. ఒక్క ప్రకాశం మాత్రం ఆరోగ్యంగా యథాప్రకారం తిరుగుతూ మంచానపడ్డ మిగతా ఖైదీలకు సేవచేశారు. అప్పటికి ఆయన వయస్సు 70 సంవత్సరాలు! ప్రకాశం ఆరోగ్యం అంత గొప్పది. ఎన్నికలలో నిర్విరామంగా ప్రచారం చేసేటప్పుడు, ప్రయాణాలలోనూ ఆయన భోజనం చేసేవాడుకాదు. పొట్టనిండా పాలు పెరుగు త్రాగి సరిపెట్టుకునే వాడు. కొన్ని సందర్భాలలో పచ్చిపెసలు, శనగలు తింటూ మరో ఆహారం లేకుండా వుండేవారు. ఆ విధంగా ప్రకాశం అభ్యాసంద్వారా శరీరాన్ని స్వాధీనంలో వుంచుకుని ఆరోగ్యాన్ని కాపాడుకునేవారు.

ప్రకాశం పంతులు వంటి ప్రజానాయకునికి ఉత్సవ విగ్రహంలాంటి గవర్నరుపదవి ఇష్టంవుండకపోవటం సహజమే! ఒకసారి అస్సాం గవర్నర్ పదవి ఖాళీకాగా దానికి ప్రకాశాన్ని నియమిస్తారని వుకారు వచ్చింది. విలేకర్లకు ఈ విషయం తెల్సి ప్రకాశం దగ్గరికి వెళ్ళి "మీరు అస్సాం గవర్నరుగా వెళ్తున్నారటగా" అని ప్రశ్నిస్తే ప్రకాశం చివాల్న లేచి విసుగ్గా "షీర్ నాన్సెన్స్! నాకటువంటి పదవులు సరిపడవు" అన్నాడు।



డిగ్రీ కూడా చదవకుండా వైస్రాయ్ సలహాదారైన

# వి. పి. మీనన్

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తొలిరోజుల్లో కేంద్ర ప్రభుత్వానికి సలహాదారుగాను వైస్రాయ్ లార్డు మౌంట్‌బాటెన్‌కు, మాజీ ఉప ప్రధాని సర్దార్ పటేల్‌కు అత్యంత విశ్వాసపాత్రుడుగాను వున్న వి.పి. మీనన్ అసాధారణ ప్రతిభావంతుడు. హోంశాఖ కార్యదర్శిగా వందలాది సంస్థానాలను ఇండియన్ యూనియన్‌లో చేర్పించడానికి ఆయనపడ్డ శ్రమ, సమయస్ఫూర్తి, రాజనీతిజ్ఞత ఇండియా చరిత్రలో శాశ్వతంగా లిఖించబడి వుంటుంది.

## డిగ్రీ కూడాలేదు

ఇంతటి ప్రతిభాశాలి అయిన వి.పి. మీనన్ ఏ యూనివర్శిటీ నుంచీ డిగ్రీ తీసుకోలేదు. ఉన్నత చదువుకు లండన్ వెళ్ళలేదు. ఐ. సి. ఎస్. పాసు కాలేదు అంటే ఎవరూ నమ్మరు. కాని వాస్తవం అంతే!

వి. పి. మీనన్ తనకు 13 సంవత్సరం వచ్చే నాటికే చదువుకు స్వస్తి చెప్పారు. అతి బీదకుటుంబంలో పుట్టిన మీనన్‌కు 12 మంది తమ్ముళ్ళుగాని, చెల్లెళ్ళుగాని వుండేవారు. తనే సంతానంలో పెద్దవాడు కావడంవల్ల కుటుంబ పోషణకోసం చదువుకు స్వస్తిచెప్పి ఏదో ఒక వృత్తిలో ప్రవేశింపవలసి వచ్చింది.

మీనన్ కొన్నాళ్ళు కూలీగా పని చేశారు. బొగ్గు గని కార్మికుడు గాను, ఫ్యాక్టరీ కార్మికుడుగాను, రైల్వే కార్మికుడుగానూ కూడా పనిచేశారు. మరికొంతకాలం వృత్తి బేరగానిగా కూడా వుండేవారు.

స్కూలు టీచర్‌గా కూడా కొద్దికాలం పనిచేశారు. ఆ తరువాత టైపు నేర్చుకొని ప్రభుత్వ సర్వీసులో గుమాస్తాగా చేరారు.

## 15 రూపాయలు

మీనన్ గుమాస్తా ఉద్యోగంలో చేరేందుకు సిమ్లా వెడుతున్నప్పుడు జరిగిన సంఘటన ఆయన జీవితంలో మరపురానిది.

రైలులో వెడుతున్న మీనన్ జేబును దొంగలు కొట్టేశారు. ఇక తనవద్ద పైసాలేదు. ఢిల్లీలో రైలు దిగి మీనన్ ప్లాట్‌ఫారంపై నిలబడి వున్న ఒక వృద్ధ సిక్కు వద్దకు వెళ్ళి తన పరిస్థితంతా విన్నవించుకొన్నాడు. సిమ్లా వెళ్ళడానికి 15 రూపాయలు అప్పుగా ఇవ్వవలసిందిగా ప్రార్థించాడు ఆ వృద్ధ సిక్కు జాలిపడి వెంటనే 15 రూపాయలు మీనన్ చేతిలో పెట్టాడు

సిమ్లా వెళ్ళిన తరువాత పైకం తిరిగి పంపుదామనే ఉద్దేశంతో ఆ వృద్ధ సిక్కు చిరునామా అడుగగా "నా చిరునామా ఎందుకు గాని ఇలాగే నీ వద్దకు ఎవరైనా ఇబ్బందులలో పడి సహాయం కోసం వస్తే 15 రూపాయలు చొప్పున ఇస్తూ వుండు. ఈ నియమం నీవు నీ జీవితాంతం పాటించు దేవుడు నీకు మేలు చేస్తాడు. వెళ్ళిరా" అన్నాడట.

అప్పటి నుంచి మీనన్ తన జీవితాంతం ఆ సిక్కు చెప్పిన నియమం పాటిస్తూనే వుండేవారు. సహాయం కోసం వచ్చిన అభాగ్యులందరికీ 15 రూ॥ ఇచ్చి పంపుతూ వుండేవారు. బెంగుళూరులో ఆయన గృహంలో మంచాన పడి ఇంకా ఒకటి రెండు రోజులకు చనిపోతారనగా కూడా ఒక బిచ్చగాడు తన ఇంటికి రాగా కుమార్తె చేత 15 రూపాయలు ఇప్పించారట.

## 6 గంటలలో ప్రణాళిక

1929లో గుమాస్తాగా చేరిన వి.పి. మీనన్ 1947 నాటికి కేవలం తన స్వశక్తితో వైస్రాయ్‌కి సలహాదారు కాగలిగారు. భారత్, పాకిస్తాన్ లకు స్వాతంత్ర్యం ఇవ్వడానికి కావలసిన ప్రణాళిక సాధ్యమైనంత త్వరగా తయారు చేసి ఇవ్వమని వైస్రాయ్ మౌంట్ బాటెన్, వి. పి. మీనన్‌ను కోరగా ఆ పత్రాన్ని కేవలం ఆరు గంటల వ్యవధిలో తయారు చేసి మీనన్ ఆనాటి ఐ.సి.యస్. అధికారులను, రాజ్యాంగవేత్తలను ఆశ్చర్య చకితుల్ని చేశారట !



బ్రిటిష్ మంత్రి రాజీనామాకు కారకుడైన

# చిత్తరంజన్ దాస్

స్వరాజ్య పార్టీ నిర్మాత, పండిట్ మోతీలాల్ నెహ్రూ సన్నిహిత సహచరుడు చిత్తరంజన్ దాస్. ఆయన ఇంగ్లాండ్‌లో చదివే రోజులలో



1893లో బ్రిటిష్ కామన్స్ సభకు జరిగిన ఎన్నికలలో సెంట్రల్ ఫిన్స్ బరీ నియోజకవర్గంనుంచి దాదాబాయ్ నౌరోజీ పోటీ చేశారు. ఆయనకు గ్లాడ్‌స్టన్ నాయకత్వానగల లిబరల్ పార్టీ మద్దతునిచ్చింది. దాదాబాయ్ తరపున విద్యార్థిగానున్న చిత్తరంజన్ దాస్ ప్రచారంచేశారు. ఆ ఎన్నికలలో నాటి బ్రిటిష్ ప్రధాని లార్డు సాల్స్‌బరీ దాదాబాయ్‌ను నల్లమనిషి అని హేళన చేయగా అందుకు చిత్తరంజన్ తన తీవ్ర నిరసన ప్రకటించారు.

## దాదాబాయ్ నౌరోజీ విజయానికి కారకుడు

చిత్తరంజన్ నిరసనకు కోపోద్రిక్తుడైన బ్రిటిష్ మంత్రి జేమ్సు మ్యాక్లీన్ ఒకబహిరంగసభలో భారతీయులను బానిసజాతిగా అభివర్ణించారు. దాంతో చిత్తరంజన్‌దాస్ మండిపడి ఇంగ్లాండులోని భారతీయ విద్యార్థుల సందర్శి సమావేశపర్చి దురహంకారి జేమ్సుమ్యాక్లీన్‌పై పెద్ద దుమారం లేవదీశారు. బ్రిటిష్ పత్రికలలో పెద్ద సంచలనం బయలుదేరింది. బ్రిటిష్ నాయకులు కూడా మ్యాక్లీన్ విమర్శ చాలా అసభ్యంగా ఉన్నదని ఒప్పు కోవాల్సి వచ్చింది. తత్ఫలితంగా జేమ్సుమ్యాక్లీన్ తననోటి దురుసుతనానికి క్షమాపణ చెప్పుకోవటమేగాక మంత్రి పదవికి కూడా రాజీనామా చేయాల్సి వచ్చింది. ఆ ఎన్నికలలో దాదాబాయ్ గెలిచి బ్రిటిషు పార్లమెంటుకు ఎన్నికైన ప్రప్రథమ భారతీయుడుగా విఖ్యాతుడయ్యాడు. ఈ విధంగా చిత్తరంజన్ దాదాబాయ్ నౌరోజీ గెలుపునకు, ఒకబ్రిటిష్ మంత్రి రాజీనామాకు కారకులయ్యారు. అందుకు ప్రతిఫలంగా ఆయన్ని ఆ సంవత్సరం ఐ.సి.యస్. పరీక్షలో ఫెయిల్ చేశారు బ్రిటిష్ అధికారులు. చిత్తరంజన్ అందుకు చింతించక అసలు ఐ.సి.యస్. పరీక్షకే చదవటం మానివేసి న్యాయశాస్త్రం చదివి బారిష్టరై ఇండియాకు తిరిగివచ్చారు.

## సాలీనా 6 లక్షల ఆదాయం

చిత్తరంజన్‌దాస్ కలకత్తా హైకోర్టులో ప్రాక్టీసు ప్రారంభించేనాటికి ఆయన కుటుంబ పరిస్థితులు దివాలాగా ఉండేవి. అయితే చిత్తరంజన్ ప్రాక్టీసు కొద్ది కాలంలోనే ఊహించని విధంగా తారాస్థాయి నందుకుంది. సివిల్, క్రిమినల్ కేసులు చేబట్టి గెలిపించటంతో ఆనాటి ప్రసిద్ధ వకీళ్ళ

లోనే ప్రథముడుగా పేరొందినాడు. ఆ రోజుల్లో ఆయన ఆదాయం సంవత్సరానికి 6 లక్షలు పైగా ఉండేదట. ఇంత ఆదాయం ఉన్న వకీళ్ళు ఆ రోజుల్లో దేశం మొత్తంమీద ముగ్గురో నలుగురో మాత్రమే ఉండేవారు. అందుకు తగ్గట్టే చిత్తరంజన్ ఆడంబర జీవితం గడిపేవారు. ఆయన ఇల్లు ఐరోపాలోని కోటీశ్వరుల భవంతికి సమూనాగా ఉండేది. ఇటలీలో తయారు చేయించిన భోజనాలబల్ల పెద్దపెద్ద హోటల్స్‌లో ఉండే బల్లకన్నా పెద్దది. భోజనాలు వడ్డించటానికి హోటల్స్‌లోలాగా యూనిఫారం ధరించిన సర్వర్లు ఉండేవారని చిత్తరంజన్‌కు సన్నిహితంగా మెలిగిన టంగుటూరు ప్రకాశం పంతులుగారు తన "జీవితయాత్ర"లో వ్రాశారు. ఇంట్లో పాత్రలన్నీ వెండితో తయారు చేయబడినవే. ఆయన ఇంట్లో ప్రతిరోజు సాహిత్యచర్చలు, సంగీత కచేరీలు ఏర్పాటు చేస్తూవుండేవారు.

చిత్తరంజన్‌దాస్ వకీలు జీవితానికి స్వస్తిపల్కి రాజకీయాలలో ప్రవేశించటంతో ఆయన ఆదాయం కూడా పడిపోయింది. కలకత్తాలో ధనవంతులలో ఒకరుగా పేరుగాంచిన చిత్తరంజన్ పేదవారయ్యారు. చిత్తరంజన్ చనిపోయేముందు తన ఆస్తిగా మిగిలిన ఇంటిని అమ్మి బాకీలు పోను మిగతా సొమ్ము ట్రస్టుగా ఏర్పరచి పేద ప్రజలకు ఉపయోగపడే పనులు చేయవల్సిందిగా వీలునామా వ్రాశారు.

చిత్తరంజన్‌దాస్ చనిపోయిన తర్వాత ఇంటిని తనకా పెట్టుకున్న ఋణదాతలు తమ బాకీలు వదులుకొని ఇంటిని ట్రస్టు ధర్మకర్తలకు ఒప్పగించారు. ప్రస్తుతం ఆ ఇల్లు "చిత్తరంజన్ సేవాసదన్" పేద ప్రజలకు వైద్య సౌకర్యాలు కల్పించుతోంది. ఈ సేవాసదన్‌కు గాంధీజీ కూడా 8 లక్షల రూపాయలు చందాలు ప్రోగుచేసి ఇచ్చారు.

## ప్రజాదరణ

దేశప్రజలు చిత్తరంజన్‌దాస్ పట్ల చూపిన ఆదరాభిమానాలు అనన్య సామాన్యం. ఇందుకు ఒక ఉదాహరణ...ఒకసారి ఆయన అస్సాం పర్యటన చేస్తున్నారు. ప్రతి రైలు స్టేషన్‌లోనూ ఆయన్ని దర్శించటానికి జనం తండోపతండాలుగా వచ్చేవారు. ఒకానొక రైలు స్టేషన్‌లో తెల్లవారుజామున 4 గంటలకు రైలు ఆగింది. ఎటూకాని ఆ టైంలో కూడా స్టేషన్ జనంతో కిటకిటలాడిపోయింది. చిత్తరంజన్ పై బెర్తులో నిద్రపోతున్నారు. ఆయన భార్య తదితర అనుచరులు క్రింద సీట్లలో కునికిపాట్లు పడుతున్నారు. ఇంతలో ఒక దృఢకాయుడు ఆజానుబాహుడయిన వ్యక్తి రైలు తలుపు తీసుకుని అమాంతంగా లోపలికి వచ్చి "దేశబంధు ఎక్కడ" అని ప్రశ్నించాడు. చిత్తరంజన్‌దాస్ భార్య, అనుచరులు బెదిరిపోయి దిక్కులు చూస్తున్నారు. అప్పుడు ఆ వ్యక్తి పై బెర్తులో నిద్రిస్తున్న దేశబంధుని చూసి "నేను ఏడురోజులు నడిచి దేశబంధు దర్శనార్థం ఇక్కడకు వచ్చాను. రెండు రోజుల నుంచి తిండిలేకుండా ఈ ప్లాట్‌ఫారం మీద వేచివున్నాను. తక్షణంఆయన్ని చూడాలి."అంటూ అమాంతంగా నిద్రిస్తున్న చిత్తరంజన్‌ను అవలీలగా చేతుల్లోకి ఎత్తుకొని బయట గుమిగూడివున్న జనసందోహానికి చూపాడట. నిద్రాభంగం కలిగిన చిత్తరంజన్ ఏదో రైలు ప్రమాదం జరిగింది కాబోలనుకుని గాబరా పడ్డారట. తీరా విషయం తెల్సిన తర్వాత పకపక నవ్వుకున్నారట. ★

అద్భుత ఉపన్యాసాల

# సురేంద్రనాథ్ బెనర్జీ

ప్రముఖ దేశభక్తుడు, మంచి వక్త, పత్రికా సంపాదకుడు సురేంద్రనాథ్ బెనర్జీ లండన్‌లో ఐ.సి.యస్. లో ఉత్తీర్ణుడై రాగానే షిల్హెట్ జిల్లా అసిస్టెంట్ కలెక్టర్‌గా నియమితులయ్యారు. ఆ జిల్లాకు అప్పట్లో సదర్‌లాండ్ అనే ఆంగ్లేయుడు కలెక్టర్‌గా ఉండేవాడు. అతను సురేంద్రనాథ్ బెనర్జీ కన్నా ఒక సంవత్సరం ముందుగా ఐ.సి.యస్. పూర్తిచేసినవాడు. సదర్‌లాండ్ ఐ.సి.యస్. రెండు మూడుసార్లు తప్పిన తర్వాత ఉత్తీర్ణుడైతే సురేంద్రనాథ్ మాత్రం మొదటిసారే ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు. అందువల్ల సదర్‌లాండ్, బెనర్జీ అంటే సహించలేకపోయేవాడు పైగా అతనికి స్వతహాగా ఇంగ్లీషువాళ్ళు గొప్పవారని అహంకారం. భారతీయులు ద్వితీయశ్రేణికి చెందినవారనే చులకనభావం కూడా ఉండేది.

## మహా నాయకుడు

సురేంద్రనాథ్ గొప్ప ఆత్మాభిమానం గల వ్యక్తి. ఎవరికీ లొంగే ఘటంకాదు. అందువల్ల వారిద్దరికీ ఎప్పుడూ పడేదికాదు. సురేంద్రనాథ్ బెనర్జీని దెబ్బతీయాలని సదర్‌లాండ్ అవకాశం కోసం ఎదురుచూస్తూవుండేవాడు. ఆ రోజుల్లో కలెక్టర్లకు, అసిస్టెంటు కలెక్టర్లకు నేరాలు విచారించే అధికారం ఉండేది. ఒక దొంగతనం కేసు విచారణ సందర్భంలో హెడ్ గుమస్తా తప్పుడు సలహాపై ఆధారపడి దొంగను నిర్దోషిగా తీర్పు చెప్పారు సురేంద్రనాథ్. దీన్ని ఆధారం చేసుకొనే, 'బెనర్జీ ఆ దొంగను కాపాడాలనే విడుదల చేశాడని పై అధికార్లకు రిపోర్ట్ చేశాడు సదర్‌లాండ్.

బ్రిటిష ప్రభుత్వం దానిపై విచారణకు ఒక సంఘాన్ని నియమించింది. అందులో అందరూ తెల్లవాళ్ళే. వారు సదర్‌లాండ్ చెప్పిందే నమ్మి సరిగా విచారణ కూడా చేయకుండా సురేంద్రనాథ్ బెనర్జీని తక్షణం ఐ.సి.యస్. నుంచి తొలగించారు.

ఆ తర్వాత సురేంద్రనాథ్ బారిష్టర్ చదవటానికి ఇంగ్లాండ్ వెళితే, కూర్చోటానికి కూడా వీల్లేదని బ్రిటిష ప్రభువులు శాసించారు. ఆవిధంగా కాంగ్రెస్ చరిత్రకారుడు డాక్టర్ పట్టాభి అన్నట్లు "భారతజాతి ఒక గొప్ప పరిపాలనాధ్యక్షుడ్ని కోల్పోయి ఒక మహానాయకుడ్ని పొందగలిగింది."

## 3 గంటల అద్భుత ప్రసంగం

18‹6లో పూనాలో కాంగ్రెస్ అధ్యక్షపదవికి సురేంద్రనాథ్ బెనర్జీ ఎంపిక అయ్యారు. ఆ రోజుల్లో కాంగ్రెస్ అధ్యక్షుడ్ని ప్రతినిధులు ఎన్నుకొనేవారు కాదు. ఆహ్వానసంఘంవారే ఎంపిక చేసేవారు. ఆ మహాసభలో సురేంద్రనాథ్ బెనర్జీ మూడు గంటలపాటు చేసిన అద్భుత ప్రసంగం కాంగ్రెస్ చరిత్రపుటలలో కలకాలం నిల్చివుంటుంది. ఆ ఉపన్యాసం తయారుచేయటానికి రోజుకు 3 గంటలు చొప్పున 6 వారాలపాటు కృషి చేయాల్సి వచ్చింది. ప్రతినిధులను మంత్రముగ్ధుల్ని చేసిన ఆ మహోపన్యాసంతో సురేంద్రనాథ్ మహావక్తగా దేశమంతటా గుర్తింపు పొందారు.

## మర్యాద ఇచ్చి పుచ్చుకోండి

బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా ఆందోళన జరుగుతున్న రోజులవి. సురేంద్రనాథ్ కలకత్తాలో ఒక బ్రహ్మాండమైన ఊరేగింపుకు నాయకత్వం వహించారు. యథాప్రకారం పోలీసులు శాంతియుతంగా జరుగుతున్న ఊరేగింపు మధ్యలో ఇష్టంవచ్చినట్లు కార్యకర్తల్ని చితకబాదారు. బెనర్జీని అరెస్టుచేసి మేజిస్ట్రేటు ముందు హాజరుపరిచారు. సురేంద్రనాథ్

మేజిస్ట్రేట్ ఎదురుగా వున్న కుర్చీలో కూర్చోబోతూ వుండగా అతను మండిపడి "ఏయ్ ఖైదీ అయినవాడు కుర్చీలో కూర్చోవటానికి వీల్లేద"ని వారించాడు. సురేంద్రనాథ్ ఏమీ తగ్గకుండా "మీతో అవమానం పొందటానికి ఇక్కడకు రాలేదు. మర్యాద ఇచ్చి పుచ్చుకోండి" అనగానే మేజిస్ట్రేట్ మరీ మండిపడి సురేంద్రనాథ్‌ను క్షమార్పణ చెప్పవల్సిందని ఆదేశించాడు. అందుకు సురేంద్రనాథ్ తిరస్కరించగా కోర్టు ధిక్కార నేరం క్రింద 200 రూపాయలు, ఊరేగింపు జరిపినందుకు మరో 200 రూపాయలు జరిమానా విధించాడు.

## కోర్టు ధిక్కారం

సురేంద్రనాథ్ బెనర్జీ "బెంగాలీ" అనే పత్రిక నడిపారు. ఆ పత్రిక ఆ రోజుల్లో విశేష ప్రచారంలో ఉండేది. 1883లో బెంగాల్ హైకోర్టులో ఓ హిందూ విగ్రహం గురించి వివాదం జరిగింది. దాన్ని వింటున్న జడ్జి 'నోరిస్' ఓ దశలో ఆ విగ్రహాన్ని పెకలించుకువచ్చి కోర్టులో ప్రదర్శించవల్సిందిగా ఆజ్ఞ జారీచేశాడు. పవిత్ర విగ్రహాన్ని పెకలించుకు రమ్మనటం పట్ల హిందువులలో ఆగ్రహావేశాలు పెల్లుబికినాయి. అనేక పత్రికలు అనుచితమైన నోరిస్ చర్యను తీవ్రంగా గర్హించాయి. సురేంద్రనాథ్ 'బెంగాలీ' పత్రికలో రాసిన ఘాటైన సంపాదకీయంలో అసలు నోరిస్ హైకోర్టు జడ్జిగా ఉండటానికి తగినవ్యక్తి కాడని నిందించాడు. దాంతో బెనర్జీపై కోర్టు ధిక్కారం కేసు పెట్టింది ప్రభుత్వం. అయితే కొంతమంది పెద్దలు సీనియర్ న్యాయవాదుల సలహాపై బెనర్జీ తన పత్రికలో నోరిస్‌ను వ్యక్తిగతంగా నిందించటం పొరపాటేనని క్షమార్పణ చెప్పినా బ్రిటిష్ ప్రభుత్వం సురేంద్రనాథ్‌పై కేసు ఉపసంహరించుకోలేదు. అయిదుగురు సభ్యులుగల ఫుల్‌బెంచి సురేంద్రనాథ్‌కు రెండు మాసాలు జైలుశిక్ష విధించింది.



"ప్రొద్దున్నే బ్రాహ్మణ్ని చూడటం
మంచిది కాదంటారు పెద్దలు" అన్న

# లాలా లజపతిరాయ్

భారత స్వాతంత్ర్య సమరయోధులలో అగ్రగణ్యుడు, 'పంజాబ్ కేసరి'గా ప్రఖ్యాతిపొందిన లాలాలజపతిరాయ్ గొప్ప సంస్కర్త, గ్రంథ కర్త, పత్రికా సంపాదకుడు కూడా.

లాలాజీ ప్రవాసకాలంలో ఆయన్ని 'పంజాబ్ కేసరి' అనే విశేష నామంతో పిలవటం ప్రజలలో వ్యాప్తిలోకి వచ్చింది. దానికి ప్రచారం పెరిగి దేశమంతటా లాలాజీని ఆ పేరుతోనే పిలవటం పరిపాటి అయింది. పత్రికలవారు కూడా ఆ విధంగానే వ్యవహరించేవారు. లాలాజీని పంజాబ్ కేసరి అనటం సిక్కులకు కోప కారణమయింది. వారి దృష్టిలో ఒక్క రంజిత్‌సింగ్‌ను మినహా మరెవ్వరినీ పంజాబ్ కేసరిగా వర్ణించటానికి వీలు లేదు. ఈ విషయంలో సిక్కుమత సంస్థలు లాలాజీకి ఒక ఉత్తరం రాస్తూ తమ అభ్యంతరాన్ని తెలియజేశాయి కూడా. అందుకు లాలాజీ పత్రికా ముఖంగా, తాను కావాలని 'పంజాబ్ కేసరి'ని తగిలించుకోలేదని ప్రజలు పత్రికలు బిరుదును వాడుతుంటే తాను చేయగలిగిందేమీ లేదని, సమాధానం రాశారు.

## మా తాతలు నేతులు తాగారు...

ఆ రోజుల్లోనే ఆధునిక భావాలు కల్గి, భారత దేశానికి సోషలిజమే శరణ్యం అని ప్రచారం చేసిన లాలాజీ మత ఛాందసులను ఏవగించుకునే వారు. సర్వమత సమానత్వాన్ని బోధించేవారు. ఆధ్యాత్మిక వాదనను నిందించేవారు. ఆధ్యాత్మిక ధోరణుల వలన భారతీయులు చాలా నష్టపోతు న్నారని భావించేవారు. బాబాలు, స్వాములు చేసే తంతులను తీవ్రంగా గర్హించేవారు.

ఒకసారి హరిచావు ఉపాధ్యాయ అనే ఆయన "త్యాగభూమి"అనే హిందూ మతసంబంధమైన పత్రిక ప్రారంభిస్తూ దానికి సందేశం ఇవ్వవల్సిందని లాలాజీని కోరితే ఆయన, 'మతసంబంధమైన పత్రికల్ని ఏవగించుకుంటానని, అటువంటి పత్రికల వలన దేశప్రజలు అధోగతి పాలవుతారని" తెలియజేస్తూ కావాలంటే ఇవేమాటలను తానిచ్చే సందేశంగా రాసుకోవచ్చని చెప్పారు.

ఒకసారి లాలాజీ మిత్రుడైన జోసియా వెడ్జివుడ్ స్వీయచరిత్ర రాసి లాలాజీకి పంపి, అభిప్రాయం తెలియజేయమని కోరాడు. అందులో అనేక అధ్యాయాల్లో వెడ్జివుడ్ పూర్వీకుల గొప్పతనాల్ని అతిశయోక్తులతో వర్ణించటం చూసిన లాలాజీ చిరాగ్గా "మా తాతలు నేతులు తాగారు, మా మూతులు వాసన చూడమన్న చందంగా, ఈ విధంగా స్వీయచరిత్ర రాసుకోవడం నాకు నచ్చలేదు" అని నిష్కర్షగా సమాధానం రాశారు.

## చెడిపోయిన బ్రాహ్మణుడు

లాలాజీకి 'కిచ్లూ' అనే మిత్రుడుండేవాడు. తన పూర్వీకులు బ్రాహ్మణులైనా కిచ్లూ ముస్లింమతంలోకి మారి ముస్లింలీగ్‌లో పనిచేస్తూ వుండేవాడు. కిచ్లూకు ఒక పత్రిక వుండేది. ఆ పత్రికలో ఒక్కొక్కప్పుడు లాలాజీని కూడా కఠినంగా విమర్శిస్తూ వుండేవాడు. అయినా లాలాజీ వాటిని పట్టించుకునేవాడు కాదు. ఒకసారి వాళ్ళిద్దరూ అనుకోకుండా పొద్దున్నే రైలు ప్లాట్‌ఫారంపై కలుసుకోవటం తటస్థించింది. కిచ్లూను చూడటంతోనే లాలాజీ హాస్యంగా, "పొద్దున్నే బ్రాహ్మణ్ణి చూడటం మంచిది కాదంటారు పెద్దలు" అంటే కిచ్లూ పెద్దగా నవ్వుతూ, "నేను చెడిపోయిన బ్రాహ్మణ్ణి కాబట్టి మీకేం ఇబ్బంది వుండదు" అన్నాడు. తరవాత ఆ ఇద్దరూ విభేదాలు విస్మరించి చాలా సేపు లోకాభిరామాయణంలో పడిపోయారు.

## మరపురాని వాక్యాలు

"మదర్ ఇండియా" పేరుతో మిస్ మయో అనే అమెరికన్ పత్రికా రచయిత్రి భారతదేశం గురించి రాసిన అవాకులు చవాకుల్ని ఖండిస్తూ

లాలాజీ 'అన్‌హేపీ ఇండియా' రచించారు. ఆ పుస్తకంలో లాలాజీ అపారపాండిత్యం, వ్యక్తిత్వం, రచయితగా ఆయన నైపుణ్యం స్పష్టమవుతుంది. అంతేగాక ఆ పుస్తకాన్ని అమెరికన్లకే అంకితం ఇచ్చి తన విశాల హృదయాన్ని వెల్లడిచేసి, మిస్ మయో సంకుచిత దృష్టిని బట్టబయలు చేశారు. ఆరోజుల్లో ఈ పుస్తకం వేలాది ప్రతులు అమ్ముడుపోయినై. 'అన్‌హేపీ ఇండియా' లో ఆయన "ఆసియా ఖండం యూరప్ ప్రజలకు జ్ఞానభిక్ష పెట్టింది. అమెరికా యూరప్ బిడ్డమాత్రమే. భారతదేశాన్ని జయించటం ద్వారా ఐశ్వర్యం పొందిన బ్రిటన్‌కు భారత స్వాతంత్ర్యం పొందిన మరుక్షణం ఆధిక్యత అంటూ ఏమీ వుండదు" అని వ్రాశారు. ఈ వాక్యాలు ఎన్నటికీ మరపురానివి.

## లాలాజీ - గాంధీజీ

లాలాలజపతిరాయ్ గాంధీజీ నాయకత్వాన్ని అంగీకరించినా కొన్ని విషయాల్లో ఆయనకు గాంధీజీ పై ఖరి నచ్చేదికాదు. ముఖ్యంగా హిందూ మహమ్మదీయ సమస్యపై గాంధీజీ ధోరణి ఆయనకు వ్యతిరేకం. ఈ విషయంపై లాలాజీ "పీపుల్స్" అనే పత్రికలో పది పన్నెండు వ్యాసాలు గాంధీజీ ధోరణిని నిరసిస్తూ వ్రాశారు. అయినా గాంధీజీ పట్ల ఆయనకు ఎంతో గౌరవం వుండేది. ఒకసారి హిందూ ముస్లిం సమస్య గురించి బహిరంగ సభలో మాట్లాడవల్సిందిగా కోరగా లాలాజీ తన మనస్సులో మాటలు కుండబ్రద్దలు కొట్టినట్లు మాట్లాడుతూ గాంధీజీ పంథాను తీవ్రంగా విమర్శిస్తూ కూడా చివరకు ఒకమాట అన్నారు "అయినా ఈ హిందూ ముస్లిం సమస్యను పరిష్కరించగల శక్తి ఈ దేశంలో ఒకే ఒక్క మహా నాయకుడికి వుంది. ఆయనే పూజ్యబాపూజీ. ఆయన తప్ప మరెవ్వరూ ఈ సమస్యను పరిష్కరించలేరు." లాలాజీకి గాంధీజీపై అంతటి గౌరవం వుండేది.



గాంధీజీ తర్వాత పెద్ద బిచ్చగాడు

# మదన్ మోహన్ మాలవ్యా

కాశీ విశ్వవిద్యాలయం సంస్థాపకుడు, పండిట్ మదన్ మోహన్ మాలవ్యా జీవితాంతం దాని అభివృద్ధికే కృషిచేశారు. విశ్వవిద్యాలయం కోసం చందాలు పోగుచేయటానికి భారతదేశమంతా తిరిగారు. ఆయన గురించి ఓసారి జె.బి. కృపలానీ "గాంధీజీ తర్వాత మాలవ్యాయే మన దేశంలో పెద్ద బిచ్చగాడు" అన్నారు. మాలవ్యా ప్రతిరోజు ఇంత మొత్తం సేకరించాలని ఒక లక్ష్యంగా పెట్టుకునేవారు. ఆ మొత్తం సమకూరే దాకా ఆహారం తీసుకునే వారు కారు.



# చందాల వసూళ్ళతు చిట్కాలు

ఒకసారి మాలవ్యా, అనుచరులతో కలిసి ఒక షావుకారు వద్దకు చందా కోసం వెళ్ళారు. ఆతను చందా మాట ఎత్తకుండా ఆ బృందానికి విందు ఏర్పాటుచేసి భోజనానికి పిల్చాడు. మాలవ్యా భోంచేయటానికి నిరాకరించి, ఆ రోజు తను అనుకున్న మొత్తం చందా పోగుచేసేదాకా భోజనం చేయనని చెప్పారు. దాంతో షావుకారు అది ఎంతో తెల్సుకొని అంతే మొత్తం తక్షణం ఇవ్వగా అప్పుడు మాలవ్యా భోజనానికి కూర్చున్నారు.

మరోసారి మాలవ్యా ఒక బ్యాంకు యజమాని దగ్గరకు చందాకోసం వెళ్ళారు. ఆ బాంకు యజమాని అప్పటికి ఆర్థికంగా చిక్కుపరిస్థితులో వున్నాడు. ఖాతాదార్లకు ఆతని మీద విశ్వాసం పోయి బ్యాంకు దివాళా పరిస్థితులలో వుంది. అని చెప్పి తానేమీ చందా ఇవ్వలేనని విన్నవించుకొన్నాడు. మాలవ్యా కాసేపు ఆలోచించి "ఒక పని చేస్తే వ్యాపారం తిరిగి బాగుపడుతుంది. 5 లక్షలకు చెక్కు రాసి చందాగా నాకివ్వు" అని చెప్పారు. దానికి బ్యాంకు యజమాని "5 లక్షలు వుంటే బ్యాంకు దివాళా తీసే పరిస్థితి ఎందుకు వస్తుంది?" అని ప్రశ్నించగా, మాలవ్యా "ముందు నేను చెప్పినట్లు చెయ్యి" అన్నారు.

బ్యాంకు యజమాని 5 లక్షలకు చెక్కు రాసి మాలవ్యాకు ఇచ్చాడు. అతను కాశీ విశ్వవిద్యాలయానికి 5 లక్షలు చందా ఇచ్చినట్లు మర్నాడు పేపర్లలో ప్రముఖంగా ప్రకటించటంతో బ్యాంకుపై ఖాతాదార్లకు తిరిగి నమ్మకం కుదిరి అందులో సొమ్ము దాచుకోవటం ప్రారంభించారు . బ్యాంకు వ్యాపారం తిరిగి పుంజుకుంది, మాలవ్యాకు 5 లక్షలు దక్కాయి.

## "ఫర్వాలేదు"

కాశీ విశ్వవిద్యాలయం ప్రారంభించిన కొత్తలో ఒక బ్రిటిషు ప్రతినిధి వర్గం విశ్వవిద్యాలయాన్ని చూడటానికి వచ్చింది. ఆ సమయంలో మాలవ్యా ఏదో మీటింగ్‌కి హాజరయ్యేందుకు తయారవుతున్నారు. ఆ ప్రతినిధివర్గాన్ని శేషాద్రి అనే ప్రొఫెసర్‌కు అప్పగించి "విశ్వవిద్యాలయం అంతా తిప్పి చూపించండి." అని పురమాయించారు. అప్పుడు సాయంత్రం 5 గంటలు అయింది. అందుకని శేషాద్రి "ఈపాటికి విద్యార్థులు, ఉపాధ్యాయులు ఇళ్ళకు వెళ్ళిపోయివుంటారుగదా" అంటే "ఫర్వాలేదు. నౌకర్లయినా వుండరా ఏమిటి?" అని మాలవ్యా ప్రశ్నించారు. "వాళ్ళు కూడా వుంటారో, వుండరో" అని సందేహం వెళ్ళబుచ్చారు శేషాద్రి. దానికి "అయినా ఫర్వాలేదు. ప్రతినిధివర్గం కిటికీల్లోనుంచైనా చూస్తారు.... తీసుకువెళ్ళి చూపించండి" అని మాలవ్యా అనటంతో ప్రతినిధివర్గంలో ఒక సభ్యుడు అందుకొని, "మాకు ఇప్పుడు అర్థమైంది ఈ విశ్వవిద్యాలయాన్ని మాలవ్యా ఎలా ఏర్పాటుచేశారో, ఎట్టి పరిస్థితుల్లోనైనా "ఫర్వాలేదు" అనే ఆయన పట్టుదలే దీని స్థాపనకి కారణం అయివుంటుంది" అన్నాడు. ఆ తర్వాత మాలవ్యాయే వారికి విశ్వవిద్యాలయం అంతా చూపించి తాను వెళ్ళవల్సిన మీటింగుకు కాస్త ఆలస్యంగా వెళ్ళారు

## ఆగండి...లెక్కబెట్టి చెబుతాను

మాలవ్యా మాటల్లో ఒకొక్కప్పుడు హాస్యం కూడా తొంగి చూసేది. ఓసారి ఒక మిత్రుడు ఆయనింటికి వచ్చి మాటల సందర్భంలో "మీ కుటుంబ సభ్యులు ఎంతమంది?" అని ప్రశ్నించాడు. బిగ్గరగా నవ్వుతూ "ఆగండి....లెక్కబెట్టి చెబుతాను" అన్నారు, నలుగురు కొడుకులు ముగ్గురు కూతుళ్ళు, అనేక మంది మనుమలు, మనుమరాండ్రు గల మాలవ్యా.

కాశీ విశ్వవిద్యాలయంలో ఒకసారి మాలవ్యాకి తెలియకుండా ఆయన దగ్గర బంధువు ఒకరికి పెద్ద వుద్యోగం ఇవ్వటం జరిగింది. ఈ విషయం తెల్సిన వెంటనే మాలవ్యా విశ్వవిద్యాలయపు అప్పటి వైస్ ఛాన్సలర్ డాక్టర్ రాధాకృష్ణన్‌కు ఉత్తరం రాస్తూ తన బంధువును వెంటనే వుద్యోగం నుంచి తొలగించవల్సిందిగా కోరారు.

## తద్దినానికి బంగాళాదుంపలు.

ఆచార వ్యవహారాలలో మాలవ్యా చాలా నిష్ఠగా వుండేవారు. ఆయన కుటుంబ సభ్యులు వండిన భోజనం తప్ప ఇతరుల చేతి భోజనం తినే వారుకాదు. అసెంబ్లీ లోగాని కాంగ్రెసు సభలలోగాని అక్కడి మంచినీళ్ళు కూడా తాగేవారుకాదు. ప్రభుత్వం ఏర్పాటు చేసిన విందులలోను, ఇతరత్రా ఏర్పాటయిన విందులలోనూ ఆయన ఏమీ తినేవారు కాదు. మర్యాదకోసం మాత్రం ఆ విందులలో పాల్గొనేవారు. శాకాహారం, పాలు మాత్రమే మాలవ్యా తీసుకునేవారు. ఆయన తండ్రి బంగాళాదుంపలు బాగా ఇష్టంగా తినేవారట అందువల్లనే బంగాళాదుంపలు తనకు రుచించకపోయినా తండ్రి తద్దినం రోజున మాత్రం వాటిని తప్పనిసరిగా తినేవారు మాలవ్యా.

గోవులను ఎక్కువగా అభిమానించేవారు మాలవ్యా. వారికి ఎప్పుడూ కొన్ని ఆవులు వుండేవి. ఉదయం సాయంత్రం మాలవ్యా ఆవు దూడలతో ఆడుతూ వుండేవారు. ఒకసారి ఆయన ప్రయాణిస్తున్న చిన్నకారు ఒక ఎడ్ల బండిని ఢీకొంది. ఆ ప్రమాదంలో ఆయనకు బాగా దెబ్బలు తగిలినా ఏమీ పట్టించు కోకుండా, ఎడ్లకు ఏమైనా దెబ్బలు తగిలినాయేమోనని వాకబు చేశారు పశువులంటే అంత దయ వుండేది. ఆయన ఎప్పుడూ పశువుల చర్మంతో తయారు చేసిన చెప్పులు వేసుకునేవారు కాదు. కాన్వాస్ బూట్లు మాత్రమే వాడేవారు.

## అద్భుత వాదనా చాతుర్యం

న్యాయవాదిగా మాలవ్యా గొప్పతనానికి ఈ ఉదంతం ఒక ఉదాహరణ. 1922లో ఉత్తరప్రదేశ్‌లోని చౌరీచౌర పోలీసుస్టేషనుపై తీవ్రవాదులు దాడి చేసి 21 మంది పోలీసుల్ని చంపారు. అదే అదనుగా తీసుకుని పోలీసులు వారికి అనుమానం వున్న 225 మందిని కేసులో ఇరికించారు. వారికి భయపడి స్థానిక న్యాయవాదులెవరూ ఆ అమాయకుల తరుపున వాదించడానికి సిద్ధపడ లేదు. ఫలితంగా 225 మందిలో 170 మందికి జిల్లా కోర్టు ఉరిశిక్ష విధించింది.

దారుణమైన ఆ శిక్షకి స్పందించిన అనేక మంది పెద్దమనుషులు మదన్ మోహన్ మాలవ్యా దగ్గరకు వెళ్ళి ఎలాగైనా హైకోర్టుకు తీసుకు వెళ్ళి ముద్దాయిల తరుపున వాదించమని ప్రాధేయపడ్డారు. మాలవ్యా అప్పటికి 20 సంవత్సరాలక్రితమే న్యాయవాద వృత్తిని విరమించి దేశసేవలో నిమగ్నమై వున్నారు. అయినా ఆ కేసుని చేపట్టటానికి సంసిద్ధత వ్యక్తంచేసి కేసు పూర్వాపరాలను పరిశీలించి, హైకోర్టులో అప్పీలు చేశారు. కేవలం మాలవ్యా వాదనా పటిమవల్లనే ముద్దాయిలుగా పేర్కొనబడిన 170 మందిలో 150 మందిని హైకోర్టు నిర్దోషులుగా నిర్ణయించింది.

తీర్పు చెబుతూ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి మాలవ్యాను ఈ విధంగా మెచ్చుకున్నారు... "అద్భుతమైన మీ వాదనా చాతుర్యాన్ని మేము అభినందించకుండా వుండలేకపోతున్నాం. మీరు తప్ప మరే న్యాయవాదీ ఇంత చక్కగా వాదించలేరన్నది సత్యం, ముద్దాయిలుగా పేర్కొనబడిన ఈ నిర్దోషులకు మీరు చేసిన సహాయానికి వారుసర్వదా కృతజ్ఞులైవుంటారు" అలా హైకోర్టు జడ్జీలచేతకూడా కీర్తించబడిన ప్రతిభా వంతుడైన న్యాయవాది మదన్‌మోహన్ మాలవ్యా.



హోమియో డాక్టర్

# మోతిలాల్ నెహ్రూ

ఆనాటి కాంగ్రెసు నాయకులలో అగ్రగణ్యులు, స్వరాజ్య పార్టీ నిర్మాత,పండిట్ నెహ్రూ తండ్రి మోతీలాల్ నెహ్రూ ప్రముఖ వకీలు. అయితే



ప్రాక్టీసు మొదలు పెట్టిన కొత్తలో ఆయనకు తొలికేసులో పుట్టినది కేవలం అయిదు రూపాయలు మోతిలాల్‌కు 30 ఏళ్ళు వచ్చేటప్పటికి నెలసరి ఆదాయం రెండువేల రూపాయలకు పెరిగింది. 40వ ఏట ఆయన సంపాదన నెలకు లక్ష రూపాయలకు చేరింది. అలహాబాద్ హైకోర్టులో నాటి అత్యంత సమర్థులైన నలుగురు వకీళ్ళలో మోతిలాల్ ఒకరు.

# నిత్యం విందులే

1900 సంవత్సరంలో అలహాబాద్‌లోని చర్చి రోడ్‌లో ఒక పాత భవనాన్ని 19 వేలకు కొన్నారు మోతీలాల్. దాన్ని కొన్ని లక్షలు ఖర్చు పెట్టి ప్రసిద్ధ ఆనంద్ భవన్‌గా తీర్చిదిద్దారు. మోతీలాల్ ఐరోపా వెళ్లినప్పుడల్లా అక్కడినుంచి అధునాతన గృహోపకరణాలు తెచ్చి ఆనంద్ భవన్‌లో వుంచేవారు. ఆయనకు ఆదాయం ఎంత అధికంగా వచ్చేదో అంత విచ్చలవిడిగానే ఖర్చుచేసేవారు ఆనంద్ భవన్‌లో నిత్యం ఏదో ఒక పేరుమీద విందులు జరుగుతూండేవి.

1904లో మోతీలాల్ ఐరోపానుండి కారుకొని తెచ్చారు ఉత్తర హిందూస్థానంలో వాడుకలోకి వచ్చిన మొట్టమొదటికారు అదేనని చెబుతారు. తర్వాత మోతీలాల్ ఫియట్, లాన్‌షియా అనే రెండు కార్లను కూడా ఐరోపానుంచి కొనుక్కొచ్చారు. కార్లుకాక ఆయన వద్ద అనేక అరేబియా జాతి గుర్రాలు, గుర్రపుబగ్గీలు వుండేవి.

మోతీలాల్ వేషధారణ విషయంలో బయట పాశ్చాత్యపద్ధతి అనుసరించినా ఇంటివద్ద మాత్రం పైజామా, లాల్చీయే ధరించేవారు. ఆయన ఐరోపా వెళ్లినప్పుడే కావలసిన బట్టలు కొనుక్కొనేవారు. బంగారు ఆభరణాలు వజ్రాలు పరిశీలించటం, వాటి నాణ్యత గురించి చెప్పటం మోతీలాల్ హాబీ. జవహర్‌లాల్ వివాహం సందర్భంగా కోడలికి పెట్టవలసిన ఆభరణాలను ఆయనే స్వయంగా ఎంపిక చేశారు.

## కాంపౌండర్ విజయలక్ష్మి

మోతీలాల్‌కి మరో హాబీ హూమియోపైద్యం! ప్రతిరోజు ఇంటి వద్ద అనేకమంది రోగులకు హూమియోమందులు ఇస్తూవుండేవారు. ఆయన కుమార్తె విజయలక్ష్మి కాంపౌండర్‌లా రోగులను పరీక్షించటం, వారు చెప్పిన విషయాలను నోట్‌పుస్తకంలో రాయటం చేసేవారు. కొన్నాళ్ళు మోతిలాల్ సాయంగా మరొక హూమియో డాక్టర్‌నుకూడా తీసుకున్నారు. ముఖ్యమైన కేసులు మాత్రం తనే వైద్యం చేస్తూండేవారు.

## తండ్రి చేయలేని ఘనకార్యం

1929లో లాహూర్ కాంగ్రెసు అధ్యక్షపదవికి పండిట్ జవహర్ లాల్ ఎన్నికయ్యారు. అప్పటివరకూ ఆ పదవిలో మోతీలాల్ వున్నారు. కాంగ్రెసు చరిత్రలో అత్యున్నతమైన అధ్యక్షపదవి తండ్రి నుండి కుమారు నికి రావటం అదే ప్రథమం. ఆ పదవిని స్వీకరించినరోజున నెహ్రూకు లాహూర్‌లో లభించిన బ్రహ్మాండమయిన స్వాగత సత్కారాలు మరెవరికీ లభించివుండవు. నగర మంతా పండుగ చేసుకున్నట్టు ప్రతి ఇంటినీ అలంక రించి, వీధులన్నీ ఈశ్రపర్చి రంగుసీళ్ళతో కళ్లాపుచల్లారు. కాంగ్రెసు చరిత్రలో అపూర్వరీతిలో నెహ్రూను తెల్లగుర్రంపై కూర్చోబెట్టి మేళ తాళాలతో ఊరేగింపుగా సభాస్థలికి తీసుకువెళ్తుంటే లాహూర్ ప్రజలంతా వీధుల్లో బారులుతీరి నిలబడ్డారు. స్త్రీలు, పిల్లలతోసహా ఇంటికప్పులెక్కి బాల్కనీలో నిలబడి నెహ్రూపై పుష్పవర్షం కురిపించారు. మోతీలాల్ భార్య స్వరూపరాణి కూడా మేడపై నిలబడి తన కుమారుని వైభవం కళ్లారా చూస్తూ పూలు చల్లారు. కుమారుడికి అధ్యక్షపదవిని అప్పగిస్తూ ఆనందభాష్పాలతో "తండ్రి చేయలేని ఘనకార్యం తనయుడు సాధించ గలడు" అనే పర్షియన్ సూక్తిని చదివారు.



కాంగ్రెసు నాయకులకన్నా ఎక్కువగా
జనాన్ని ఆకర్షించిన వైశ్రాయ్

# లార్డ్ మౌంట్ బాటెన్

**1947**లో మనకు స్వాతంత్ర్యం రావటానికి కొద్దిరోజుల ముందే భారతదేశానికి ఆఖరి వైస్రాయ్‌గా వచ్చిన ఎరల్ మౌంట్‌బాటెన్ పూర్వపు వైస్రాయ్‌లకన్నా అన్ని విధాలా విశిష్టవ్యక్తి. అంతకుముందు వచ్చిన వైస్రాయ్‌లందరూ భోగభాగ్యాలకు, ఆడంబరాలకు అలవాటుపడి ప్రజానీకానికి దూరంగా వుండిపోతే, రాజకుటుంబానికి చెందిన మౌంట్ బాటెన్, ఆయన భార్య ఎడ్వీనా మాత్రం భారత ప్రజానీకానికి ఆప్తమిత్రులుగా వ్యవహరించసాగారు. వారు ఢిల్లీ రావటంతోనే లోగడ వైస్రాయ్‌లు అనుసరించిన డాంబికాలన్నీ కాలదన్నారు.

## జనసామాన్యంలో వైశ్రాయ్

లోగడ వైస్రాయిలు దేశంలో ఎక్కడ పర్యటనకు వెళ్ళినా, ప్రతి వందగజాలకు ఒక సాయుధ పోలీసు కాపాలావుండేవాడు. వీరుగాక వంద లాది పోలీసు సిబ్బంది వైస్రాయిని "కాపాడటానికి" వెంట వెళ్ళేవారు. ప్రతి ఉదయం వైస్రాయి గుర్రంమీద షికారుకు వెళితే ఎందరో రక్షక భటులు ఆయనతోపాటు వెళ్ళేవారు. వైస్రాయి "పోలో" ఆడుతున్నచోట చుట్టూ అసంఖ్యాకమైన సాయుధ పోలీసులు వలయంలా వుండేవారు.

మౌంట్‌బాటెన్ దంపతులు భారత ప్రజానీకానికి సన్నిహితంగా ఉండాలనే తలంపుతో—అంగరక్షకులు, పోలీసు అధికార్లు ఎంతవారించినా, పాతపద్ధతుల్ని వదిలివేశారు. ఆ దంపతులు ప్రతి ఉదయం ఎలాంటి రక్షణ, బందోబస్తులేకుండా ఇద్దరే గుర్రాలమీద షికారుకు వెళ్ళేవారు. దారి

పొడుగునా ఎవరైన వారు నమస్కారాలు చేస్తుంటే ప్రతినమస్కారం చేస్తూ ప్రయాణించేవారు.

## మహనీయుడు మౌంట్‌బాటెన్

మౌంట్‌బాటెన్ దంపతులు ఢిల్లీ వచ్చిన వారంలోపే ఓరోజు అకస్మాత్తుగా పండిట్‌జవహర్‌లాల్ నెహ్రూ ఇంటికి వెళ్ళారు. అప్పుడు నెహ్రూ తోటలో పచార్లు చేస్తున్నారు. మౌంట్‌బాటెన్ నెహ్రూ భుజం మీద చేయివేసి కుశలప్రశ్నలతో పలకరించి పిచ్చాపాటీ మాట్లాడారు. ఆ సమీపంలోనున్న వ్యక్తులతో కరచాలనం చేశారు మౌంట్‌బాటెన్. ఈ చర్య నెహ్రూతోసహా అందర్నీ ఆశ్చర్యంలో ముంచెత్తింది. లోగడ వైస్రాయిలెవరూ రాజకుటుంబాల ఇళ్ళకు తప్ప ఇతరుల ఇళ్ళకు వెళ్ళేవారు కాదు. ఆ వెళ్ళటం కూడా ఎంతో హంగు ఆర్భాటంతో, మందీ మార్బలంతో వెళ్ళేవారు.

ఆరోజు సాయంత్రం సోదరి విజయలక్ష్మి పండిట్‌తో ముచ్చటిస్తూ "భగవంతుని దయవల్ల ఈనాటికి మనదేశానికి ఒకమహనీయుడు వైస్రాయిగా వచ్చాడు" అన్నారట — నెహ్రూ.

## కాంగ్రెసు నాయకులు కన్నా వైశ్రాయ్ దంపతులు మిన్న

వైస్రాయి దంపతులు మరో అసాధారణ చర్య తీసుకున్నారు. వైస్రాయి భవంతిలో జరిగే విందు అన్నింటికీ అతిథులుగా తప్పనిసరిగా సగం మందినైనా భారతీయుల్ని ఆహ్వానించేలా నిర్ణయించారు. లోగడ జరిగిన విందులకు అసలు భారతీయులకు ఆహ్వానాలు వుండేవికావు కేవలం ఆంగ్లేయుల్నే పిల్చేవారు. మాంసాహారం తినని భారతీయులకు శాఖాహారం కూడా ప్రత్యేకంగా తయారుచేయించాలని కూడా నిర్ణయించారు.

వీటన్నింటివల్లా మౌంట్‌బాటెన్ దంపతులపట్ల భారతీయులకు వల్లమాలిన అభిమానం కలిగింది. వారు ఎక్కడికి వెళ్ళినా విశేషంగా జనాన్ని ఆకర్షించేవారు. ఒకసారి నెహ్రూ "కాంగ్రెసు నాయకులకన్నా వైస్రాయి దంపతులు ఎక్కువ జనాన్ని ఆకట్టుకుంటున్నారు." అన్నారట. ప్రముఖ అమెరికన్ పత్రిక 'న్యూయార్క్ టైమ్స్' "భారతదేశ చరిత్రలో ఏ ఒక్క వైస్రాయికూడా మౌంట్‌బాటెన్ లాగా భారతీయుల గౌరవాభిమానాల్ని పొందలేదు" అని రాసిందానాడు.

## ఆగస్టు 15

**1947** అగస్టు 15న భారతదేశానికి స్వతంత్రం ఇవ్వాలనే నిర్ణయం బ్రిటీషు ప్రభుత్వం లేదా జాతీయ నాయకులు చేసిన నిర్ణయం కాదంటే నమ్మటం కష్టం. కాని వాస్తవానికి ఆ తేదీ నిర్ణయించింది ఆనాటి వైస్రాయి మౌంట్‌బాటెన్ మాత్రమే!

అంతకు పూర్వం భారత్‌కు స్వతంత్రం ఇవ్వాలనే బ్రిటన్ నిర్ణయించినా ఇంకా తేదీ నిర్ధారణ చేయలేదు. జాతీయనాయకులు కూడా స్వాతంత్ర్యాన్ని పొందటం ఖాయమని నమ్మినా అది ఎప్పుడు జరుగుతుందో ఊహించలేదు.

**1947** మేలో ఓరోజు మౌంట్‌బాటెన్ పత్రికా గోష్ఠి ఏర్పాటు చేశారు. దానికి ప్రపంచపు నలుమూలలనుంచి 3 వందల మందికి పైగా పత్రికా విలేకరులు హాజరయ్యారు. గోష్ఠి జరుగుతుండగా ఒక విలేకరి సూటిగా "భారతదేశానికి ఏ తేదీన స్వతంత్రం ఇద్దామనుకొంటున్నారు" అని ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకు సిద్ధంగాలేని మౌంట్‌బాటెన్ కాసేపు ఆలోచించి "అగస్టు 15" అని ప్రకటించారు.

అగస్టు 15 అని మౌంట్‌బాటెన్ ఎందుకు నిర్ధారించారంటే అంతకు రెండు సంవత్సరాల క్రితం తాను ఆగ్నేయాసియాలో మిత్రమండలి సైన్యాధి

పతిగా వుండగా జపాన్ ఆగస్టు 15న లొంగిపోయింది. సైన్యాధిపతిగా ఆయనకు అంతకన్నా ఆనందకరమైన వార్త ఏముంటుంది? అందుకే ఆయనకు ఆగస్టు 15 అంటే అంత మక్కువ.

ఊహించని విధంగా 'భారత్‌కు ఆగస్టు 15న స్వతంత్రం' అని రేడియోలో వార్త వెలువడటంతో జాతీయ నాయకులలో హడావుడి ఎక్కువైంది. లండన్‌లో కలకలం ప్రారంభమైంది.

## ఆగస్టు 15 అశుభకరం

ఇదిలా వుండగా జ్యోతిష్కులు పంచాంగాలు తిరగెయ్యటం ప్రారంభించారు. కూడికలు, హెచ్చవేతలు ప్రారంభించారు. కాశీలోని జ్యోతిష్య పండితులు ప్రథమంగా ఆగస్టు 15 శుక్రవారం అశుభకరమైనదని ప్రకటించిరి అనేకమంది పండితులు వీరి వాదననే బలపర్చారు. వీరి మాటలను నమ్మిన అసంఖ్యాక ప్రజలు "అయినా ఈ ఇంగ్లీషు వాళ్ళు ఆగస్టు 15నే మనల్ని వదిలిపోవటం ఎందుకు? 16న పోతే బాగుండేది కదా— ఒక్క రోజు మనకు స్వతంత్రంరావటం ఆలస్యమైతే కొంపలేం అంటుకుంటాయి" అని వాపోసాగారు.

కలకత్తాకు చెందిన ప్రసిద్ధి చెందిన జ్యోతిష్య శాస్త్రవేత్త స్వామి మదనానంద లార్డ్ మవుంట్‌బాటెన్‌కు ఒక ఉత్తరం రాస్తూ "ఆగస్టు 15 శుక్రవారంనాడు భారతదేశానికి స్వతంత్రం ఇస్తే భారతదేశ ప్రజలు కరువు కాటకాలతో అలమటిస్తారని, మతకలహాలు పెచ్చు పెరిగిపోతాయని, వరదలు పొంగి దేశాన్ని ముంచెత్తుతాయని కాబట్టి ఆ తేదీ మార్చవల్సిందని మరీమరీ కోరాడట. అయితే ఈ మూఢనమ్మకాలు విశ్వసించే మనిషి కాదు లార్డు మవుంట్‌బాటెన్. ప్రకటించిన విధంగానే ఆగస్టు 15వ తేదీనే మనకు స్వాతంత్ర్యం వచ్చింది.



పొట్టివాడైనా గట్టివాడైన

# లాల్ బహదూర్ శాస్త్రి

లాల్ బహదూర్ శాస్త్రి పొట్టిగావున్న తనపై తానే జోకులు వేసు కొని ఇతరులను నవ్విస్తూ వుండేవారు. ఒకసారి ఆయనొక పిల్లల సమా



వేశానికి అధ్యక్షత వహించినప్పుడు "నా మరుగుజ్జు బాలకం చూసి కాబోలు నన్ను ఈ సభకు అధ్యక్షు డిగా ఎన్నుకున్నారు. మరి ఈ పొట్టి బుడంకాయతో పెద్దవాళ్ళు ఎవరు ఆడుకుంటారు—పిల్లలు తప్ప" అని పిల్లల్ని బాగా నవ్వించారు. మరోసారి లాల్ బహదూర్ కేంద్ర హోం మంత్రిగా వున్నప్పుడు ఒక సభకు అధ్యక్షత వహించారు. వక్తలు "మన హోంమంత్రి అజాతశత్రువు" అని వర్ణించగానే ఆయన అందుకుని "మరి జానెడు బెత్తెడులేని నేను ఎవరితో

నైనా ఎట్లా విరోధం తెచ్చుకోగలను?" అని చమత్కరించి అందర్నీ నవ్వించారు.

## కట్నం కొయ్య చరఖా ఖద్దరు పంచె

1927లో లాల్‌బహదూర్‌కు లలితాదేవితో వివాహం అయింది. ఆవిడ సంపన్న కుటుంబానికి చెందినదే అయినా ఆయన కోరిన కట్నం ఒక కొయ్యచరఖా, ఒక ఖద్దరుపంచె మాత్రమే. ఏమికోరినా ఇచ్చేందుకు సిద్ధంగా వున్నా, అంతకన్నా మరేమీ తీసుకోనని లాల్‌బహదూర్ పేచీ పడ్డారు కూడా!

లాల్‌బహదూర్‌గారి పెద్దకుమారుడు పదేళ్ళ వయసులో ఓసారి బాగా అల్లరిచేస్తే ఆయనకు విపరీతమైన కోపం వచ్చి బెత్తం తీసుకుని కొడుకు వెంట పడ్డారు. తండ్రి చేతికి చిక్కకుండా ఇంటి చుట్టూ తిప్పాడు కొడుకు. ఈలోగా ఆయన తన కోపానికి నవ్వుకొని "ఒరే అబ్బీ! కళ్ళు మూసుకున్నా, స్నానాలదొడ్లో దాక్కో" అని కొడుకుకి సలహా ఇచ్చారు. ఆ విధంగా ఆయనకు అరుదుగా కోపం వచ్చినా వెంటనే నిభాయించుకొనే వారు.

## బురఖాలో శాస్త్రిజీ

అలహాబాద్ పట్టణం నడిబొడ్డున ఒక గంట స్తంభం వుంది. 1930లో దానిపై కాంగ్రెస్ జండా ఎగరవెయ్యాలని పట్టణకాంగ్రెసు సంఘం తీర్మానించింది. ఇది తెల్సిన బ్రిటిషు పాలకులు ఆ ప్రయత్నాన్ని అడ్డుకొనేందుకు స్తంభంచుట్టూ పోలీసు బందోబస్తు పెట్టారు. దరిదాపులకు కాంగ్రెస్ వాలంటీర్లు రాకుండా కట్టడిచేశారు.

ఒకరోజున చుట్టూ పరదాలు కట్టిన ఓ గుర్రపుబండీ గంట స్తంభం ముందు ఆగింది. అందులోంచి బురఖా వేసుకున్న ఓ ఆకారం దిగి, చకచకా మెట్లెక్కి స్తంభంపైకి పోయింది. గంట స్తంభంపైకి విహారార్థం స్త్రీలు రావటం పరిపాటే. అందువల్ల కాపలా వున్న పోలీసులు ఎవరో స్త్రీ షికారు కోసం అలా ఎక్కింది కాబోలనుకున్నారు. అయితే బురఖాలో వున్నది. లాల్ బహదూర్ శాస్త్రి! కాంగ్రెస్ జండాను గంట స్తంభంపైన కట్టి, ముసుగు తీసిపారేసి ఖద్దరుపంచె లాల్చీతో తాపీగా దిగివస్తున్న ఆయనను చూసి పోలీసులు అవాక్కయిపోయారు. ఆ విధంగా అసాధ్యమనుకున్న సమయంలో తనకు తోచిన ఉపాయంతో పతాకావిష్కరణ చేసిన లాల్ బహదూర్‌కి 6 నెలలు జైలు శిక్ష పడింది.

## ఖాకీ టోపీలు

క్రికెట్ అంటే ఆయనకి ఎంతో అభిమానం! కేంద్రహోంమంత్రిగా వున్నప్పుడు ఆయన ఒకసారి కాన్పూర్‌లో జరుగుతున్న క్రికెట్ మ్యాచ్‌కు వెళ్ళారు. అక్కడ కొందరు విద్యార్థులు ఆడపిల్లల పట్ల అనుచితంగా ప్రవర్తించసాగారు. పోలీసుల జోక్యంతో వారు మరింత రెచ్చిపోయారు. లాల్ బహదూర్ వెంటనే రంగంలోకి దిగి పోలీసులని వెళ్ళిపొమ్మని చెప్పి, విద్యార్థులను మందలించి గొడవను సర్దారు. అయితే విద్యార్థులు మర్నాటి మ్యాచ్‌కు "ఎర్రటోపీలవారు" రాకూడదనే షరతు పెట్టారు. అందుకు ఆయన సమ్మతించారు.

మర్నాడు పోలీసులు ఎర్రటోపీలకు బదులు ఖాకీవి ధరించి యథా ప్రకారంగా వచ్చారు. విద్యార్థులు లాల్ బహదూర్‌తో ఫిర్యాదు చేస్తే "అవును! మీరు రావద్దన్నది ఎర్రటోపీలవారిని కదా? ఎర్రటోపీలు ఎక్కడా కనబడందే. వాళ్ళంతా ఖాకీ టోపీలవారుగదా?" అని చమత్కరిస్తే విద్యార్థులు మారుమాట్లాడలేకపోయారు.

## ఒక్కటే కూర

అరియలూర్‌లో ఘోరరైలు ప్రమాదం జరిగినప్పుడు రైల్వే మంత్రిగా వున్న లాల్‌బహదూర్ రాజీనామా చేశారు. ఆ మరుక్షణంనుంచి ప్రభుత్వకారు ఉపయోగించకుండా సిటీబస్సు ఎక్కి ఇంటికి చేరుకున్నారు. ఇంట్లో కూడా భార్యతో "ఈరోజునుంచి నాకు ఉద్యోగంలేదు కాబట్టి ఇక నుంచి ఒక్కటే కూరవండు" అన్నారు. ఆయనకు ఢిల్లీలో స్వంత ఇల్లు కూడా లేదు. ప్రభుత్వం ఇచ్చిన ఇల్లు వదిలిపెట్టి అద్దెఇంట్లోకి మారి పోయారు.

## నా రెక్కలే నాకాధారం

ఆ తర్వాత జైపూర్‌లో జరిగిన కాంగ్రెస్ సభకు చేతిలో పెట్టె, చంకన బెడ్డింగుతో హాజరైన లాల్‌బహదూర్‌ను చూసిన జవహర్‌లాల్ నెహ్రూ "ఇదేమి అవతారం" అని ప్రశ్నిస్తే "మంత్రినైతే ఈ లగేజి అంతా ప్రభుత్వం మోసేది. ఇప్పుడు నా రెక్కలే నాకాధారం" అని నవ్వుతూ అన్నారు.

లాల్‌బహదూర్ నికార్సయిన శాకాహారి. విదేశీ పర్యటనల్లో కూడా ఆయన మాంసాహారం తినేవారు కాదు. అక్కడి విందులలో మద్యానికి బదులు మంచినీటితో సరిపెట్టుకునేవారు. ఆయనకు ధూమపానం అసలు సరిపడదు. వేడివేడి టీ మాత్రం ఎక్కువగా తాగేవారు. శనగలు మహాఇష్టంగా తినేవారు.

లాల్‌బహదూర్‌ను ఇండియా పాకిస్తాన్ యుద్ధ సమయంలో అనేక పత్రికలు "ఉక్కుమనిషి"గా, సర్దార్‌పటేల్‌తో సమానుడుగా వర్ణించటం జరిగింది.

మొగల్‌సరాయ్‌లో 1904 అక్టోబరు 2న జన్మించిన లాల్‌బహదూర్ శాస్త్రి 62వ ఏట 1966 జనవరి 10న తాష్కెంటులో మరణించారు.

అత్యంత క్లిష్టపరిస్థితుల్లో ప్రధానిగా కొనసాగి రాష్ట్రాల మధ్య దేశాలమధ్య శాంతివారధులను నిర్మించిన శాస్త్రీజీ గొప్ప రాజకీయవేత్తే గాక అత్యంత శాంతికాముకుడు కూడా!

## నిజాయితీ పరుడైన పాలకుడేగాని...

కీర్తి శేషులు లాల్ బహదూర్ శాస్త్రిని ఇండియా పాకిస్తాన్ యుద్ధ సమయంలో అనేక పత్రికలు ఉక్కుమనిషిగా అభివర్ణించటం జరిగింది. ఆయన ధైర్యసాహసాల వలనే ఇండియా విజయం సాధించిందని కూడా వ్రాయటం జరిగింది. ఇంకా కొంత మందైతే శాస్త్రిజీని సర్దార్ పటేల్ తో కూడా పోల్చారు. కాని వాస్తవానికి ఇవన్నీ కట్టు కథలే!

శాస్త్రిజీ నిజాయితీ పరుడైన సమర్థుడైన పరిపాలకుడేగాని ధైర్య సాహసాలు మాత్రం తక్కువే. ఇందుకు ఉదాహరణ ఏమంటే—భారత పాకిస్తాన్ పోరాట సమయంలో ఢిల్లీ మీద బాంబు దాడి జరుగుతుందనే భయంతో ఆయన అధికార నివాసంలో నిద్రించే వారుకాదట! ఆయన, కుటుంబ సభ్యులతో పాటు చీకటి పడే సమయానికి రాష్ట్రపతి భవన్ కు వెళ్ళి అక్కడ ఒక భూగృహం వుండే అందులో మాత్రమే నిద్రించేవారట! రాష్ట్రపతి రాధాకృష్ణన్ మాత్రం మామూలుగానే తనగదిలోనే పడుకునే వారు.

భారత్ పాకిస్తాన్ పోరాటంలో భారత్ విజయానికి కారణం మన వీరజవాన్ల ధైర్యసాహసాలు దానికితోడు ఆనాటి సైన్యాధిపతులైన జనరల్ జె.యన్. చౌదరి, ఎయిర్ మార్షల్ అర్జున్ సింగ్ల వాక చాక్యం మాత్రమే కారణంగా చెప్పవచ్చును. 

ప్రధానిగా వచ్చేజీతం చాలని
ప్రథమ ప్రధాన మంత్రి

# పండిట్ జవహార్ లాల్ నెహ్రూ

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ రాజకీయ జీవితం అందరికీ తెలుసు. ఆయన వ్యక్తిగత జీవితంకూడా ఆసక్తికరమైనదే.



నెహ్రూ జీవితంలో ఓ 4, 5 సార్లు తప్ప మద్యం తీసుకోలేదు. ఒకసారి ఆయన ప్రపంచ ప్రఖ్యాత హాస్యనటుడు చార్లీచాప్లిన్ గౌరవార్థం స్విట్జర్లాండ్‌లో విందు ఏర్పాటు చేయగా అప్పుడు చాప్లిన్ ఎంతో బ్రతిమిలాడిన మీదట ఒకసారి మద్యం పుచ్చుకున్నారట. ఆయన భోజనాల బల్ల దగ్గర ఎటువంటి అతిథులు ఉన్నానరే మత్తు పానీయాలు నిషిద్ధం. ఇతర దేశాల ప్రధాన మంత్రులు వగైరా ఆయన ఇంట్లో బసచేసినప్పుడు వారికోసం

ప్రత్యేకంగా ఖరీదైన పానీయాలు తెప్పించి నేరుగా వారు బసచేసిన గదుల్లోకి పంపేవారు.

## పానీయం నిషిద్ధం - పాయసం ఇష్టం

1955 లో నెహ్రూ సోవియట్ యూనియన్‌లో పర్యటన చేసినప్పుడు అక్కడి ప్రభుత్వం ఏర్పాటు చేసిన విందులలో ఆయన మత్తు పానీయాలు తీసుకోకపోవడమేగాక తన వెంటనున్న వారెవ్వరూ తీసుకోవటానికి వీలులేదని శాసించారు. తమ సోవియట్ నాయకులకు ఇచ్చిన విందులో మాత్రం సోవియట్ నాయకులకు ప్రత్యేకంగా "వోడ్కా" ఏర్పాటుచేశారు. మన ప్రతినిధి వర్గంలో కొంతమంది తాగుడు అలవాటు గలవారున్నా నెహ్రూ సమక్షంలో వారు కిమ్మనకుండా కూర్చోవల్సి వచ్చింది.

నెహ్రూ మాంసాహారే అయినా పాశ్చాత్యుల్లా గొడ్డు మాంసం మాత్రం తీసుకునేవారుకాదు. పందిమాంసం మాత్రం ఎప్పుడన్నా తినేవారు. డెన్మార్క్ పందిమాంసానికి ప్రసిద్ధి. అచ్చట పందులకు పాలుపోసి పెంచుతారని తెలిసి ఒకసారి నెహ్రూ అచ్చటకు వెళ్ళినప్పుడు కావాలని ఆ పందిమాంసం తెప్పించుకుని తిన్నారు. నెహ్రూకు పాయసం అంటే బాగా ఇష్టం. దాదాపు ప్రతిరోజూ పాయసం తీసుకునేవారు.

నెహ్రూ సిగరెట్టు ఎక్కువగా కాల్చేవారు. ఎప్పుడూ స్టేట్ ఎక్స్‌ప్రెస్ 555 మాత్రమే వాడుతుండేవారు. 1948లో నెహ్రూ అమెరికా పర్యటనకు వెళ్తూ వెంట 555 సిగరెట్లుకూడా తీసుకువెళ్ళారు. అయినా అమెరికాలో తయారయ్యే "చెస్టర్ ఫీల్డు" సిగరెట్లు కాల్చాలని ముచ్చటపడి

వాటిని కాల్చేసరికి దగ్గుమొదలయింది దాంతో మళ్ళీ స్టేట్ ఎక్స్‌ప్రెస్ కాల్చటం ప్రారంభించారు.

## ప్రధానమంత్రి జీతం కుటుంబ ఖర్చులకు ఆస్తు చిస్తు

1946లో నెహ్రూ తాత్కాలిక ప్రభుత్వానికి ప్రధాన మంత్రి కావటంతో అప్పటికి ఆయన వద్దనున్న లక్షయాభై వేల రూపాయల ఆస్తిని ప్రభుత్వాధీనం చేశారు. తన స్వంతానికి కొద్దిమొత్తం మాత్రం బ్యాంకులో వుంచుకున్నారు. ఆయన వ్రాసిన పుస్తకాల మీద రాయల్టీ రూపేణా కొంత ఆదాయం వస్తూవుండేది. అందులో కొంత మొత్తాన్ని కుమార్తె ఇందిర పేర, మనుమలు ఇద్దరి పేర బ్యాంకులో వేస్తూవుండేవారు. మిగతా ఆదాయాన్ని భార్యపేరుమీద పెట్టిన కమలా నెహ్రూ హాస్పిటల్‌కువిరాళంగా ఇస్తూవుండేవారు. తను ఎప్పుడూ జేబులో 200 రూపాయలు వుంచుకునే వారు. ధనసహాయంకోసం ఎవరొచ్చినా అవి జేబులో నుంచి తీసి ఇస్తూ వుండేవారు. జేబులో పైకం అయిపోయినప్పుడు ప్రక్కనే వున్న సెక్యూరిటీ ఆఫీసర్లవద్ద నుంచి కూడా తీసుకుని ఇస్తూవుండేవారు. అయితే ఆయన స్వంత ఖర్చుల విషయంలో మాత్రం చాలా పొదుపుగా వుండేవారు. ఆరోజుల్లో నెహ్రూకు ప్రధానమంత్రిగా వచ్చే జీతం కుటుంబఖర్చులకు అంతంత మాత్రంగానే సరిపోయేదట. ఒకొక్కప్పుడు జీతం చాలక వచారుకొట్లో బాకీలు ఆయన పుస్తకాలమీదవచ్చే రాయల్టీపైకం నుంచి సర్ద వల్సి వచ్చేది.

గాంధీజీ చనిపోయిన తర్వాత నెహ్రూకు "పెద్దదిక్కు" అంటూ లేకుండా పోయింది. సర్దార్ పటేల్, రాజాజీ, గోపాలస్వామి అయ్యంగార్ నెహ్రూకన్నా వయస్సులో పెద్దవారని నెహ్రూవారి వద్ద సలహాలుపొందుతూ

వుండేవారు. విశేషం ఏమిటంటే తాను ప్రధాన మంత్రిగా వున్నా మిగతావారు తనక్రింద మంత్రులుగావున్నా ఏనాడూ నెహ్రూ వారిని తన ఇంటికి పిలిపించుకునేవారు కాదు. సలహాపొందాల్సి వచ్చినప్పుడు తనే వారి ళ్ళకి వెళ్ళివస్తూవుండేవారు.

అందుకు ఈ క్రింద ఉదంతమే నిదర్శనం. ప్రసిద్ధ దర్శక నిర్మాత, పత్రికా రచయిత కె. ఎ. అబ్బాస్ పాటలనేవి ఏమీలేకుండా "మున్నా" అనే చిత్రం తీశాడు. అందులో "రోమి" అనే 6 ఏళ్ళ కుర్రవాడు అద్భుతంగా నటించాడు. ఆ చిత్రాన్ని అబ్బాస్ రాష్ట్రపతిభవన్‌లో ప్రత్యేక ప్రదర్శన ఏర్పాటు చేసి రాష్ట్రపతి, ప్రధానమంత్రి మొదలైన ప్రముఖులకు చూపించాడు. ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ రోమి నటనపట్ల అమితంగా ముచ్చటపడి అబ్బాస్‌తో ఆ కుర్రవాణ్ణి రేపు ఉదయ ఫలహారానికి తనింటికి తీసుకురమ్మని చెప్పారు.

ఆ మర్నాడు అబ్బాస్, రోమిలు ప్రధానమంత్రి నివాసానికి బయలు దేరుతూవుండగా చిత్రంలో నటించిన మిగతా నటులు, టెక్నీషియన్లు డజను మందిపైగా మేముకూడా వస్తామంటూ పట్టుబట్టగా వారినికూడా వెంటతీసుకు వెళ్ళక తప్పలేదు.

పండిట్ నెహ్రూవీళ్ళందర్నీచూసి అప్పుడు ఇంటి విషయాలు చూస్తున్న శ్రీమతి ఇందిరాగాంధీని ఎడంగా కేకవేసి "అనుకున్న వాళ్ళ కంటే ఎక్కువమంది అతిధులు వచ్చారు. మరి వాళ్ళందరికీ సరిపడ ఫల హారం చేయటానికి తగిన సరుకులు వున్నాయా? లేవా?" అని ప్రశ్నించారు. ఇందిరాగాంధీ ఎలాగోలా సర్దవచ్చులెమ్మని చెప్పని వారందరికి ఫలహారాలు వడ్డించారట.

అల్పాహార విందు అయిపోయి పండిట్ నెహ్రూ వెళ్ళిపోయిన తర్వాత అబ్బాస్ శ్రీమతిగాంధీతో" నాన్నగారు ఫలహారాలకు సరుకులు

వున్నాయా లేవా? అంటున్నారు. ఆ మాట నిజమా లేక ఎగతాళిగా అంటున్నారా? "అని ప్రశ్నించగా" ఎగతాళికాదు. నిజంగానే అన్నారు. వాస్తవానికి ఆయన ప్రధానమంత్రిగా వచ్చే జీతం కుటుంబ ఖర్చులకే సరిపోదు. సంవత్సరాంతానికి సరుకుల కొట్టులో బాకీలు ఆయన పుస్తకాలమీద వచ్చే రాయల్టీతో నుంచే సర్దవల్సి వస్తోంది" అన్నారట శ్రీమతి ఇందిరా గాంధీ.

## నియంతను నిలదీసిన నెహ్రూ

ఒకసారి పండిట్ నెహ్రూ ఘనా అప్పటి ప్రధాని న్క్రూమాను లండన్‌లో కామన్‌వెల్త్ ప్రధానుల సమావేశం సందర్భంగా కల్సుకోవటం జరిగింది. పండిట్ నెహ్రూ న్క్రూమాను విందుకు అహ్వానించారు. ఆరోజుల్లో ఘనాలో న్క్రూమా తిరుగులేని నియంతగా చలామణీ అయ్యేవాడు. తాను ఘనా దేశానికి ఎంతో మహోపకారం చేశానని డాబులు చెప్పుకునేవాడు. తన బొమ్మతో పోస్టల్ స్టాంపులుకూడా వేయించుకున్నాడు. ఈ విధంగా చేయటం సహజంగా నెహ్రూకు ఇష్టంలేదు. తన మనస్సులోని మాట దాచుకోలేని పండిట్ నెహ్రూ న్క్రూమా తను బసచేసినచోటుకి విందుకు రాగానే కుశల ప్రశ్నలుకూడా వేయకముందే "పోస్టల్‌స్టాంపుల మీద నీబొమ్మ వేయించుకోవటం ఏమన్నా బాగుందా?" అంటూ సంభాషణ ప్రారంభించారు. పండిట్ నెహ్రూ అంటే ఎంతో గౌరవంతో వుండే న్క్రూమా కోపగించుకోక నెహ్రూను కౌగలించుకొని మనసారా నవ్వేశాడట నెహ్రూ కూడా దానికి శ్రుతికలిపారట.

## పండిట్‌జీ పరాచకం

మరికొద్ది గంటలలో భారతదేశానికి స్వాతంత్ర్యం రానున్నవేళ.... 1947 ఆగస్టు 14 సాయంకాలం... ఇండియాకు చేసిన సేవలకు ప్రతి

ఫలంగా లార్డ్ మౌంట్ బాటెన్ హోదాను 'వైకౌంట్' నుంచి ఎరల్'కు పెంచుతున్నట్లుగా బ్రిటీష్ చక్రవర్తి ఆరవ జార్జి వర్తమానం పంపారు. మౌంట్ బాటెన్ ఆ సంతోషంలో ఉండగా భారత రాజ్యాంగపరిషత్ అధ్యక్షుడు బాబూరాజేంద్ర ప్రసాద్, పండిట్ నెహ్రూతో కలిసి ఆయన సందర్శనానికి వచ్చారు.

మౌంట్ బాటెన్ వారిద్దరినీ సాదరంగా ఆహ్వానించారు. కుశలప్రశ్నాది కాలనంతరం రాజన్‌బాబు, భారత్ ప్రథమ గవర్నర్ జనరల్‌గా మౌంట్ బాటెన్‌ను ఉండవలసిందిగా అభ్యర్థించారు. ఆ అభ్యర్థనను బాటెన్ మరింత సంతోషంతో అంగీకరించారు. తమ అభ్యర్థనను ఆయన సులభంగా అంగీకరించడంతో రాజన్, జవహర్‌ల ఆనందానికి మేరలేకపోయింది.

తొలి మంత్రిమండలి జాబితా ఉంచిన కవరును నెహ్రూ, పరిశీలనార్థం బాటెన్‌కు అందించారు. ఇంతలో టీలు వచ్చాయి టీ తీసుకుంటూ ముగ్గురూ కబుర్లలో పడ్డారు. మరికొంచెం సేపటికి రాజేంద్రప్రసాద్, నెహ్రూలు బాటెన్‌వద్ద సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయారు.

నెహ్రూ ఇచ్చిన కవరు తీసుకొని తన గదికి వెళ్ళారు బాటెన్. అక్కడ ఆయన కవరు విప్పిచూపి పొట్టచెక్కలయ్యేలా నవ్వుకున్నారు. కారణం - అందులో మంత్రిమండలి పేర్లకుబదులు ఒట్టి తెల్లకాగితం ఉంది.

అసలు సంగతేమంటే — పండిట్ నెహ్రూ తొలి స్వాతంత్రదినోత్సవపు హడావిడిలోపడి ఆ కవరులో మంత్రిమండలి జాబితాకు బదులుగా ఓ తెల్లకాగితాన్ని మాత్రమే ఉంచారట. ఆ తర్వాత మౌంట్ బాటెన్ నెహ్రూ వద్దకు ఓ అధికారిని పంపి మంత్రి మండలి జాబితాను తెప్పించుకున్నారు. 

టికెట్టులేని రైలు ప్రయాణంలో
వాచీ తాకట్టు పెట్టిన

# జయప్రకాశ్ నారాయణ్

మహామానవతావాది, లోక్‌నాయక్ జయప్రకాశ్ నారాయణ్, ప్రభావతితో వివాహం అయిన తర్వాత కొద్దికాలానికే ఉన్నత విద్యకోసం



అమెరికా వెళ్ళారు. ఆయన అక్కడ ఒకవైపు చదువుతూనే, మరోవైపు చిన్నచిన్న ఉద్యోగాలు చేసి విద్యార్జనకు అవసరమైన డబ్బు సంపాదించేవారు. కొన్నాళ్ళు కాఫీ హోటల్లో కప్పులు కడిగారు, బాత్‌రూమ్‌లు శుభ్రం చేసేవారు. కొంత కాలం రోడ్లపై పడిన మంచు పారలతో ఎత్తి వేసేవారు.

జయప్రకాశ్ అమెరికా వెళ్ళగానే భార్య ప్రభావతి గాంధీజీ ఆశ్రమంలోచేరి ఆయనకు, కస్తూరిబాకు సేవలు చేస్తూ ఉండేవారు. అతితక్కువ కాలంలోనే ప్రభావతి గాంధీజీకి ఆప్తురాలై పెంపుడు కుమార్తెలా మెలగసాగింది.

## బ్రహ్మచర్యం

జయప్రకాశ్ అమెరికానుంచి సోషలిస్టు భావాలుగల వ్యక్తిగా తిరిగి వస్తే ప్రభావతి గాంధీజీ సాన్నిహిత్యంలో ఆశ్రమజీవితానికి అలవాటుపడి పోయారు. గాంధీజీ ప్రోద్బలంతో జయప్రకాశ్, ప్రభావతిలు ఆజన్మాంతం బ్రహ్మచర్యం అవలంబిస్తూ దేవసేవ చేయాలనే కఠోర నిర్ణయం తీసుకున్నారు. యవ్వనంలో ఉన్నవాంకి మొదట కొంత కష్టం అనిపించినా సంయమనం కోల్పోకుండా పరీక్షలో నెగ్గి దేశసేవకు పూర్తిగా అంకితమయ్యారు. మామూలు భార్యాభర్తలకు ఉండే సంబంధాన్ని మించిన మాటలకు అందని మమతానుబంధం, అనురాగబంధం వారిద్దర్నీ ఏకం చేసింది. జయప్రకాశ్ అమెరికాలో అత్యున్నత విద్యనభ్యసించిన వ్యక్తి కాగా ప్రభావతి చదువు అతి తక్కువ. అయినా వారిద్దరికి ఆ భేదమే కనబడేది కాదు. అలా అన్యోన్యంగా ఉండేవారు.

జయప్రకాశ్‌కు అంతరంగిక కార్యదర్శిగా, దాదిగా, సలహాదారుగా ప్రభావతి వివిధ బాధ్యతలను దీక్షాదక్షతలతో నిర్వహించారు. ఆయన భోజనం, విశ్రాంతి గురించి ప్రత్యేక శ్రద్ధ వహించే వారావిడ. ఆయన హాజరు కావాల్సిన కార్యక్రమాలను గుర్తు చేసేవారు ఆయన అతి మంచితనాన్ని ఇతరులు దుర్వినియోగపర్చుకోకుండా జాగ్రత్త పడేవారావిడ. ఆ విధంగా ప్రభావతి ఎల్లప్పుడూ జయప్రకాశ్ కూడా ప్రభావతి అభీష్టానుసారమే నడుచుకునేవారు. ఆయన ఎంతో మక్కువగా తినే మాంసాహారాన్ని ఆవిడ ఆజ్ఞ మేరకే విరమించి శాకాహారిగా మారారు.

## రైలు టిక్కెట్టులేని ప్రయాణం
## వాచీ తాకట్టు

1938లో జయప్రకాశ్ సోషలిస్టు ఉద్యమానికి సారథ్యం వహిస్తున్న రోజుల్లో ఆయన దగ్గిర ఏనాడూ తగినంత పైకం ఉండేదికాదు. జేబులో

పైకం ఉందో లేదో కూడా చూసుకోకుండా ప్రయాణాలు చేసేవారు. తరచుగా రైలు ప్రయాణాల్లో టిక్కెట్టు లేకుండా ప్రయాణించి పట్టుబడి రైల్వే ఉద్యోగికి చేతివాచీయో, పెన్నో హామీగా పెట్టేవారు. దిగాల్సిన స్టేషన్ రాగానే ప్లాట్‌ఫారంపై పరిచయస్తులు కనబడితే, వారినడిగి పైకం తీసుకుని వస్తువుని వదిలించుకోవడం జరిగేది.

ఒకసారి రైలులో పాట్నా వెళుతూ టిక్కెట్టు లేకుండా ప్రయాణం చేస్తున్నందుకు రైల్వే ఉద్యోగికి పట్టుబడిపోయారు. యథాప్రకారం వాచీ తాకట్టు పెడతానంటే అతను ఒప్పుకోక, జరిమానా చెల్లించేదాకా రైలు దిగటానికి వీలులేదని నిర్బంధించాడు. ఈలోగా పాట్నా స్టేషన్ వచ్చింది. జయప్రకాశ్‌కు స్వాగతం చెప్పటానికి సోషలిస్టు నాయకుడు గంగాశరణ్ సిన్హాతోపాటు ప్రభావతి అనేకవందల మంది ప్రజలు ప్లాట్‌ఫారంపై వేచి వున్నారు. వారిని చూడగానే జయప్రకాశ్ నవ్వుతూ "ముందు టిక్కెట్ పైకం, జరిమానా చెల్లించి నన్ను నిర్బంధంనుంచి విడిపించండి. తర్వాత తీరిగ్గా స్వాగతం చెబుదురు గాని" అన్నారుట.

## జయప్రకాశ్, నెహ్రూ

పండిట్ నెహ్రూ జయప్రకాశ్ ఆప్తమిత్రులు. జయప్రకాశ్ కాంగ్రెస్‌నుంచి విడిపోయినప్పుడు చాలా బాధపడ్డారు పండిట్ నెహ్రూ. కాంగ్రెసును విడిచిపోవద్దని ఎంతో బ్రతిమాలిడినా జయప్రకాశ్ వినలేదు. ఆ తర్వాత జయప్రకాశ్, నెహ్రూలమధ్య రాజకీయంగా ఎన్ని అభిప్రాయ భేదాలు ఉన్నా వ్యక్తిగతంగా ఎంతో ఆప్యాయంగా ఉండేవారు. జయప్రకాశ్ నెహ్రూకు ఎప్పుడు ఉత్తరం వ్రాసినా "ప్రియసోదరా" అని సంబోధించేవారు.

కాని ఒకసారి జయప్రకాశ్ ఏదో తొందరలో ఉత్తరం రాస్తూ "ప్రియమైన ప్రధానమంత్రీ" అని సంబోధించేసరికి నెహ్రూజీ ఎంతో బాధ

పట్టారు. వెంటనే జయప్రకాశ్‌కు సమాధానం రాస్తూ ఆ సంబోధన పట్ల చాలా బాధపడుతున్నట్లు, తాను దేశప్రజలకు ప్రధానమంత్రి కావచ్చునుగాని జయప్రకాశ్‌కు మాత్రం ఎల్లప్పుడూ ప్రియ సోదరునిగానే ఉంటానని వ్రాశారు. జయప్రకాశ్‌కూడా తన తొందరపాటుకు చింతిస్తున్నట్లు మళ్ళీ ఉత్తరం వ్రాశారు.

## లైసెన్సులేని డ్రైవర్ ఉదంతం

1951లో జయప్రకాశ్ బీహార్‌లో జీపులో పర్యటిస్తున్నారు ఆయనతోపాటు భార్య ప్రభావతి మరిద్దరు స్థానిక నాయకులు ఉన్నారు. అందులో ఒకరు ఉత్సాహం కొద్దీ డ్రైవర్‌ను వద్దని తానే జీపు నడపటం ప్రారంభించాడు. అయితే అతనికి డ్రైవింగ్ బాగారాదు. పైగా లైసెన్సుకూడా లేదు. జీపు అదుపుతప్పి ఒక రాయికి గుద్దుకుని బోల్తాపడింది. జయప్రకాశ్‌కు, ప్రభావతికి దెబ్బలు తగిలినాయి. జయప్రకాశ్ కొంతకాలం మంచంమీద ఉండవల్సి వచ్చింది.

లైసెన్సు లేకుండా జీపు నడిపినందుకు స్థానిక నాయకునిపై కేసు పెట్టాలని పోలీసులు జయప్రకాశ్‌వద్దకు వచ్చి సాక్ష్యం కోరితే - స్థానిక నాయకుడు లైసెన్సు లేకుండా జీపునడిపిన మాట నిజమే అయినా, అతనిపై కేసు పెట్టవద్దని పోలీసుల వద్దనుంచి మాట తీసుకున్నారు. ఆ విధంగా జయప్రకాశ్ సత్యవాదే కాక, దయార్ద్ర హృదయుడు కూడా!

## టెర్లిన్, ఖాదీ

జయప్రకాశ్ కార్యదర్శి అబ్రహాం మొదట టెర్లిన్ దుస్తులు ధరించేవాడు. ఇది నచ్చని సర్వోదయ నాయకులు టెర్లిన్‌దుస్తులు ధరించవద్దని ఆయన్ని కోరారు. అయినా అబ్రహాం "వస్త్రధారణ నా వ్యక్తిగత విషయం" అంటూ వారిని లెక్కచేయలేదు. వారు జయప్రకాశ్‌కు ఫిర్యాదు

చేయగా "ఇంకొకరి స్వంత విషయాల్లో జోక్యం కల్గించుకోవటం నా కిష్టం లేదు" అన్నారు. అది తెలిసి మర్నాటినుంచే అబ్రహాం స్వచ్ఛందంగా ఫెర్లిన్ బట్టలు వదిలేసి ఖద్దరు ధరించటం ప్రారంభించాడు.

1973లో జయప్రకాశ్, ప్రభావతి తమ మేనల్లుడి పెళ్ళికి వెళ్ళారు. అంతకు పూర్వమే కాన్సర్ రోగి అయిన ప్రభావతి హఠాత్తుగా వ్యాధి తీవ్రమై మరణించారు. ఆ రోజునే మేనల్లుడి పెళ్ళి జరగాల్సి ఉంది. అయితే పెళ్ళి ఆపకుండా ప్రభావతి చివరికోర్కె ప్రకారం యధావిధిగా ఆ రోజునే జరిపించారు. నూతనదంపతులు ఆమె భౌతిక కాయానికి వంగి నమస్కరిస్తూ ఉండగా జయప్రకాశ్ దుఃఖావేశంతో విలవిలలాడిపోయారు.

## కాక్ పిట్ లో ప్రయాణం

నేపాల్ మాజీప్రధాని బి.పి. కోయిరాలా జయప్రకాశ్ ఆప్తమిత్రులు 1979 అక్టోబరులో కోయిరాలా అకస్మాత్తుగా మరణించిన వార్త విన్న జయప్రకాశ్ బట్టలైనా మార్చుకోకుండా విమానాశ్రయానికి వెళ్ళారు. కాని విమానంలో సీట్లన్నీ నిండిపోయినాయి. అయినా వెనుతిరిగి రాకుండా ప్రత్యేక అనుమతితో విమానం కాక్ పిట్ లో కూర్చొనే ఖాట్మండూ వెళ్ళారు. ఆప్తమిత్రుని భౌతిక కాయం వంక తదేకంగా చూస్తూ మేమిద్దరమూ ఒకే సారి మరణించివుంటే బాగుండే"దని బొటబొటా కన్నీళ్ళు కార్చారు.

ప్రభావతి మరణించిన కొంతకాలానికి జయప్రకాశ్ ఆవిడ సామాను సర్దుతూ ఉండగా కమలానెహ్రూ ఆవిడకు రాసిన కొన్ని రహస్యఉత్తరాలు బయటపడినాయి. అప్పుడు జయప్రకాశ్, ఇందిరాగాంధీల మధ్య రాజకీయంగా చాలా వైరం ఉంది. అలాంటి పరిస్థితులలో కూడా ఆ ఉత్తరాలను బహిర్గతం చేయకుండా ఇందిరాగాంధీకి జాగ్రత్తగా పంపించి వేశారు.



కాలేజీ ప్రొఫెసర్ని కొట్టాడనినేరారోపణ చేయబడ్డ

# సుభాష్ చంద్రబోస్

సుభాష్ చంద్రబోస్ బి.ఎ చదివే రోజుల్లో జరిగిన సంగతి-



ఆయన క్లాసుకుర్రవాడు ఒకతను ప్రొఫెసర్‌గారు పాఠం చెబుతున్న రూంముందు నుంచి నిర్లక్ష్యంగా నడిచి వెళుతున్నాడనే నెపంపై ప్రొఫెసర్ ఆకుర్ర వానిని కొట్టటం జరిగింది. బోస్‌బాబు ఆక్లాస్‌కు లీడర్‌గా వుండేవాడు. విద్యార్థిని అన్యాయంగా కొట్టినందుకు మండిపోయిన బోస్‌బాబు విద్యార్థుల నందర్నీ పోగుచేసి ఆప్రొఫెసర్‌పై రిపోర్టు చేయటానికి వెళ్ళారు. కాని ప్రిన్సిపాల్ వద్ద నుండి వారికి సరైన సమాధానం రాక పోవటంతో సమ్మెచేశారు. సమ్మె

చేసిన విద్యార్థు లందరికీ జరిమానా విధించాడు ప్రిన్సిపాల్. విద్యార్థులు అందుకు వెదిరిపోక సమ్మె కొనసాగించారు. నాలుగు రోజుల తర్వాత ప్రొఫెసర్ విద్యార్థులతో రాజీపడటం జరిగింది.

తదుపరి కొన్నాళ్ళకు ఆప్రొఫెసర్ మరొక విద్యార్థిపట్ల అను చితంగా ప్రవర్తించగా విద్యార్థులు ఆప్రొఫెసర్‌ను కొట్టారు. ఆ సమయంలో బోస్‌బాబు అక్కడే వుండటం జరిగిందిగాని ఆయన మాత్రం ప్రొఫెసర్‌పై చేయి చేసుకోలేదు. అయినా ప్రిన్సిపాల్ బోస్‌బాబుని పిల్చి నీవలనే ఇదంతా జరిగింది. నిన్ను తక్షణం సస్పెండు చేస్తున్నాను అని హుకుం జారీచేశాడు. గవర్నమెంటుకూడా ఈ సంఘటన గురించి తెల్సుకొని కాలేజీలో శాంతి భద్రతలు ఏర్పడేవరకూ కాలేజిని మూసివేయవల్సిందిగా ఆజ్ఞాపించారు. ఆవిధంగా బోస్‌బాబుకు కొంత కాలం చదువుకు అంతరాయం కల్గింది,

## ఆజాద్ హింద్ ఫౌజ్

1942 ఫిబ్రవరిలో సింగపూర్ జపాన్ సైన్యాల వశం అయింది. అప్పట్లో సింగపూర్‌లో వున్న 20 వేల మంది భారతీయ సైనికులను జపాన్‌కు అప్పగించడం జరిగింది. జపాన్ ప్రభుత్వం వీరిని యుద్ధఖైదీలుగా భావించకుండా కెప్టెన్ మోహన్‌సింగ్ అనే భారతీయ సేనానికి అప్పగించడం జరిగింది. కెప్టెన్ మోహన్‌సింగ్ భారతీయ సైన్యాన్ని సమీకరించి భారత స్వాతంత్ర్యంకోసం పోరాడ గలనని ప్రకటించాడు. ఈ సైన్యమే అజాద్ హింద్ పౌజ్‌కు నాంది అయింది.

కొద్ది రోజుల తర్వాత ప్రముఖ విప్లవకారుడు రాష్ బిహారీ బోసు అధ్యక్షతన సమావేశమైన తూర్పు ఆసియా భారతీయ ప్రతినిధులు జర్మనీలో వున్న నేతాజీని ఆహ్వానించి భారత స్వాతంత్ర్య సమరానికి సారథ్యం

వహించవలసిందని కోరడం జరిగింది. కెప్టెన్ మోహన్‌సింగ్‌కూడా తన క్రిందవున్న సైన్యాన్ని నేతాజీ ఆధీనం చేయగలనని ప్రకటించారు.

నేతాజీ ఈ ఆహ్వానాన్ని అందుకుని ప్రాణాన్నికూడా లెక్కచేయకుండా 90 రోజులు జలాంతర్గామిలో ప్రయాణించి శత్రువు కంటబడకుండా సురక్షితంగా సింగపూర్ చేరుకున్నారు. నేతాజీ రాకతో తూర్పు ఆసియా భారతీయుల ఆనందానికి అవధులు లేకపోయినాయి. నేతాజీ సారథ్యంలో భారతదేశ స్వాతంత్ర్యం వారికి కనుచూపుమేరలో కానవచ్చింది.

1943 జూలై 4న రాష్ బిహారీ భారత స్వాతంత్ర్య పోరాట నాయకత్వాన్ని సుభాస్ బాబుకు అప్పగించారు. మరునాడు నేతాజీ ఖాకి యూనిఫారమ్‌లో ఆజాద్ హింద్‌ఫౌజ్ సర్వసైన్యాధ్యక్షుడుగా సైనిక వందనం స్వీకరించారు. అనాడే సుభాస్‌బాబు ఛలో ఢిల్లీ అనే నినాదం ఇచ్చారు.

## ఆజాద్ హింద్ బ్యాంకు

నేతాజీ మలయా, థాయ్‌లెండ్, బర్మా, ఇండో చైనాలు పర్యటించి భారతీయులను మేల్కొలిపి స్వాతంత్ర్య సమరానికి సిద్ధం చేశారు. నేతాజీ ప్రసంగాలతో వారందరు వెర్రి ఆవేశంతో వూగిపోయరు. ఆజాద్ హింద్ ఫౌజ్‌లో చేరడానికి వురుకులు పరుగులతో ముందుకువచ్చారు. కోరినంతనే లక్షలు కురిపించారు. తమ భవిష్యత్తుకూడా చూసుకోకుండా కొందరు తమ యావదాస్తిని నేతాజీకి కట్టబెట్టిన సంఘటనలు వున్నాయి.

## పూలమాల ఖరీదు కోటి

ఒకసారి నేతాజీకి సమర్పించిన పూల మాలను వేలం వేయగా ఒక పంజాబీ యువకుడు తన యావదాస్తి అయిన కోటి రూపాయలకు పాడాడట

నేతాజీ మొత్తం ప్రోగుచేసిన సొమ్ము 155 కోట్ల సొమ్ము. అంటే ఇప్పటి మారక రేటు ప్రకారం దాదాపు మూడువేల అయిదువందల కోట్ల రూపాయలు స్వచ్ఛందంగా ఇంతటి ధనాన్ని ఎంతటి మహాత్కార్యానికైనా ప్రోగుచేసిన వ్యక్తి చరిత్రలో మరెవరైనా కానవస్తారా? ఈ ధనం అంతా నేతాజీ ఏర్పరచిన ఆజాద్‌హింద్ బ్యాంకిలో వుండేది. ఈ డబ్బునంతా ఆజాద్‌హింద్‌ఫౌజ్, ఆజాద్ హింద్ తాత్కాలిక ప్రభుత్వాలకు ఖర్చు చేసేవారు నేతాజీ.

## ఆజాద్ హింద్ తాత్కాలిక ప్రభుత్వం

1943 అక్టోబరు 21న నేతాజీ సింగపూర్‌లో తాత్కాలిక స్వతంత్ర భారత ప్రభుత్వాన్ని ఏర్పరచారు. వెనువెంటనే తాత్కాలిక ప్రభుత్వం బ్రిటన్, అమెరికాలపై యుద్ధం ప్రకటించింది.

తాత్కాలిక ప్రభుత్వం ఏర్పరచిన కొద్ది రోజులకే దాన్ని చట్టబద్ధమైన భారత ప్రభుత్వంగా గుర్తించుతున్నట్టు జపాన్, జర్మనీ, ఇటలీ· బర్మా థాయ్‌లెండ్, నేషనల్ చైనా, ఫిలిప్పీన్సులు ప్రకటించాయి. ఆతరువాత కొద్ది రోజులకు నేతాజీ అఖిల తూర్పు ఆసియా సమావేశంలో పాల్గొనడానికి టోకియో వెళ్ళారు. అచ్చట జపాన్ చక్రవర్తి రాజ్యాధినేతకు ఇవ్వవలసిన సకల మర్యాదలతో నేతాజీని ఆహ్వానించారు·

## "షహీద్, స్వరాజ్"

1943 నవంబర్ 6న జపాన్ ప్రధాని టోజో తాము బ్రిటన్ నుంచి గెల్చుకున్న అండమాన్, నికోబార్ ద్వీపాలను నేతాజీ తాత్కాలిక ప్రభుత్వానికి అప్పగించుతున్నట్టు ప్రకటించాడు. టోకియోనుంచి తిరిగివచ్చిన నేతాజీ 1943 డిసెంబరు 31న అండమాన్, నికోబార్‌లలో పర్యటించారు. తాత్కాలిక ప్రభుత్వం అండమాన్, నికోబార్ ద్వీపాల పేర్లను షహీద్ (మృతవీరులు) స్వరాజ్ ద్వీపాలుగా మార్చడానికి నిశ్చయించింది.

## "ఛలో ఢిల్లీ"

బ్రిటిష్ ఇండియాపై బర్మా వైపునుంచి దెబ్బతీయవచ్చుననే తలంపుతో నేతాజీ తాత్కాలిక ప్రభుత్వ కార్యాలయాన్ని సింగపూర్ నుంచి రంగూన్‌కు మార్చారు. 1944 మార్చి 18వ ఆజాద్ హింద్‌ఫౌజ్ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడిన తేదీ. అదే రోజు జాతీయ సైన్యం బర్మా సరిహద్దు దాటి పవిత్ర భారత భూమిపై కాలు మోపింది. బర్మాసరిహద్దులో ఎనిమిది రంగాలలో పోరాటం ప్రారంభించింది. జాతీయ సైన్యం అశేష ధైర్య సాహసాలతో అజేయమైముందుకు సాగింది. బ్రిటిష్ సైనికులు పలాయనం చిత్తగించారు. ఇంఫాల్ పతనం సమీపించజొచ్చింది. దానితో గాబరా పడిపోయిన లార్డుమౌంట్ బాటెన్ ఇంఫాల్‌ను ఎట్టి పరిస్థితులలో నైనా రక్షించవలసిందని అదనపు సైన్యాన్ని పురికించాడు.

జాతీయ సైన్యం ఇంపాల్‌కు మూడు మైళ్ళలోకి వచ్చేసింది. ఇంఫాల్ పతనం కొద్ది గంటలలో మాట ! ఈలోపుగా బ్రిటిష్ అదనపు సైన్యాలు వచ్చేయి. వైమానిక దళాలుకూడా వచ్చాయి. జాతీయ సైన్యానికి వైమానికదళ సహాయం లోపించింది. విధివైపరీత్యంవల్ల జడివానలు కూడా అప్పుడే పడడంతో జాతీయ సైన్యానికి సరఫరా శ్రేణులు తెగిపోయినవి. గత్యంతరం లేక జాతీయ సైన్యం తిరోగమింపవలసి వచ్చింది.

## గడ్డురోజులు

ఈ లోగా ఐరోపా యుద్ధరంగంలోని బలాబలాలు తారుమారు కాజొచ్చినాయి. జర్మనీ ఆధిక్యత తగ్గిపోసాగింది. బ్రిటిష్‌వారిది పైచేయి కాజొచ్చింది. బర్మా, సింగపూర్‌లలో వుండడం నేతాజీకి, తాత్కాలిక ప్రభుత్వ సభ్యులకు క్షేమకరం కాదని తేలింది. అందుచేత 1945 ఏప్రిల్

24వ తేదీన నేతాజీ తన అనుచర బృందంతో రంగూన్‌నుంచి బ్యాంకాక్‌కు పయనమై పోయారు.

జర్మనీ లొంగిపోయిందనే వార్త వచ్చింది. ఆ తర్వాత కొద్ది రోజులకు జపాన్ కూడా లొంగిపోక తప్పలేదు. నేతాజీకి ఇది అత్యంత విషాదకరమైన సంఘటన. తాను వూహించిన ఆశయాలన్నీ కరిగిపోనారంభించాయి. జపాన్, జర్మనీల ఓటమితో నేతాజీసైన్యాలు ఒంటరిగాపోరాడడం అసంభవం; ఆత్మహత్యాసదృశం. వారిలో ధైర్య సాహసాలు కొరవడలేదు, దేశభక్తికి కొదవలేదు. కాని పరిస్థితులు వారికి అనుకూలించలేదు.

తాత్కాలిక ప్రభుత్వంద్వారా స్వతంత్ర భారతావనికి అధిపతి కావాలని నేతాజీ ఎన్నడూ కోరలేదు. ఆ వాంఛ ఆయనకు ఎన్నడూ కలుగలేదు. "స్వాతంత్ర్య సాధనకోసమే ఈ తాత్కాలిక ప్రభుత్వం" అని స్పష్టంగానే పేర్కొన్నారు. పైగా స్వతంత్ర భారత్‌ను మహాత్ముని పాద పద్మములకు సమర్పించి, రాజకీయ సుడిగుండం నుంచి సెలవు తీసుకోవాలని స్పష్టంగా ప్రకటించారు కూడా.

నేతాజీ తాత్కాలిక ప్రభుత్వం అజాద్ హింద్ ఫౌజ్ ఆశించినట్లు భారత్‌కు స్వాతంత్ర్యం సంపాదించలేక పోయివుండవచ్చు. అపజయాలు పొందివుండవచ్చు. అంతమాత్రంచేత నేతాజీ కృషిని తక్కువగా అంచనా వేయడం తప్పిదం కాగలదు. ఆనాటి ఆయన సేవలు భారతీయులకే ఒక వారవడి పెట్టినాయి. దాస్య శృంఖలాలలోపడి కొట్టుకుంటున్న భారతీయులను ముఖ్యంగా తూర్పు ఆసియా భారతీయులను మేల్కొలిపి, ఉత్తేజపరచి మాతృదేశం అంటే ఏమిటో తెలియజెప్పాయి. నాటి నేతాజీ దేశభక్తి పూరితమైన ప్రసంగాలను భారతీయులు ఎన్నటికీ మరచిపోలేరు. నేతాజీవంటి నిష్కళంక దేశభక్తుడు భారతీయుల మనస్సులలో కలకాలం నిలిచి వుంటాడు.



కొంటె కెక్కిన

# కృపలానీ!

కృపలానీ చదువుకునే రోజుల్లో చాలా దుందుడుకుగా అల్లరిగా కూడా వుండేవారు. తనతోటి విద్యార్థులను కూడగట్టి దండీలు, బస్కీలు, కుస్తీలలో పాల్గొనేవాడు. ఎవర్నీ లెక్క చేయకుండా ఛాతీ విరుచుకు తిరిగేవాడు. తన మాటకు ఎవరైనా ఎదురు చెబితే బడితెపూజ చేసేవాడు. కృపలానీ గిల్లికజ్జాలకు తండ్రి వారానికి ఒకసారైనా కృపలానీ దేహశుద్ధి చేసేవాడు. ఈ విధంగా అల్లరిపనులు చేసినా కృపలానీ చదువుల్లో ప్రథముడుగా వుండేవాడు. పాఠశాలలో ఉపాధ్యాయుడి చెప్పింది వినటం తప్ప ఇంటివద్ద చదివేవాడు కాదు. అయినా ఎప్పుడూ ఫస్టుమార్కులతో ప్యాసయ్యేవాడు.



## బస్తీమే సవాల్

1907 సంవత్సరంనాటి మాట. అప్పుడు కృపలానీ కరాచీలో బి.ఎ. చదువుతున్నాడు. ఒకరోజున ఏదో సభ జరుగుతుండగా ఇంగ్లీషువాడైన ఆ కాలేజి ప్రిన్సిపాల్ భారతీయుల్ని హేళనగా మాట్లాడటం సాగించాడు. సభలో కూర్చొన్న కృపలానీ తక్షణంలేచి ప్రిన్సిపాల్ ఈ విధంగా మాట్లాడి

నందుకు క్షమార్పణ చెప్పాలని లేకపోతే సమ్మె చేయించగలనని హెచ్చరించాడు. దాంతో ప్రిన్సిపాల్ దిగివచ్చి పొరపాటున నోరు జారినందుకు క్షమించవల్సిందని సభాముఖంగా ప్రకటించాడు.

అసలు కరాచీలో ఆ రోజుల్లో బ్రిటిష పాలకులు ఏ బహిరంగసభ పెట్టినా కృపలానీ విధిగా హాజరయ్యేవాడు. చంకలో కర్ర పెట్టుకుని తోటి విద్యార్థులు వెంటరాగా సభకు వచ్చేవాడు. ఎవరైనా భారతీయుల గురించి వెటకారంగా మాట్లాడితేచాలు కృపలానీ లేచి గొడవ చేయటం సభ చెల్లా చెదురుకావటం జరిగేది. ఆ రోజుల్లో కరాచీలో కృపలానీ అంటే బ్రిటిష్ వాళ్ళకు పెద్ద సవాల్‌గా వుండేది.

## కొబ్బరి చెట్టెక్కిన కృపలానీ !

గాంధీజీ ఒకసారి బీహార్‌లోని చంపారాన్ పర్యటనకు తలపెట్టి దారిలో ముజాఫర్‌పూర్‌లో ఆగుతానని అక్కడ తనను కలుసుకోవల్సిందిగా ఆచార్య కృపలానీకి టెలిగ్రాం ఇచ్చారు. అప్పుడు కృపలానీ ముజాఫర్‌పూర్‌లోని గవర్నమెంటు కాలేజిలో హిస్టరీ ప్రొఫెసర్‌గా పని చేస్తున్నారు. విద్యార్థులను వెంటబెట్టుకుని రైల్వేస్టేషన్‌లో గాంధీజీకి హారతిఇచ్చి కొబ్బరి కాయ కొట్టి స్వాగతం పలకాలని విద్యార్థులు ఉబలాట పడ్డారు. కృపలానీ అందుకు సరేనన్నారు. అయితే కొబ్బరికాయ తేవటం మాత్రం మర్చిపోయారు బజారుకువెళ్ళి తెచ్చే టైం లేదు. ఏం చేద్దామని విద్యార్థులు తర్జన భర్జనలు పడుతూ వుండగా ఆచార్య కృపలానీ చటుక్కున రైల్వే ప్లాట్‌ఫారం ప్రక్కన వున్న ఒక కొబ్బరి చెట్టుపైకి గబగబా ఎగబ్రాకి కొబ్బరికాయ తుంచుకు వచ్చారు.

## కృపలానీ బుజాలమీద నెహ్రూ

1940లో జరిగిన సంఘటన. ఆ సంవత్సరం అలహాబాద్‌లోని ఆనందభవన్‌లో చాలా ఉత్సాహంగా హోలీ పండుగ జరుపుకుంటున్నారు.

ఆనాటి వేడుకలలో అనేకమంది కాంగ్రేసు నాయకులు పాల్గొన్నారు. ఉత్సాహం కొద్దీ రంగునీళ్ళు ఒకరిమీద మరొకరు జల్లుకున్నారు. సాయంత్రం అందరూ కలిసి ఫొటో తీయించుకోవటానికి నిలబడ్డారు. పండిట్ నెహ్రూ చిలిపిగా ఆచార్య కృపలానీ భుజాలమీద ఎక్కి కూర్చొని ఫొటో తీయించుకున్నారు. ఫోటో తీయటం కాగానే కృపలానీ నవ్వుతూ "జవహర్ నువ్వేమీ బరువులేని చిన్న పిల్లాడివి కాదు. చాలు చాల్లే దిగవయ్యా" అంటూ పండిట్ నెహ్రూను కిందకు దించారట।

## "24 గంటలలోపున తేల్చుకోండి"

అవి 1946లో బ్రిటన్‌నుంచి వచ్చిన క్యాబినెట్ మిషన్ సిమ్లాలో కాంగ్రేసు, ముస్లింలీగ్ ప్రతినిధులతో భారతదేశ భవిష్యత్ గురించి సంప్రదింపులు జరుపుతున్న రోజులు. రెండు మాసాలుగా సాగుతున్న చర్చలు ముస్లింలీగ్ మొండివైఖరి కారణంగా ఒక అంగీకారానికి రావటం సాధ్యపడటంలేదు. క్యాబినెట్ మిషన్ ఇక ఇలా లాభంలేదని కాంగ్రేసు, ముస్లింలీగ్ నాయకులకు ఒక అల్టిమేటం ఇచ్చారు. 24 గంటల లోపల ఉభయులూ ఒక అంగీకారానికి రానియెడల తామొక పరిష్కార మార్గం సూచిస్తామని, దానికి ఉభయులూ కట్టుబడి వుండాలని దాంతో ఇరుపక్షాలలోను కలవరం ప్రారంభమైంది. కాంగ్రెసు తరపున నాయకత్వం వహిస్తున్న పండిట్ నెహ్రూకు ఆచార్య కృపలానీ, రాజేంద్రప్రసాద్, అజాద్ మొదలైన వారు సలహాదార్లుగా వుండేవారు. ముస్లిం లీగ్‌కు మహమ్మదాలీ జిన్నా నాయకత్వం వహిస్తున్నారు.

చివరి ప్రయత్నంగా పండిట్ నెహ్రూ కాంగ్రేసు తరపున తమ ప్రతిపాదనలను ఆ రోజు ఉదయం 11 గంటలలోపున జిన్నాకు పంపటానికి అదే రోజు మధ్యాహ్నం 2 గంటలకు పండిట్ నెహ్రూ జిన్నాలు కలుసుకొని సంప్రదింపులు జరిపి అల్టిమేటం కాలం ముగిసే ఆ రోజు సాయం

త్రం 4 గంటల లోపున ఒక నిర్ణయానికి రావటానికి అంగీకరించారు. కాంగ్రేసు నాయకులు తమలో తాము చర్చించుకొని తమ ప్రతిపాదనలను తయారుచేసి టైపు చేయించేటప్పటికి 10-30 అయింది. టైపు చేసిన ఆ కాగితాలను మరో అర్ధగంటలో జిన్నాకు చేర్చాల్సివుంది. కాంగ్రెసు నాయకుల బసకు జిన్నా వుండే ఇంటికి 5 మైళ్ళ దూరం వుంది. పైగా ఆ రోజుల్లో సిమ్లాలో వైస్రాయ్‌కి, గాంధీజీకితప్ప మిగతా వారెవ్వరికీ కార్లు ఉపయోగించే అధికారంలేదు. మిగతావారు గుర్రాలమీదనో నడిచో ప్రయాణం చేయాల్సిందే.

## గుర్రమెక్కిన కృపలానీ

టైం చూసుకున్న పండిట్ నెహ్రూ హడావుడిగా కాంగ్రెసు నాయకులకు సహాయకుడుగా పని చేస్తున్న దీనానాధ్ అనే వ్యక్తికోసం కేకలు పెట్టారు. ఆ కాగితాలు అతడిద్వారా పంపటానికి. ఆ సమయానికి అతడు సరుకుల కోసం బజారు కెళ్ళాడు. పండిట్జీ కోపం తారాస్థాయి నందుకుంది. అర్ధగంటలో ఆ కాగితాలు జిన్నాకు పంపటం ఎలాగో తోచక పండిట్ నెహ్రూ నానా హడావుడి చేస్తూ వుండగా ఆచార్య కృపలానీ శాంతంగా "కంగారు పడాల్సిన పనిలేదు. దీనానాథ్ ఉపయోగించే గుర్రం ఇక్కడనే వుంది. నేను ఆ గుర్రం మీద వెళ్ళి జిన్నాకు కాగితాలను అందజేస్తాను." అనేటప్పటికి ఆశ్చర్యంగా కాంగ్రెసు నాయకులందరూ వింతగా ఆయన వంక చూశారు. ఎందుకంటే ఆచార్య కృపలానీకి ఏ నాడు గుర్రం ఎక్కే అలవాటు లేదు. ఆ గుర్రం ఆయన్ని ఎక్కడ పడేస్తుందోనని అందరూ కంగారుపడుతూ వుండగా, ఎప్పుడూ పంచెకట్టు అలవాటున్న కృపలానీ, గుర్రపు స్వారీలో పంచె ఎటుదటూ పోతుందనే ఉద్దేశ్యంతో పంచె విప్పేసి, దీనానాథ్ ఉపయోగించే పైజామా ఒకటి తొడుక్కుని గుర్రాన్ని అధిరోహించారు. జిన్నాకు అనుకున్న టైం లోపల కాగితాలు అందజేసి క్షేమంగా తిరిగి వచ్చారు ఆచార్య కృపలానీ.



గ్రంథచౌర్యం చేసిన ప్రధాని

# సర్ విన్‌స్టన్ చర్చిల్

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో బ్రిటీషు ప్రధానిగా పని చేసిన సర్ విన్‌స్టన్ చర్చిల్ ప్రసిద్ధ రాజనీతిజ్ఞుడు, పరిపాలనాదక్షుడు, ప్రసిద్ధ రచయిత కూడా. 1951లో ఆయనకు సాహిత్యంలో నోబెల్ బహుమతి లభించింది. సందర్భోచితంగా ఖచ్చితమైన మాటలు వాడటంలో ఆయనకు గొప్ప పేరుండేది. కొత్త కొత్త మాటలు వాడటంలో కూడా చర్చిల్ పేరు పొందాడు. కాని ఆ విషయంలో ఆయన గ్రంథ చౌర్యానికి పాల్పడ్డాడని కొందరు అంటారు,



## గ్రంథ చౌర్యం

ఉదాహరణకు రష్యాను ఉద్దేశించి "ఐరన్ కర్టెన్" అనే మాటను ఆయన వాడాడు. ఆ మాటను ఆయనే సృష్టించాడని అందరూ అనుకొంటారు. కాని ఆ మాట ఆయన రూపొందించింది కాదు. "ఐరన్ కర్టెన్" అనే మాటను ప్రథమంగా 1920లో ఎతెల్‌స్నోడెన్ అనే రచయిత "త్రూ బోల్షివిక్ రష్యా" అనే పుస్తకంలో వాడాడు. అలాగే 1940లో చర్చిల్ ప్రధాని అయినప్పుడు బ్రిటీషు పార్లమెంటులో ఆయన చేసిన తొలి

ప్రసంగంలో గొప్పగా వాడిన పదజాలం— "బ్లడ్, టాయిల్, స్వెట్ అండ్ టియర్స్" అవి ఆయన సొంతంకావు. బైరన్ కవి పద్యసంపుటి "ది ఏజ్ ఆఫ్ బ్రాంజ్"నుంచి తస్కరించబడినవి మాత్రమే।

## కరుడు గట్టిన మితవాది

చర్చిల్ కరుడుగట్టిన మితవాది. స్త్రీలు రాజకీయాలలో పాల్గొనటం నిరసించేవాడు. బ్రిటీషు కామన్స్‌సభలో ప్రప్రధమంగా అడుగిడిన ఒకే ఒక స్త్రీ యాస్టర్ గురించి చర్చిల్ తన సన్నిహితులతో ఈవిడ నా బాత్ రూంలోకి దూసుకువచ్చింది కదా? అనేవాడు వ్యంగ్యంగా. భారతదేశానికి స్వతంత్రం రాకముందు చర్చిల్‌కు పండిట్ నెహ్రూ పట్ల చాలా చులకన భావం వుండేది.

## డల్ బాస్టర్డ్

1947 మార్చిలో బ్రిటీషు పార్లమెంటులో మాట్లాడుతూ "నెహ్రూ నాయకత్వంలో భారతప్రభుత్వం పూర్తిగా విఫలమైపోతుంది. భారత దేశాన్ని పరిపాలించటానికి నెహ్రూ పూర్తిగా అనర్హుడు"అని ప్రసంగించాడు చర్చిల్. కాని కొన్ని సంవత్సరాల్లో ఆ అభిప్రాయం మార్చుకొన్నాడు. ఒకానొక బ్రిటీషు ప్రముఖుడు నెహ్రూ గురించి హేళనగా మాట్లాడుతూ వుండగా చర్చిల్ అతన్ని మందలించి "నెహ్రూను మనం తక్కువగా అంచనావేశాం. ఆయన భయాన్ని ద్వేషాన్ని జయించిన గొప్ప వ్యక్తి ఆసియా ఖండానికే ఆశాజ్యోతి కాగల మహనీయుడు" అని పొగిడాడు. ఆ తర్వాత చర్చిల్, నెహ్రూ మంచిమిత్రులు అయ్యారు. వారిద్దరి ఉమ్మడిశత్రువు ఆనాటి అమెరికా విదేశాంగమంత్రి జాన్ ఫాస్టర్ డల్లెస్. వాళ్ళిద్దరూ ఏకాంతంగా మాట్లాడుకొనేటప్పుడు నెహ్రూ డల్లెస్‌ను 'మొద్దు డల్లెస్' (డల్ డల్లెస్)అంటే చర్చిల్ మరీముతకగా "మొద్దులం... కొడుకు" (డల్ బాస్టర్డ్) అని తిట్టేవాడు.



ఒకటో తరగతికి పాఠాలు చెప్పిన
విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు

# డాక్టర్ జాకిర్ హుస్సేన్

గాంధీజీ ప్రభావానికి లోనైన వారందరు రాజకీయ నాయకులైతే శ్రీ జాకిర్ హుస్సేన్ మాత్రం విద్యావేత్తగానే నిల్చిపోయారు, రాష్ట్రపతిగా ఎన్నుకోబడిన సందర్భంలో ప్రసంగిస్తూ డాక్టర్ జాకిర్ హుస్సేన్ తనను ఉపాధ్యాయునిగానే వర్ణించుకున్నారు అది అధ్యాపకునికి జరిగిన సన్మానంగానే చెప్పుకున్నారు.



**1920** లో గాంధీజీ పిలుపుపై శ్రీ జాకిర్ హుస్సేన్ అలీఘర్ విశ్వవిద్యాలయం వదలివచ్చివేశారు. ప్రత్యక్షంగా మిగతా నాయకులవలె రాజకీయపోరాటం జరుపకపోయినా బ్రిటిష్‌వారితో సహాయ నిరాకరణకు సూచనగా అలీఘర్ విడిచివచ్చి జామియా మిలియా స్థాపకులలో ఒకరై

విద్యారంగములో గాంధీజీ ఆలోచనలను ఆచరణలో పెట్టిన ప్రముఖ విద్యావేత్త శ్రీ జాకిర్ హుస్సేన్. సంపన్న కుటుంబంలో జన్మించినా సామాన్య జీవితాన్నే గడిపిన అసాధారణ వ్యక్తి శ్రీ జాకిర్ హుస్సేన్.

అవి హిందూ-ముస్లింల మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమనే రోజులు, దేశమంతటా మత విద్వేషాలు ముమ్మరంగా అలుముకున్న సమయం. ఎక్కడ చూచినా మతకలహాలే. ఆ సమయంలో డాక్టర్ జాకిర్‌హుస్సేన్ పెంచి పోషించిన జామియామిలియా రజతోత్సవాలు జరిగినవి. ఆ సందర్భంలో డాక్టర్ జాకిర్ హుస్సేన్ కాంగ్రెసు, ముస్లింలీగ్ నాయకులను ఒకే వేదికపై కూర్చుండబెట్టగలగడం అపూర్వమైన విశేషం.

కాంగ్రెసు నాయకులైన జవహర్‌లాల్ నెహ్రూ, రాజగోపాలాచారి అబుల్‌కలాం ఆజాద్; ముస్లింలీగ్ నాయకులైన జిన్నా, లియాఖత్ ఆలీఖాన్ మొదలైన వారు ఆనాటి రజతోత్సవాలకు వచ్చి జామియామిలియాకు తమ శుభాకాంక్షలు తెలియజేశారు. ఆ సందర్భంలో కాంగ్రెసు-ముస్లింలీగ్ నాయకులను ఉద్దేశించి ప్రసంగిస్తూ డాక్టర్ జాకిర్ హుస్సేన్ ఇలా అన్నారు.

"ఉదాత్తమైన భారతావనిలో అగ్నిజ్వాలలు లేచినాయి. ఈ అనాగరిక ప్రపంచం నుంచి మానవజాతిని మీరెలా రక్షిస్తారు? ఓ రాజకీయ దురంధరులారా! దేవునికోసమైనా ఒకరాక రాజీ ధోరణికి రండి. ఒకచోట సమావేశంకండి. ఈ విద్వేషాన్ని చల్లార్చండి. దీనికంతటికీ ఎవరు కారణం? అని ప్రశ్నించే సమయంకాదు. విద్వేషాగ్ని పెచ్చు పెరిగిపోతోంది. దయచేసి దాన్ని ఆర్పివేయండి భగవంతునికోసమైనా. ఈ

దేశంలో నాగరిక జీవితమే పునాదులతో ధ్వంసమయ్యే ప్రమాదం నివారించండి".

దీన్నిబట్టే మనం అర్థం చేసుకోవచ్చు. ఆనాడు జాకిర్ హుస్సేన్ హిందూ–ముస్లిం విద్వేషాగ్నివల్ల ఎంత తల్లడిల్లిపోయారో? ఆయన హృదయం ఎంత క్షోభించిపోయిందో? ఆనాటి ఆయన మాటలు ఎన్నిటికీ మరుపురానివి. రాజకీయవేత్తలమనుకునేవారు ఎల్లవేళలా గుర్తుంచుకో వలసినమాటలు.

## జామియామిలియా

జామియామిలియా ఇస్లామియా (జాతీయ ముస్లిం విశ్వవిద్యాలయం) చరిత్రే జాకిర్ హుస్సేన్ చరిత్ర, తనశక్తిసామర్థ్యాల నన్నింటిని ఆ విశ్వ విద్యాలయం అభివృద్ధికే వెచ్చించారు. గాంధీజీ ఆశీస్సులతో 1920 లో ప్రారంభించబడిన ఈ విశ్వవిద్యాలయం ముస్లింవిద్యార్థులను బాధ్యతాయుత భారతీయ పౌరులుగా తయారుచేయడానికి, ఇస్లామిక్ ఆలోచనాధోరణిని భారతీయ సంస్కృతితో సమన్వయపరచడానికి ఏర్పరచబడింది.

ఒకానొక ప్రసిద్ధ చరిత్రకారుడు "ఈ జామియామిలియా మరే ఇతర ఇస్లామిక్ సంస్థకన్నా గాంధీజీ ఉద్యమానికి సన్నిహితంగావున్నద"ని వ్రాశాడు. కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీనివాస అయ్యంగార్ ఈ విశ్వ విద్యాలయం గురించి ప్రస్తావిస్తూ, "మిగతా జాతీయసంస్థలన్నీ జీవరహి తంగా వుండగా, ఈ జామియా నవజీవనంతో తొణికిసలాడుతున్న" దని అన్నారు.

దాదాపు 25 సంవత్సరాలు డాక్టర్ జాకిర్ హుస్సేన్ జామియా మిలియాకు ఉపాధ్యక్షులుగా వ్యవహరించారు. ఒక్క ఉపాధ్యక్షులన్న

మా చేమిటి? జామియామిలియా తన సర్వస్వంగా భావించారు. జామియా పదికాలాలపాటు వర్ధిల్ల గలిగిందంటే అందుకు కారణం డాక్టర్ జాకిర్ హుస్సేన్ పట్టుదల, ఓర్పు మాత్రమే కారణంగా చెప్పవలసి ఉంటుంది. లేకపోతే ఏనాడో మూతపడివుండేది.

డాక్టర్ జాకిర్‌హుస్సేన్ తనసన్నిహితులయిన కొద్దిమంది సహచరులతో జామియామిలియా కోసం అహోరాత్రాలు కష్టించారు. తనసర్వస్వాన్ని దానికే ఖర్చుచేశారు. ఒకసారి జామియామిలియా ఇచ్చేకొద్దిపాటి జీతానికి ఏ ఉపాధ్యాయుడు దొరకక్కపోతే జాకిర్‌హుస్సేన్ స్వయంగా ఒకటవ తరగతి పాఠాలు బోధించడం ప్రారంభించారు. అధ్యాపకుడుగా, ఉపాధ్యాయుడుగా ఆయన తీసుకున్న జీతం 95 రూపాయలు మాత్రమే. ప్రఖ్యాత బ్రిటిష్ ప్రొఫెసర్ డబ్ల్యు. సి. స్మిత్ జామియాను అత్యుత్తమ విశ్వ విద్యాలయంగాను దాని ఉపాధ్యాయులు శ్రీజాకిర్ హుస్సేన్‌ను ప్రథమ శ్రేణి విద్యావేత్తగాను అభివర్ణించారు.

## కేంద్రమంత్రిపదవికి నిరాకృతి

1946లో తాత్కాలిక ప్రభుత్వం ఏర్పరచే సమయంలో కాంగ్రెసు పార్టీ శ్రీహుస్సేన్‌ను మంత్రిమండలి సభ్యునిగా చేర్చింది. కాని, ఈ వార్త డాక్టర్ జాకిర్‌హుస్సేన్‌కు తెలియడంతోనే జవహర్‌లాల్‌కు ఒక లేఖ వ్రాస్తూ, తన పేరు ఏకగ్రీవంగా ఆమోదిస్తేనేతప్ప తాను ప్రభుత్వంలో చేరడానికి ఇష్టపడనని వ్రాశారు. విద్యావేత్తగా తాను పాక్షిక రాజకీయాలకు అతీతంగా వుండాలని ఆయన అభిప్రాయం.

దేశ విభజన తర్వాత అప్పటి విద్యామంత్రి అబుల్‌కలాం అజాద్ అలీఘర్ యూనివర్శిటీ వైస్ ఛాన్స్‌లర్‌గా వెళ్ళవలసిందని శ్రీ జాకిర్

హుస్సేన్‌ను పలుమార్లు కోరారు. కాని. మతోన్మాదుల ఛాయల క్రింద పనిచేస్తున్న ఆ విశ్వవిద్యాలయానికి వెళ్ళడానికి జాతీయవాదియైన జాకిర్ హుస్సేన్‌కు సుతరాము ఇష్టంలేదు. కాని ఎట్టకేలకు జవహర్‌లాల్ నెహూ్రి పట్టుదలపై అక్కడికి వెళ్ళక తప్పలేదు.

అలీఘర్ విశ్వవిద్యాలయం ఎప్పుడూ పాక్షిక రాజకీయాలకు, చిల్లర తగాదాలకు ప్రసిద్ధి పొందినది డాక్టర్ జాకిర్ హుస్సేన్ వైస్ ఛాన్సలర్‌గా వెళ్ళేనాటికి ఉపాధ్యాయులలో రెండు ముఠా లుండేవి. ఒక వర్గంవారు రెండవ వర్గం వారిని కమ్యూనిస్టులుగా వర్ణించేవారు. రెండవ వర్గంవారు మొదటి వర్గంవారిని ముస్లింలీగ్ సానుభూతి పరులుగా చిత్రించేవారు. శ్రీ జాకిర్ హుస్సేన్ అక్కడికి వెళ్ళగానే కమ్యూనిస్టులన బడేవారు ముస్లింలీగ్ సానుభూతి పరులను తొలగించవలసిందని, ముస్లింలీగ్ సానుభూతిపరులు అనబడేవారు కమ్యూనిస్టులను బర్తరఫ్ చేయవలసిందని రెండుమహాజర్లు సమర్పించారు. డాక్టర్ జాకిర్ హుస్సేన్ వ్యాఖ్యానించినట్లు ఆ రెండు వర్గాల "మొర" ఆలకించి నట్టయితే ఇక ఆ విశ్వవిద్యాలయంలో ఉపాధ్యాయుడనేవాడు వుండేవాడు కాడు.

ఇదీ ఆనాటి అలీఘర్ విశ్వవిద్యాలయం పరిస్థితి. ఇట్టి స్థితిలో శ్రీ జాకిర్ హుస్సేన్ ఇరువర్గాలకు అతీతంగావుంటూ తొమ్మిది సంవత్సరాలు ఆ విశ్వవిద్యాలయం ఉపాధ్యక్ష పదవిని అతి చాకచక్యంతో నిర్వహించారు. ఆ తొమ్మిది సంవత్సరాలలో అలీఘర్ విశ్వవిద్యాలయం అంటే దేశ ప్రజలకు ఒక విధమైన గౌరవభావం ఏర్పడింది. విశ్వవిద్యాలయం అనేక విధాల అభివృద్ధి చెందింది. కాని, మతోన్మాదులు ఒకపట్టాన జాకిర్ హుస్సేన్‌ను వదలి పెట్టలేదు, వారుచేసే కుతంత్రాలు చేస్తూనే వున్నారు. దానితో డాక్టర్ జాకిర్ హుస్సేన్ విసిగిపోయి రాజీనామా చేశారు.

## బేసిక్ విద్యాప్రణాళిక

గాంధీజీ ఆశించిన బేసిక్ విద్యాప్రణాళికను తయారుచేయడానికి గాంధీజీ స్వయంగా డాక్టర్ జాకిర్‌హుస్సేన్‌ను నియమించడంబట్టి శ్రీ జాకిర్ హుస్సేన్ పట్ల గాంధీజీకి ఎంతటి ఉన్నతాభిప్రాయం వుండేదో తెలుసుకోవచ్చు. ఈ ప్రణాళికను ఒక్క మాసం రోజులలో తయారుచేసి ఇమ్మని గాంధీజీ కోరారు. ఆ విధంగానే గాంధీజీ ఆదేశం మేరకు సరిగ్గానెలరోజులు నిర్విరామంగా కృషిచేసి కేవలం నాలుగు వందల రూపాయల ఖర్చుతో ప్రణాళికనుతయారుచేసి గాంధీజీకి సమర్పించారు. ఈ ప్రణాళిక గాంధీజీ మన్ననలను విశేషంగా పొందింది.

## రచయిత

జర్మనీలో చదువుతున్న రోజులలో స్కాండినేవియా దేశాలు చూచిరావడానికి అయనబయలుదేరారు. కాని, మార్గమధ్యంలో తీసుకువెళ్ళిన డబ్బు అయిపోయింది. అప్పుడు డాక్టర్ జాకిర్‌హుస్సేన్ గాంధీజీని గురించి ఒక వ్యాసం వ్రాసి స్వీడిష్ పత్రికకు పంపి ఆ వచ్చిన పారితోషికముతో మిగతా ప్రయాణం కొనసాగించారు.

డాక్టర్ జాకిర్‌హుస్సేన్ ప్లేటో రిపబ్లిక్‌ను ఉర్దూలోకి తర్జుమాచేసారు. గాంధీజీ గురించి జర్మన్ స్నేహితునితో కలిసి గ్రంథం వ్రాసారు. చిన్నపిల్లలకు పనికివచ్చే చిన్న చిన్న కథలు వ్రాయడానికి ఆయన ఇష్టపడతారు. బాలసాహిత్యమే కలకాలం నిలిచే సాహిత్యమని ఆయన అంటూవుంటారు. జామియాలో ఉపాధ్యాయుడుగా ఉండేటప్పుడు చిన్నపిల్లలకోసం "రెహానా" అనే కలం పేరుతో కథలు వ్రాస్తూ వుండేవారు. "రెహానా" అనే పేరుగల ఆయన కుమార్తె చిన్నప్పుడే చనిపోయింది. ఆ కథలన్నీ గ్రంథరూపంలో వెలువడినాయి.



కొరాన్ చదవని ముస్లింనాయకుడు

# మహమ్మదాలీ జిన్నా

ముస్లింలకు ప్రత్యేక దేశం ఏర్పర్చి, పాకిస్థాన్ నిర్మాతగా పేరు పొందిన మహమ్మదాలీ జిన్నా ముస్లింల పవిత్ర గ్రంథమైన కొరాన్ చదవనే లేదట! జిన్నాకన్నా గాంధీజీకే కొరాన్ గురించి బాగా తెలుసు. జిన్నాకు ఉర్దూ భాషకూడా అంతంత మాత్రంగానే వచ్చును. తమ మత నియమాలకు విరుద్ధంగా జిన్నా పంది మాంసం తినటమే గాక మత నియమాల్ని పాటించకుండా ప్రతిరోజు గడ్డం గీసుకునే వారు. కనీసం ముస్లింల పవిత్ర దినమైన శుక్రవారం నాడు కూడా మసీదుకు వెళ్ళేవారు కాదు.



## ఆడంబరం-అట్టహాసం

జిన్నా అట్టహాసంగా, ఆడంబరంగా జీవించేవారు. ముస్లింపాల కులున్న రాష్ట్రాలకు ఏనుగులు, గుర్రాలు, మందీమార్బలంతో ఊరేగింపుగా వెళ్ళేవారు. సామాన్య ప్రజలను చీదరించుకునేవారు జిన్నా రోజూ 4,5 సార్లు దుస్తులు మార్చుకునే వారు. ఖరీదైన లినిన్ సూట్లు ధరించేవారు. మాంసాహారం ముఖ్యంగా చేపలు ఎక్కువగా తింటూ ఎప్పుడూ ఖరీదైన మద్యం తాగేవారు.

అయితే మహమ్మద్ ఆలీ జిన్నా ఆర్థిక విషయాల్లో చాలా నిక్కచ్చిగా వుండేవారు. డబ్బు విషయంలో చాలా నిజాయితీగా ప్రవర్తించే వారని ప్రతీతి. జిన్నా నివాస గృహం ఎంతో పరిశుభ్రంగా అందంగా ఉండేది. పూలమొక్కల దగ్గర నుంచి గృహాలంకరణకు సంబంధించిన అన్నింటిలోనూ ఎంతో శ్రద్ధ తీసుకుని ఇంటిని ఎంతో అందంగా వుంచుకునేవారు.

గాంధీజీ జిన్నాను ఎంతో ఆప్యాయంగా సోదర భావంతో చూడగా, జిన్నా అందుకు విరుద్ధంగా గాంధీజీని చులకనగా చూసేవారు. గాంధీజీ జిన్నాకు వ్రాసే ఉత్తరాలలో "సోదరుడు జిన్నాకు" అని సంబోధించి వ్రాస్తే జిన్నా మాత్రం నిర్లక్ష్యధోరణితో "మిస్టర్ గాంధీ" అంటూ జవాబులు రాసేవారు.

## రెండుముళ్ళ మధ్య ఒక గులాబీ

అది మహమ్మదాలీ జిన్నా మొదటిసారిగా వైస్రాయ్ మవుంట్ బాటెన్‌ను కలుసుకున్న సమయం ఇద్దరూ కొంతసేపు మాట్లాడుకున్న తర్వాత కాఫీ ఫలహారాలు తీసుకున్నారు. వైస్రాయ్ భవనం నుంచి బయటకు వస్తున్న జిన్నాను మవుంట్‌బాటెన్ దంపతులతో ఫోటో తీయటానికి ప్రెస్ ఫోటోగ్రాఫర్లు చుట్టుముట్టారు తనను బాటెన్‌దంపతుల మధ్యలో నిలబడివుండగా ఫోటో తీస్తారని జిన్నా ఊహ. మవుంట్‌బాటెన్ భార్యను పొగిడి ఆవిడ అభిమానం సంపాదించాలని "రెండు ముళ్ళ మధ్య ఒక గులాబీ" అని ఫోటో తీస్తుండగా అనాలనుకున్నారు జిన్నా.

తీరా ఫోటో తీయబోయే సమయానికి జిన్నాకు ప్రక్కన మవుంట్ బాటెన్ వచ్చి నిలబడ్డారు. ఆయన భార్య జిన్నాకు మరొక ప్రక్కన నిలబడటంతో జిన్నా మధ్యలో వుండిపోయారు. జిన్నా అంత వరకూ మనస్సులో అనుకొంటున్న మాటను యాంత్రికంగా "రెండుముళ్ళ మధ్య ఒక గులాబి" అనేసి చటుక్కున నాలుక కరుచుకున్నారట.

గాంధీజీ హత్యకు గురైన వెంటనే తన సంతాపసందేశంలో "హిందూ సమాజం సృష్టించిన అత్యున్నత వ్యక్తులలో ఒకరు"గా గాంధీజీని వర్ణించారు జిన్నా. ఓ సన్నిహిత మిత్రుడు "అదేమిటి? గాంధీజీ దృక్పథం హిందూ సమాజానికే పరిమితంగాక ఇంకా విశాలమైనది కదా? అని ప్రశ్నిస్తే లేదు లేదు ఆయన గొప్ప హిందూ మాత్రమే అన్నారట జిన్నా. దీన్ని బట్టే జిన్నాది ఎంత సంకుచిత స్వభావమో ఊహించవచ్చు!



స్పానిష్ పిల్ల చేత బ్లాక్ మెయిల్ చేయబడిన

# వి. కె. కృష్ణమీనన్

కేంద్ర మాజీరక్షణ మంత్రి, పండిట్ నెహ్రూకు సన్నిహిత సహచరుడైన వి. కె. కృష్ణమీనన్ అసాధారణ మేధావేగాని దేశప్రయోజనాలు విస్మరించి చైనాపట్ల ఆయనననుసరించిన మెతకధోరణి,రక్షణ వ్యవహారాలలో ప్రదర్శించిన అపకతవక ధోరణికారణంగా ఆయన్ని తొలగించటంజరిగింది.

## 10 పేజీల టెలిగ్రాం

కృష్ణమీనన్ ప్రభుత్వ ధనం విచ్చలవిడిగా ఖర్చు చేసేవారు. డబ్బు విలువ ఆయనకు ఏమాత్రం తెలిసేది కాదు. ఒకసారి కృష్ణమీనన్ బొంబాయి నుంచి ప్రధాని నెహ్రూకు వ్యక్తిగతంగా ఒక టెలిగ్రాంపంపారు ఆ టెలిగ్రాం తరువాత టైప్ చేయగా పది అరఠావులు పైగా అయింది! దానికి రెవేల రూపాయలు టెలిగ్రాం ఛార్జీ అయింది. ఇంతా చేస్తే అందులో ఏమంత ముఖ్యమైన విషయం కూడా లేదట!

కృష్ణమీనన్ రక్షణమంత్రిగా వుండే రోజుల్లో ఆయన ఆఫీసులో ఎయిర్ కండిషన్ యంత్రాలు సదా పని చేస్తూనే వుండేవి. తాను ఆఫీసులో లేనప్పుడు విదేశ పర్యటనలో వున్నప్పుడు కూడా వాటిని ఆపటానికి వీల్లేదని కింద అధికారులకు ఉత్తర్వులు జారీ చేసేవారట!

ఎప్పుడూ నిద్రమాత్రలు మింగుతూ రోజుకు కొన్ని డజన్లసార్లు టీ తాగేవారు కృష్ణమీనన్. ఆహారం చాలా తక్కువ తీసుకునేవారు. ఆయన స్వంత వైద్యుడు డాక్టర్ హండూయే "కృష్ణమీనన్ చాలా అనారోగ్యపు మనిషి. దాదాపు మానసికంగా పిచ్చివాడు" అన్నాడు.

## ఎప్పుడూ చిరు బుర్రులే

కృష్ణమీనన్‌లో హాస్యధోరణి కూడా తక్కువే! ఎప్పుడూ చిర్రుబుర్రు లాడుతూ సీరియస్‌గా వుండేవారు. ఒకసారి పండిట్ నెహ్రూ,

ఆయన కార్యదర్శి మత్తాయ్, కృష్ణమీనన్ కాశ్మీర్ పర్యటనకు వెళ్ళారు ఒక సుప్రభాత సమయాన వారు ప్రభుత్వ అతిథి గృహంలో కూర్చొని ముచ్చటించుకుంటున్నారు. పండిట్ నెహ్రూ తన సహజ హాస్యధోరణిలో మీనన్ వైపు తిరిగి "మళయాళీలు కాశ్మీర్ వచ్చి నాగరికత నేర్చుకోవాలి" అన్నారు. మత్తాయ్, మీనన్ ఇద్దరూ మళయాళీలే. హాస్యధోరణి లేని కృష్ణమీనన్ ఆ మాటలకు కోపం తెచ్చుకోగా మత్తాయ్ చటుక్కున అందుకుని "మా శంకరాచార్యుల వారు ఏనాడో కాలినడకన కేరళ నుంచి కాశ్మీరువచ్చి ఇక్కడి వారిని నాగరికం చేశారు. శ్రీనగర్‌లో కొండపై ఆయన పేర నున్న ఆలయమే అందుకు ప్రత్యక్ష నిదర్శనం" అన్నారు. ఆ మాటలకు కృష్ణమీనన్ కోపం తగ్గి విజేతలాగా పోజు పెట్టాడు.

## పటేల్ × కృష్ణమీనన్

సర్దార్ పటేల్, మౌలానా ఆజాద్‌లకు కృష్ణమీనన్ అంటే సరిపడేదికాదు. ముఖ్యంగా సర్దార్ పటేల్ కృష్ణమీనన్ పేరు చెబితే మండిపడేవారు. కృష్ణమీనన్ ఎప్పుడు తనను కల్సుకోవాలన్నా దర్శనం కూడా ఇచ్చేవారు కాదు. ఒకవేళ ఎప్పుడైనా తప్పనిసరిగా ఇద్దరూ కల్సుకున్నా సర్దార్ పటేల్ ముక్తసరిగా ఒకటి రెండు మాటలు మాత్రమే మాట్లాడేవారు. ఒకసారి కృష్ణమీనన్ పటేల్‌తో మాట్లాడాలని ఆయనింటికి ఫోన్‌చేశారు. అందుకు పటేల్ కార్యదర్శి ఫోన్‌లోనే "మీరు వారిని రేపు ఉదయం అయిదింటికి మార్నింగ్‌వాక్‌లో కలిసి నడుస్తూ మాట్లాడవచ్చును" అని సమాధానం చెప్పాడు. కృష్ణమీనన్‌కు పొద్దున్నేలేచే అలవాటు, నడిచే అలవాటు లేదని తెలిసే ఈ విధంగా చెప్పి ఆయన్ని వదిలించుకున్నారు.

## నెహ్రూ నీడను కాదు

విచిత్ర వ్యక్తిత్వంగల కృష్ణమీనన్ తనను పండిట్ నెహ్రూతో సమానుడిగా ఊహించుకునేవారు. అంతే తప్ప కొందరు భావించినట్టు తాను నెహ్రూ నీడ (షాడో ఆఫ్ నెహ్రూ) కాదనేవారు.

విందుభోజనాలలో కృష్ణమీనన్ తనదైన ప్రత్యేకతను ప్రదర్శించాలనుకొనేవారు. విందులకు సరిగ్గా వేళకు వెళితే తన గొప్పతనం బయట పడదని మిగతా అతిథులు తన కోసం ఎదురుచూసేలా ఆలస్యంగా వెళితే తన ప్రత్యేకత తెలుస్తుందని ఆయన నమ్మిక.

కృష్ణమీనన్ బ్రిటన్‌లో మన హైకమిషనర్‌గా వున్నప్పుడు ఒకసారి ప్రధాని పండిట్ నెహ్రూ పర్యటనకు అక్కడికి వెళ్ళారు. ఆ సందర్భంగా మౌంట్‌బాటెన్ దంపతులు పండిట్ నెహ్రూ గౌరవార్థం లండన్‌కు 60 మైళ్ళదూరంలోని పల్లెటూళ్ళో వున్న తమ ఇంట్లో మధ్యాహ్నభోజనం ఏర్పాటు చేశారు. ఒంటి గంటకు విందని సన్నిహితులకి ఆహ్వానాలు పంపారు. మీనన్‌కు కూడ ఆహ్వానం అందింది. పండిట్ నెహ్రూతో సహా అందరూ ఖచ్చితంగా ఒంటి గంటకు మౌంట్‌బాటెన్ ఇంటికి విచ్చేశారు. మీనన్ మాత్రం గంట ఆలస్యంగా తీరిగ్గా 2 గంటలకు వచ్చారు. అప్పటి వరకూ అతిథులందరూ ఆయన కోసం ఎదురు చూస్తూ విందు ప్రారంభించలేదు. మీనన్‌కు కావలస్సింది కూడా అదే కదా!

## కృష్ణ లీలలు

కృష్ణమీనన్ సెక్స్ విషయంలో కూడా వింత ధోరణిలో వుండేవారు. ఆయనలో సెక్సు కోరికలు విపరీతంగా వుండేవి. అయితే సెక్స్ క్రియలో అశక్తుడు! మీనన్ అమెరికాలో ఒక స్పానిష్ పిల్లను వెంటేసుకుని క్లబ్‌ల వెంట తిరిగేవాడు. కృష్ణమీనన్ 'సరకు' ఏమిటో తెలిసిపోయిన ఆ పిల్ల—నీగుట్టు అంతా పత్రికలవాళ్ళకు చెప్పేస్తా-నని ఆయన్ని బ్లాక్ మెయిల్ చేయటం ప్రారంభించేసరికి ఎలాగో ఆ పిల్లను ప్రాధేయపడి ఆ పిల్ల కోరిన సొమ్ము ఇచ్చి ఆ పీడ వదిలించుకునేసరికి తలప్రాణం తోకకు వచ్చిందట!

కృష్ణ మీనన్ చనిపోతూ తనకున్న యావదాస్తిని భారత్ ప్రజలకే ఇచ్చివేశారు.



నాటకాల రాయుడు

# కాశీనాధుని నాగేశ్వరరావు

దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుగారు చదువుకునే రోజుల్లో చాలా అల్లరి చిల్లరిగా తిరిగేవారు. చెప్పిన మాట వినేవారుకాదు. చెట్లవెంట పుట్లవెంట తిరిగేవాడు. ఆయన బందరులో చదువుకునేరోజుల్లో ఒకసారి జామచెట్టు ఎక్కి విరగ బడగా తండ్రి బుచ్చయ్యగారికి ఈ విషయం తెల్సి కొడుకుని గుంజకుకట్టి చావబాదారు.



నాగేశ్వరరావు మెట్రిక్యులేషన్ ప్యాసయిన తర్వాత నాటకాల కంపెనీలో చేరి వేషాలు వేయటం ప్రారంభించారు. పరమనైష్టికుడు పూర్వాచార పరాయణుడైన తండ్రి బుచ్చయ్యగారికి ఇది తెలిసి చాలా బాధ పడ్డాడు. కొడుకుపై మండిపడ్డాడు. ఆయినా నాగేశ్వరరావు మాత్రం నాట

కాల్లో వేషాలు వేయటం మానలేదు. ఈలోగా బుచ్చయ్యగారికి అకస్మాత్తుగా జబ్బు చేసింది. అప్పుడు నాగేశ్వరరావుగారు జగ్గయ్యపేటలో నాటకాలు ఆడుతున్నారు. వెంటనే బయలుదేరి రమ్మని తల్లి కబురుచేసింది. కాని నాగేశ్వరరావు ఫలానా వేషం వేస్తాడని అప్పటికే నాటక కంపెనీవారు కాన్వాస్ చేయటం వలన నాటక కంపెనీ మేనేజరు నాగేశ్వరరావు ఇంటికి వెళ్ళటానికి వీల్లేదని చెప్పాడు. అందువలన తల్లి కబురు అందిన నాలుగు రోజుల తర్వాత మాత్రమే నాగేశ్వరరావు స్వగ్రామానికి తిరిగివచ్చాడు.

ఈలోగా నాగేశ్వరరావుగారి తండ్రి పరిస్థితి విషమించింది. మరణ శయ్యపై నున్న తండ్రిని చూద్దామని నాగేశ్వరరావుగారు దగ్గరకు వెళ్ళగా నాటకాలు వేసేవాడి ముఖం చూడనని మరొక ప్రక్కకు తిరిగి పడు కున్నాడు. ఆ విధంగా తండ్రి బుచ్చయ్యగారు నాగేశ్వరరావుగారి మొఖం చూడకుండానే మరణించాడు.

## అమృతాంజనం ప్రచారం

దానకర్ణునిగా సుప్రసిద్ధులైన దేశోద్ధారకుడు, కాశీనాథుని పంతులు గారు 80 సంవత్సరాల క్రితం తాను కనిపెట్టిన దివ్యౌషధం అమృతాంజనం ప్రచారానికి ఎన్నో పద్ధతులు అవలంభించారు. ప్రకటనలు చేయటంలో ఆయన చేసిన కృషి ఈనాటి మేటి వ్యాపారస్తులకు సహితం ఆశ్చర్యం కల్గిస్తాయి. అంతకుపూర్వం ఎవరూ, ఏ వస్తువుకీ అంతగొప్పగా ప్రచారం చేసి వుండలేదు.

అమృతాంజనం గురించి గోడలమీద రంగులతో రాయించేవారు. ఆ పెయింట్ వేయటానికి సప్తగిరి అనే నిపుణుడ్ని నియమించారు. అతను వేసిన పెయింట్ 5 సంవత్సరాలు మన్నేదంటారు. అమృతాంజనంగురించి పద్యాలు, పాటలు రాయించి ప్రచారంలో పెట్టారు. జర్మనీనుంచి తెప్పిం

చిన పెద్దబెలూన్ మీద అమృతాంజనం పేరు రాయించి పుష్కరాల సమ యంలో దాన్నిపదిలేవారు. రైల్వేస్టేషన్లలోనూ సైకిళ్ళు, ట్రాంబళ్ళ మీద, సినిమాహాళ్ళలోనూ అమృతాంజనం ప్రకటనలు వేయించారు. లక్షల కొద్దీ కరపత్రాలు అచ్చువేయించి దేశమంతటా విరజిమ్మారు ప్రత్యేక కాలెండర్లు వేయించారు. నైజాం ప్రాంతంలోకి పంపే కాలెండర్లపై నైజాం నవాబు బొమ్మ, మైసూరుకు పంపే కాలెండర్లమీద మైసూరు మహారాజు బొమ్మ వేయించేవారు. చేతి సంచులమీద, ఫౌంటెన్ పెన్నులపై అమృతాంజన్ పేరు రాసి దాన్ని కొన్నవారికి బహుమానంగా ఇచ్చేవారు.

ఆవిధంగా ఎన్నోవిధాల ప్రచారం చేయటంవల్ల అమృతాంజనం విపరీతంగా వాడుకలోకి వచ్చింది. అంతకుపూర్వం ప్రసిద్ధిలో వున్న ఓరి యంటల్ బామ్ వంటివి మార్కెట్లోనుంచి అదృశ్యమైనాయి. దేశంలో ముఖ్యంగా దక్షిణాది రాష్ట్రాలలో అమృతాంజనం కొనని ఇల్లు లేదంటే అతిశయోక్తికాదు. ఆవిధంగా అపారధనం, కీర్తి కూడా సంపాదించారు నాగేశ్వరరావు.

## సాలీనా 2 లక్షలు ఆదాయం

అమృతాంజనంపై వచ్చిన ఆదాయంతో నాగేశ్వరరావు 1927లో సున్నంపాడు ఎస్టేటు 70 వేల రూపాయలకు కొన్నారు. ఆతర్వాత బందరు తాలూకాలోని 7 గ్రామాలుకల కృత్తివెన్ను ఎస్టేటును 2 లక్షల రూపా యలకు కొన్నారు ఆ ఎస్టేటులోని బంజరుభూముల అభివృద్ధికి మరి కొన్ని లక్షల రూపాయలు ఖర్చుచేశారు. అదనంగా ఆయా గ్రామస్తులకు అనేక ఉపయోగకరమైన పనులు చేశారు. పాఠశాలలు, దేవాలయాలు నిర్మించారు. సత్రాలు, బావులు ఏర్పరచారు. జమాబందిరోజున అర్జీపెట్టు కున్న వారందరికీ శిస్తురిమిషన్ ఇచ్చి మిగతా జమీందారులకు భిన్నంగా వ్యవహరించారు.

1929లో నాగేశ్వరరావుగారికి అమృతాంజన్‌పై ఆదాయం సాలీనా 2 లక్షలు వచ్చేది. అందులో 32వేలు ఆదాయంపన్ను కట్టేవారు. 1935లో రైతుసంఘ సమావేశం మద్రాసులో ఆంధ్రపత్రిక కార్యాలయంలో జరిగింది. దానికి నాగేశ్వరరావు అధ్యక్షత వహించారు. సమావేశంలో కొంత మంది యువకులు జమీందారీరద్దు తీర్మానం ప్రవేశపెట్టారు. జమీందారు అయిన నాగేశ్వరరావు అందుకు బాధపడతారేమోనని యన్.జి రంగా ఆ తీర్మానం ఉపసంహరించుకోవాల్సిందని యువకులకు నచ్చచెప్పటానికి ప్రయత్నించారు. అందుకు నాగేశ్వరరావు చిరునవ్వుతో "ఇందులో నేను బాధపడవల్సింది ఏముంది? అన్ని జమీందారీలు పోతుంటే నేను ఒక్కడినే కాలానికి ఎదురుతిరిగి ఎలా అడ్డుకోగలను? ఈ తీర్మానాన్ని నేను బలపరుస్తున్నాను" అంటూ ఆమోదం తెలిపారు.

## దానకర్ణుడు

ఆంధ్రదేశంలో ఆయనుంచి విరాళాలు పొందని రాజకీయ పక్షంగాని రాజకీయనాయకుడుగాని ఆకాలంలో లేరు. కమ్యూనిస్టు పార్టీ నుంచి జస్టిస్ పార్టీవరకూ ఆయనసాయం పొందినవే. ఆయన సహాయం పొందిన గ్రంథాలయాలు ఎన్నో! ఆయన ధనంతో ఎందరి పెళ్ళిళ్ళు అయినాయో? మరెందరు చదువుకున్నారో? ఎందరు పండితులు, కవులు నాగేశ్వరరావుచేత పోషించబడ్డారో చెప్పలేము.

ఆ విధంగా లెక్కలు లేకుండా దానధర్మాలు చేయటంవల్ల నాగేశ్వరరావు కొంతకాలానికి అప్పులపాలు కావాల్సి వచ్చింది. తిరుపతి మహంతు దగ్గర కొన్ని లక్షలు అప్పుతెచ్చారు. ఆ అప్పును తీర్చలేక అమృతాంజనను లిమిటెడ్ కంపెనీగా మార్చి షేర్లు అమ్మి రుణం తీర్చారు. ఆయన చనిపోయేనాటికి 4, 5 లక్షల రుణం వుంటే ఆతర్వాత కృత్తివెన్ను, నున్నంపాడు ఎస్టేట్లు అమ్మి బాకీలు తీర్చారు వారసులు. 

గాంధీజీని, నెహ్రూని
వేళాకోళం చేసిన అల్లరిపిల్ల

# శ్రీమతి సరోజిని నాయుడు

ప్రముఖరచయిత్రి, దేశభక్తురాలు, కవికోకిలగా ప్రసిద్ధి పొందిన శ్రీమతి సరోజినీనాయుడును దక్షిణాఫ్రికాలో జరిగిన ఒకనాటి బహిరంగ సభలో 'నైటింగేల్ ఆఫ్ ఇండియా' (భారత కవికోకిల) అని పరిచయం చేయటానికి బదులు "నాటీగర్ల్ ఆఫ్ ఇండియా" (భారతదేశపు అల్లరి పిల్ల)గా పరిచయం చేశారొకాయన, అమెరికాలోని ప్రముఖపత్రిక "న్యూయార్క్ టైమ్స్" శ్రీమతి సరోజిని నాయుడు గురించి సంపాదకీయం రాస్తూ ఆమెను 'జోన్ ఆఫ్ ఆర్క్'తో పోల్చింది



## మిక్కీమవుస్ కనిపించాడా ?

సరోజినీనాయుడులో హాస్యచతురత, ధైర్యసాహసాలు జోడు గుర్రాల్లా ఉండేవి. గాంధీజీతో హాస్యోక్తులాడగల చొరవ అనాటి అతిరథ మహారథ కాంగ్రెస్ నాయకులలో ఒక్క సరోజినీనాయుడుకే ఉండేది. ఒకోక్క సందర్భంలో ఆమె గాంధీజీని కూడా ఎదిరించేది. గాంధీజీని 'మిక్కీమవుస్' అని పిలువగల ధైర్యం శ్రీమతి సరోజినికి కాక మరెవరికీ

లేదు. ఒకసారి లండన్‌లో జనసమూహం మధ్య ఇరుక్కుపోయిన గాంధీ జీని వెదుకుతూ "బాబూ! మీ కెక్కడైనా మా మిక్కీ మవుస్ కనిపించాడా" అని జనాన్ని ప్రశ్నించగా గాంధీజీతో సహా అంతా పగలబడినవ్వారు.

## బోళామనిషి అతివాగుడు

బోళాగా ఉండే సరోజిని అతిగామాట్లాడేది. ఆమె అతివాగుడు ఏదైనా తంటా తెచ్చిపెడుతుందనే ఉద్దేశ్యంతో గాంధీజీకూడా ఆమెపట్ల జాగ్రత్తగా ఉండేవాడు. అన్నివిషయాల్లో ఆమెపట్ల జాగ్రత్తగా ఉండేవాడు. అన్నివిషయాలు ఆవిడకు చెప్పేవారుకాదు. 1945లో నెహ్రూ కాంగ్రెస్ అధ్యక్షునిగా ఎన్నికైనప్పుడు ఆయన సరోజినీనాయుడును కాంగ్రెస్ వర్కింగ్‌కమిటీలోకి తీసుకోబోగా, గాంధీజీ అంగీకరించక నిరాకరించిన కారణం కూడా ఆమె అతివాగుడే!

ఓసారి గాంధీజీ గురించి సహచరులతో మాట్లాడుతూ "ఈ ముసలిని లోకానికి దరిద్రునిగా చూపటానికి ఎంతడబ్బు ఖర్చుచేయవల్సి వస్తోందో ప్రజలకేం తెలుసు" అంది సరోజిని. గాంధీజీ హత్యగావించ బడిన తర్వాత ఆయనను తలుచుకొని కుమిలికుమిలి ఏడుస్తున్నవారిని చివాట్లుపెడుతూ "ఎందుకు ఇలా ఏడుస్తూకూర్చుంటారు. ఆయన ముసలివాన పడి ఏవో జబ్బుతో తీసుకు చావాలని మీ ఉద్దేశమా? హత్యగావించబడటమే ఆమహామహునికి సరైన మరణం" అన్నదామె. కాని ఆమెమాటల్లోని అంతరార్థాన్ని చాలామంది సరిగా గ్రహించలేదు.

సరోజినీనాయుడు నోటిమరుసుతనం ఆమె కుటుంబంలో కూడా కలతలు తెచ్చిపెట్టేది. ఓసారి ఆమె తీవ్రవాది అయిన అన్న చటోపాధ్యాయ చర్యలను విమర్శించటంతో ఆమెతండ్రి అఘోరనాధ్‌కు చాలా కోపం వచ్చింది. చివరికి ఆమె ముఖం చూడనని ఆయన భీష్మించాడు. అఘోర

నాథ్ మరణశయ్యపై ఉండగా సరోజిని తండ్రిని కడసారి చూడటానికి వెళ్ళితే ఆమె ఇంట్లోకి రావటానికి, తనను చూడటానికి ఆయన అంగీకరించలేదు.

## నెహ్రూ వంటవాడనుకున్నారా ?

హాస్యోక్తులతో అవతలివారిని ఉడికించే సరోజిని ఓసారి నెహ్రూతో "జవహర్! నీసభలకు వచ్చే స్త్రీలంతా నువ్వుచెప్పే సిద్ధాంతాలు ఉపన్యాసాలు వినటానికి వస్తున్నారనుకోకు! కేవలం నీ అందమైనముఖం చూడటానికి మాత్రమే వాళ్ళువస్తున్నారు"అంది. నెహ్రూను సోదరుని కన్నా ఎక్కువగా అభిమానించే సరోజిని నెహ్రూ కుటుంబముతోనే ఎక్కువగా కాలక్షేపం చేసేది. నెహ్రూ భవంతి ఆనందభవన్‌లోనే ఉంటూ అక్కడకు వచ్చేవారికి అతిథిమర్యాదలు చేస్తూఉండేది. ఆనందభవన్‌కు వచ్చే ప్రముఖరాజకీయ వేత్తలలో అనేకమంది భోజనాలుకూడా అక్కడే కానిచ్చేవారు సరోజిని, కమలానెహ్రూ వారికి అతిథి మర్యాదలు చేసేవారు. ఆ వచ్చిన ప్రముఖులలో రకరకాల అభిరుచులున్న వారుండేవారు. కొందరు శాకాహారమే కావాలనే వారు. కొంతమంది మాంసాహారంలేనిదే ముద్దఎత్తేవారు కాదు. మరి కొంతమంది గడ్డపెరుగు లేనిదే తినేవారుకాదు. ఇంకొంతమంది నారింజ పళ్ళు కావాలని అడిగేవారు. సాధ్యమైనంతవరకూ కమలానెహ్రూ, సరోజిని వారికోర్కెలు తీరుస్తూ ఉన్నా ఒక్కొక్కప్పుడు సరోజిని వారికోరికలు విని చికాకుపడి "ఏమయ్యా! మీకిదేమైనా మర్యాదగా ఉందా? తలో రకం కోరికలు కోరటం న్యాయమా? మా నెహ్రూ వంటవాడనుకున్నారా మీ కోరికలన్నీ తీర్చటానికి? అతను భారత రాజకీయవేత్తలలో ఆణిముత్యం! మీ అసందర్భపు కోర్కెలతో అతన్ని చికాకుపెట్టకండి" అని మందలించేది.

ఆమె 12 వ యేటనే మద్రాసు విశ్వవిద్యాలయంలోకెల్లా ప్రథము రాలిగా మెట్రిక్యులేషన్‌పాసై 13వ యేటనే "లేడీ ఆఫ్ దిలేక్" కావ్యం

రాసింది. 1300 పంక్తులున్న ఆ కావ్యాన్ని కేవలం 6 రోజులలో పూర్తి చేసిందామె. సరోజినీనాయుడు మిగతా పుస్తకాలకన్నా డిటెక్టివ్ నవలలు ఎక్కువగా చదివేది. ముఖ్యంగా అగాథాక్రిస్టీ డిటెక్టివ్ నవలలంటే ఆమెకు చాలా ఇష్టం.

## అందరూ జోకర్లే !

జలియన్‌వాలాబాగ్ దురంతరం జరిగిన తర్వాత సరోజినీనాయుడు లండన్‌లో ఒకసభలో బ్రిటిషు ప్రభుత్వ దమనకాండను దుయ్యబడుతూ మహాద్రేకంతో ఉపన్యసించారు. తమదేశం వచ్చి తమ ప్రభుత్వాన్ని అంతతీవ్రంగా విమర్శించటం సహించలేని ఆంగ్లేయులు అల్లరి ప్రారంభించి సభను భగ్నంచేయటానికి ప్రయత్నించారు. సరోజినీనాయుడు ఇంకా తీవ్ర స్థాయికి వెళ్ళి "పిచ్చి పిచ్చి వేషాలు వేయక నోరు మూసుకుకూర్చోండి" అని గద్దించగానే అందరూ నిశ్శబ్దమై పోయారు.

ఒకసారి సరోజినీనాయుడు గాంధీజీ ఒకే జైలులో ఉన్నప్పుడు దీపావళి వచ్చింది. ఖైదీలందరూ రకరకాలుగా సంబరాలు చేసుకొంటున్నారు. గాంధీజీ తాగే పాలకోసం జైలులో ఒక మేక ఉండేది. గాంధీజీని ఆట పట్టించాలని సరోజినీనాయుడు అట్టమీద కొన్ని వాక్యాలు రాసి ఆ మేకపిల్ల మెడలో కట్టి గాంధీజీ ఉండే గదికి తోలారు ఆయన మేకపిల్ల మెడకున్న అట్టవిప్పి చదివితే దానిలో, "అ హ్యా! నా తల్లిపాలు నేను కడుపారా త్రాగకుండా నీవు త్రాగటం ఏమి న్యాయం?" అని ఉంది. గాంధీజీ నవ్వుకొని "ఈపండుగ రోజున నీతల్లి పాలను నేను ముట్టుకోను. పాలన్నీ త్రాగి నీవు కూడా పండుగ చేసుకో" అంటూ మేకపిల్లను నిమిరి తల్లిపద్దకు తోలారు.

1949లో లక్నో విశ్వవిద్యాలయం వారు పండిట్ నెహ్రూకూ, కైలాస్ నాథ్ కట్జూలకు గౌరవ డాక్టరేట్‌లు బహూకరించారు అప్పుడు కట్జూ

పశ్చిమ బెంగాల్ గవర్నరుగా, సరోజినీనాయుడు ఉత్తర ప్రదేశ్ గవర్నరుగా ఉండేవారు. ఆనాటి స్నాతకోత్సవ సభకు సరోజినీనాయుడు అధ్యక్షత వహించి కైలాస్‌నాథ్ కట్జూకి పట్టాప్రదానం చేస్తూ "అయ్యా, కట్జూగారూ! మీరు, నేను ఆ మాటకొస్తే మనదేశంలోని గవర్నర్లందరూ జోకర్లేగా!" అనగా పండిట్ నెహ్రూతో పాటు సభాసదులంతా హర్షధ్వానాలు చేశారు.

## అనారోగ్యంలో కూడా రచనా వ్యాసంగం

సరోజిని 11వ యేటనే ఆమెకు తెలియకుండానే ఆమెలో కవితా బీజం అంకురించింది. ఒకనాడు అల్‌జీబ్రా లెక్కలు చేయటం ఆరంభించింది. ఎంత తన్నుకున్నా ఆ లెక్క కుదరలేదు. దానికి బదులుగా ఒక పద్యం ఆమె నోటివెంట అనుకోకుండా వచ్చింది. అదే ఆమె కవితకు ప్రారంభం. ఆనాడు ఉద్భవించిన ఆ సెలయేటిగానం మహాప్రవాహమై పొంగి పొరలి లోకమంతట మంగళగీతాల రూపాన ముంచెత్తింది.

సరోజిని మొదటినుంచి పెద్ద ఆరోగ్యవంతురాలు. ఒకసారిఆమెకు జబ్బు చేస్తే విశ్రాంతి తీసుకోవాల్సిందని, పుస్తకాలు కూడా చదవవొద్దని సలహా చెప్పారు. కాని ఎప్పుడూ చదవటమో, రాయటమో అలవాటైన సరోజిని ఊరకనే కూర్చుంటుందా ? ఆ జబ్బులోనే 2000 పంక్తులుగల నాటకమే రాసింది!

సరోజిని లండన్‌లో చదివేరోజుల్లో ఆమెకు ఎడ్మండ్ గోసి అనే సాహిత్య విమర్శకునితో పరిచయం కల్గింది. అతడు సరోజినికి ఇచ్చిన సలహాలు ఆమె భవిష్యత్తులో గొప్ప కవయిత్రి కావటానికి ఎంతగానో తోడ్పడ్డాయి. అతడు ఏం చెప్పాడంటే "ఇక్కడ ఇంగ్లీషు కవులలాగా పక్షులను, కుందేళ్ళను వర్ణించవద్దు. మీ దేశంలో గల వాతావరణంఅక్కడ

పరిస్థితులకు తగ్గట్టు కవిత్వం వ్రాయి" అని చెప్పాడు ఈ సలహా ఆమెలో ఎంతో మార్పు తెచ్చి తాను వ్రాసిన కవిత్వం అంతా భారతీయ పరిస్థితులకు తగ్గట్టే వుండేలా చేసింది. అందువలననే ఆమెకు అంత ఖ్యాతి లభించింది. ఆవిడ రచనలు బహుళ వ్యాప్తి పొందినాయి.

## "నీవు పెళ్ళికూతురైతే నేను పెళ్ళికొడుకు కావటానికి సిద్ధం"

ఒకసారి మహాత్మాగాంధీ ఉపవాస వ్రతం చాలించి తర్వాత మామూలుగా సరోజిని చేతిమీదగా నిమ్మరసం త్రాగుతున్నారు. సరోజిని హాస్యంగా "ఉపవాసం చేసినా హుషారుగా పెళ్ళికొడుకులాగానే వున్నావుగా" అనగానే గాంధీజీ వెంటనే నవ్వుతూనే "నీవు పెళ్ళికూతురై తే నేను పెళ్ళికొడుకు కావటానికి సిద్ధం" అన్నాడు.

1944 అక్టోబరు 2కు గాంధీజీకి 75 సంవత్సరాలు నిండాయి, ఆ సందర్భంగా ఆయనకు బహూకరించటానికి 75 లక్షలు ప్రోగుచేశారు, ఆ చెక్కును సరోజిని ద్వారా అందజేయటానికి నిర్ణయించి సభ ఏర్పాటు చేశారు. భారతీయ సాంప్రదాయం ప్రకారం పెద్ద ముత్తైదువుగా సరోజిని గాంధీజీ నుదుట కుంకుమబొట్టు పెట్టి, ఆప్యాయంగా తలనిమిరి, తన కణతలపై మెటికలు విరుచుకొని చెక్కును గాంధీజీకి సమర్పించుతూ కొంటెగా "ఈ చెక్కు మీకు ఇవ్వకుండా నేనే తీసుకుపోతే ఏం చేస్తావు" అనగానే గాంధీ నవ్వుతూ "నీవు నిజంగా అంతపనీ చేయగలవు" అని చెక్కు తీసేసుకున్నారట!

ఒకసారి ఒక విద్యార్థి బృందం వచ్చి గాంధీజీని ఉపన్యసించ వల్సిందిగా కోరితే హరిజన నిధికి రెండు వేల చందాలిస్తేనే ఉపన్యసిస్తానని చెప్పటంతో ప్రక్కనే వున్న సరోజిని "ఆ కోమటిని ఎందుకు అడుగుతారు? కోమటికి డబ్బు పిచ్చి ఎక్కువ" అన్నారట.

## "మీకు పర్వా లేకపోతే — నాకు లేదూ"

ఒకసారి గాంధీజీ ఇర్విన్ ప్రభుత్వంతో చర్చలు జరుపుతున్నారు. ఒక విషయమై తక్షణం శ్రీమతి సరోజినీనాయుడుతో సంప్రదించ వల్సి వచ్చింది. ఆమె కోసం చూడగా ఆమె బాత్‌రూంలో వున్నట్లు తెలిసింది. గాంధీజీ వెంటనే బాత్‌రూం వద్దకు వెళ్ళి తలుపు కొట్టి ఆమెతో అత్యవసరంగా మాట్లాడాలని అనగానే "బాపూజీ నేను స్నానం చేస్తున్నానుగా...." అని లోపల నుంచి సరోజినీనాయుడు సమాధానం చెప్పగా మరేం పర్వా లేదు అనగానే సరోజినీనాయుడు లోపలి నుంచి నవ్వుతూ "మీకు పర్వా లేకపోతే — నాకు లేదూ" అని గబగబా స్నానం ముగించి గాంధీజీతో చర్చలు జరిపారు.

## ఐదు నిమిషాల్లో గవర్నర్ దర్శనం

సరోజిని గవర్నరు పదవి చేపట్టిన తర్వాత కూడా చాలా సాదా సీదాగా వుండేది. ఆడంబరాలకు పోయేదికాదు. బయట పర్యటనకు వెళ్ళినా మందీ మార్బలంతో వెళ్ళకుండా కుమార్తె పద్మజను మాత్రమే వెంటపెట్టుకుని పేరంటానికి ముత్తయిదువులాగా బయలుదేరేది. తాను గవర్నరు అన్నట్లు ప్రవర్తించేవారుకాదు. సామాన్యులతో కూడా కలసి మెలిసి తిరిగేవారు. వారి క్షేమ సమాచారం అడిగి తెలుసుకునేవారు. ఎప్పుడూ ఛలోక్తులతో తాను నవ్వుతూ ఇతరులను నవ్వించేవారు.

లోగడ గవర్నర్ల దర్శనం లభించాలంటే 10 రోజులు ముందు నుంచి ప్రయత్నించవల్సి వచ్చేది. అటువంటిది సరోజిని హయాంలో నిము షాలలో దర్శనం లభించేది. ఒకసారి పత్రికా రచయిత అహమ్మద్ అబ్బాస్ గవర్నర్ సరోజిని దర్శనం కోసం వెళ్ళగా కేవలం 5 నిముషాల్లో లోపలికి రమ్మని పిలుపు వచ్చింది.



సెకండ్ హాండ్ కారులో
కాలక్షేపం చేసిన

# డాక్టర్ రాజేంద్రప్రసాద్

డాక్టర్ రాజేంద్రప్రసాద్ ఎప్పుడూ అనారోగ్యంతో బాధపడేవారు. ఆయనకు ఉబ్బసం వుండేది. ఆయన పర్యటనకు ఎక్కడకు వెళ్ళినా అంగరక్షకులు ఉబ్బసం వచ్చినపుడు ఉపయోగించే "పంప్" వెంటతీసుకు వెళ్ళేవారు. ఉబ్బసం తెరరాగానే ఈ పంప్ ఉపయోగించి స్వస్థత చేకూర్చే వారు. ఆయనకు ఆరోగ్యం తటు గైనా తెల్లవారుజామునే 5 గంటల కల్లా లేచేవారు. ఒక అరకప్పు టీ తీసుకుని తోటలోకి వెళ్ళి ఒక గంట సేపు అటూఇటూ పచార్లుచేసేవారు. ఆ తర్వాత కాసేపటికి టిఫిన్ చేసి 8 గంటలకల్లా ఆఫీస్ రూంకి వచ్చేవారు.



రాజేంద్రప్రసాద్ భార్య రాజ్‌బన్సీ దేవి కూడా ఆవిటి మనిషి. ఎప్పుడూ మంచంమీదే వుండేది. అయినా ఆవిడ గొప్ప దైవభక్తురాలు. ప్రతిరోజూ దేవాలయానికి వెళ్ళి ప్రార్థన చేసి వచ్చేవారు.

## బిస్మిల్లాఖాన్ ఆఫ్ ది సౌత్

రాజేంద్రప్రసాద్ రాష్ట్రపతిగా వున్నప్పుడు ఒకరోజు సాయంకాలం ప్రఖ్యాత సంగీత విద్వాంసుడు ఉస్తాద్ బిస్మిల్లాఖాన్ 'షెహనాయ్' కచేరీ జరుగుతుందని రాష్ట్రపతికి విన్నవించబడింది. బిస్మిల్లాఖాన్ కచేరీ వినాలని ఎన్నాళ్ళనుంచో రాజేంద్రప్రసాద్ అనుకుంటున్నారట. అందువలన వెంటనే

ఆ కచేరీ ఏర్పాటు చేయవల్సిందని రాష్ట్రపతి కూడా కోరారు. కచేరీ ఏర్పాటు చేయబడింది. వాయిద్య కారులంతా వచ్చి కూర్చున్నారు. ఇంకా బిస్మిల్లాఖాన్ రాలేదు. కాసేపటికి లుంగీ చొక్కాతో వున్న ఒక వ్యక్తి ప్రత్యక్షమయ్యాడు. ఆ వ్యక్తి తనను తాను పరిచయం చేసుకొని తాను నాద స్వరం విద్వాన్‌నని దక్షిణాదిలో తనని "దక్షిణ భారతదేశపు బిస్మిల్లాఖాన్" అని అంటారని చెప్పటంతో రాష్ట్రపతి మిలటరీ కార్యదర్శి హుటాహుటిన రాష్ట్రపతి కార్యదర్శి వద్దకు పరుగెత్తి "ఇదేమిటి మహానుభావా? ఉస్తాద్ బిస్మిల్లాఖాన్ కచేరి ఏర్పాటు చేస్తానని ఈ దక్షిణాది బిస్మిల్లాఖాన్ నాదస్వర కచేరి ఏర్పాటు చేశారేమిటని" కంగారుగా ప్రశ్నించగా ప్రైవేట్ సెక్రటరీకి మతిపోయినంతపనై రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ వద్దకు వణుకుతూవచ్చి "తప్పు అయిపోయింది క్షమించండి. బిస్మిల్లాఖాన్ అంటే ఈయనే అను కున్నా. ఈ నాదస్వర విద్వాంసుని విజిటింగ్ కార్డుమీద 'బిస్మిల్లాఖాన్ ఆఫ్ ది సౌత్' అని ఉండేటప్పటికి అసలు బిస్మిల్లాఖాన్ ఈయనేనని పొర పడ్డాను. నాకు సంగీత పరిజ్ఞానం లేక పోవటమేగాక బిస్మిల్లాఖాన్ ఫోటో కూడా ఎప్పుడూ చూడకపోవటం వలన ఈ పొరపాటు జరిగింది. క్షమిం చండి" అంటూ పరిపరి విధాల ప్రాధేయపడ్డాడు.

రాజేంద్రప్రసాద్ కూడా జరిగిన పొరపాటుకు కోపగించుకోకుండా "సరే ఎలాగూ ఈ నాదస్వర విద్వాంసుడు—బిస్మిల్లాఖాన్ ఆఫ్ ది సౌత్ వచ్చాడు కాబట్టి ఇక్కడ కచేరీయే కానివ్వండని" చెప్పాడు. నాదస్వర విద్వాంసులవారు రాజేంద్రప్రసాద్ మెప్పు బాగా పొందాలనే ఉద్దేశ్యంతో ఆయనకు సరిగ్గా ఎదురుగా కూర్చుని నాదస్వరం అందుకుని తీవ్రస్థాయిలో ఊదటం ప్రారంభించాడు. అసలే రాజేంద్రప్రసాద్‌కు ఉబ్బసం వుంది. ఎక్కువ మోత ఆయనకు సరిపడదు. విద్వాంసులువారు ఆయనొక్క రాగం అందుకొని కళ్ళుమూసుకొని నాదస్వరం ఉచ్చస్థాయిలో ఊదుతుండేటప్ప టికి రాజేంద్రప్రసాద్‌కు ఈ మోతకు ఊపిరితిప్పరై ఊపిరాడక ఉబ్బసం తెర

వచ్చేసింది. విద్వాంసుల వారు ఇదేమీ చూడకుండా కళ్ళు మూసుకొని "జాం" మంటూ ఊదుతూనే వున్నాడు. ప్రక్కనేవున్న మిలటరీ కార్యదర్శి రాజేంద్ర పరిస్థితి కనిపెట్టి చటుక్కుని విద్వాంసుల వారి దగ్గరకు వెళ్ళి "చాలు చాల్లే ఇక ఆపవయ్యా నీ ఊదటం" అని నోట్లోనుంచి నాదస్వరం లాగేసి రాజేంద్రప్రసాద్‌ను చేతులమీద లోనికి తీసుకెళ్ళి పడుకోబెట్టి తక్షణం డాక్టర్‌ను పిలిపించారు. డాక్టర్ పరీక్షించి "ఇంకా నయం త్వరలో తెచ్చా న్నారు. ఇంకా కాసేపు ఆ నాదస్వరం వాయించినట్లయితే రాష్ట్రపతి పరిస్థితి ఇంకా విషమించేదని ఏవో ఇంజక్షన్స్ చేసి స్వస్థత చేకూర్చాడట. ఆ మర్నాడు స్వస్థత చేకూరిన రాజేంద్రప్రసాద్ తన మిలట్రీ కార్యదర్శితో "సమయానికి అడ్డుపడి రక్షించావు. లేకపోతే ఆ విద్వాంసుడు నాప్రాణం నిలువునా తీసేవాడు" అన్నారట.

## రాజేంద్రప్రసాద్, గోవిందవల్లభ్‌పంత్‌ల మానసంరక్షణ

డాక్టర్ రాజేంద్రప్రసాద్ అప్పటి హోంశాఖా మంత్రి పండిట్ గోవింద్‌వల్లభ్‌పంత్ అంటే ఎంతో ఆప్యాయంగా వుండేవారు. పంత్ రాష్ట్రపతిని దర్శించటానికి తరుచుగా వస్తూ వుండేవారు. ఒక్కొక్కసారి పంత్ రాష్ట్రపతి భవన్‌కు ముందు వర్తమానం కూడ లేకుండా వస్తూ వుండేవారు. అలాగే ఒక మారు సాయంత్రం వేళ గోవింద్ వల్లభ్‌పంత్ రాష్ట్రపతి భవన్‌కు హఠాత్తుగా వచ్చారు. పంత్‌గారి కారు పోర్టికోలో ఆగటంతో రాష్ట్రపతి అంగరక్షకుడు ఎదురేగి స్వాగతం చెప్పాడు. పంత్ కారుదిగి ఊడిపోతున్న పంచెను సరిచేసుకోకుండా అంగరక్షకుని వెంట రాష్ట్రపతి డ్రాయింగ్ రూంలో అడుగుపెట్టారు. సరిగ్గా అదే సమయంలో టాయిలెట్ రూంనుండి వస్తున్న రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ కూడ పంచె బిగించుకుంటూ ఎదురయ్యారు. అనుకోకుండా రాష్ట్రపతిని చూడటంతో పంత్ పంచె బిగించుకోవటం మర్చిపోయి చటుక్కున రాజేంద్రప్రసాద్ గారికి చెయ్యెత్తి నమస్కరించారు. రాజేంద్రప్రసాద్ కూడా యాంత్రికంగా

పంచె వదిలేసి ప్రతి నమస్కారం చేయటంతో పాపం ఇద్దరి పంచెలు వూడిపోయే పరిస్థితి ఏర్పడింది. ప్రక్కనేవున్న అంగరక్షకులు హడావుడిగా వీరిపంచెలు ఊడకుండాపట్టుకుని మానసంరక్షణ చేయవల్సివచ్చింది.

1950 సంవత్సరానికి పూర్వం డాక్టర్ రాజేంద్రప్రసాద్ రాజ్యాంగసభ అధ్యక్షులుగా వున్నారు. అది వేసవికాలం. ఎండ వేడిమికి తాళలేక బాబూ రాజేంద్రప్రసాద్ తన ఇంటిముందు నున్న చెట్టుకింద చల్లగాలికి కూర్చున్నారు. అప్పుడు ఆయన ఒంటిమీద చొక్కాలేదు. రాజ్యాంగ సభకు చెందిన ఒక ఉద్యోగి కొన్ని ముఖ్యమైన పత్రాలు రాజేంద్రప్రసాద్‌కు అందజేయటానికి వచ్చి చొక్కాలేకుండా కూర్చున్న ఆయన్ని గుర్తించలేక, తీసుకొచ్చిన పత్రాలు ఇవ్వటానికి నిరాకరించాడు. ఆయన పక్కన కూర్చున్నవారు "వీరే రాజేంద్రప్రసాద్" అని ఎంతగానో నచ్చచెప్పిన తర్వాతనే ఆ కాగితాలు ఆయనకు ఇచ్చాడు

## ప్రథమ రాష్ట్రపతికి సెకండ్‌హేండ్ కారు

రాజేంద్రప్రసాద్ ప్రథమ రాష్ట్రపతి అయిన తర్వాతకూడా చాలా సాధారణ జీవితం గడిపేవారు. సామాన్య దుస్తులే ధరించేవారు. రాజేంద్రప్రసాద్ బహుకాంత స్వభావులు కావటంతో, ఇది అదనుగా తీసుకుని ఆయన దగ్గర బంధువులు ఎప్పుడూ రాష్ట్రపతిభవన్‌కు వచ్చి తిష్టవేస్తూ వుండేవారు. ఒక్కొక్కసారి ఆయన చుట్టాలు 40-50 మందివాకా రాష్ట్రపతి నిలయంలోనే మకాంపెట్టి, సకలమర్యాదలు పొందుతుండేవారు. వారికి సేవలు చేయలేక రాష్ట్రపతిభవన్‌లో ఉద్యోగులు ఎంతో యాతనపడేవారు.

రాజేంద్రప్రసాద్ రాష్ట్రపతిగా పదవీ విరమణ చేసిన తర్వాత తనకు ఎక్సైజు డ్యూటీ మినహాయింపుతో ఒక కారును ఏర్పాటుచేయవల్సిందిగా కేంద్ర ప్రభుత్వాన్ని కోరితే, శాంక్షన్‌కాలేదు. రాజేంద్రప్రసాద్ సెకండ్ హేండ్ కారు కొనుక్కుని దాంతోనే కాలక్షేపం చేయాల్సి వచ్చింది. ★

చతురోక్తుల, హాస్యోక్తుల

# డాక్టర్ సి. ఆర్. రెడ్డి

ప్రఖ్యాత విద్యావేత్త, ఆంధ్ర విశ్వ విద్యాలయం ప్రప్రథమ ఉపాధ్యక్షుడు డాక్టర్ సి. ఆర్. రెడ్డి 1924లో మద్రాసు రాష్ట్ర శాసనసభకు



ఎన్నికైనారు. ప్రతిపక్ష నాయకుడుగా ఆయన చేసే ప్రసంగాలు హాస్యోక్తులతో చతురోక్తులతో శాసనసభ్యులను నవ్వులలో ముంచెత్తేవి.

ఇదే ఇంగ్లాండులో అయితే...

ఒకసారి డాక్టర్ సి. ఆర్. రెడ్డి అప్పటి మద్రాసు ముఖ్యమంత్రి అయిన పానగల్లు రాజాను ఆయన ప్రభుత్వ పనితీరును తీవ్రంగా విమర్శిస్తూ వుండగా సహనం కోల్పోయిన ముఖ్యమంత్రి పానుగల్లు రాజా తనకు సి. ఆర్. రెడ్డి వ్రాసిన కొన్ని వ్యక్తిగత ఉత్తరాలను బయట పెట్టగలనని బెదిరించారు. అప్పుడు చటుక్కున డాక్టర్ రెడ్డి అందుకుని "ఇదే

ఇంగ్లాండులో అయితే ప్రేయసీ ప్రేమికులు పోట్లాడుకున్నప్పుడు ఎవరి ఉత్తరాలు వారు వాపసు ఇచ్చేసుకుంటారు." అనగానే సభ్యులతోపాటు ముఖ్యమంత్రి పానుగల్లు రాజాకూడా నవ్వక తప్పలేదు.

## చతుర్విధ పురుషార్థాలు

ఏలూరులో ఒక కళాశాల ప్రారంభించే శుభ సందర్భం అది. ఆ నాటి సభకు డాక్టర్ సి. ఆర్. రెడ్డి అధ్యక్షత వహించారు. సభను శ్రీ బెజవాడ గోపాలరెడ్డి ప్రారంభిస్తూ కళాశాలలు చతుర్విధ పురుషార్థాలను బోధించేవిగా వుండాలని హితవు చెప్పారు. ఆ తర్వాత మాట్లాడిన డాక్టర్ సి. ఆర్. రెడ్డి, శ్రీగోపాలరెడ్డి చెప్పిన హితవును ప్రస్తావిస్తూ ఈవిధంగా అన్నారట. "చతుర్విధ పురుషార్థాలంటే ధర్మ,అర్థ, కామ, మోక్షములేగదా? మేము రోజూ ధర్మసూత్రాలను బోధించుచునే వున్నాం. కాలేజీ విద్య పిదప ప్రతివిద్యార్థి "అర్థము"డబ్బు కోసం ఎలాగూ ఎగబడుతూనే వున్నాడు. ఇక మూడవది కామము. దీన్ని గురించి మేము కాలేజీలో చెప్పడం ప్రారంభిస్తే ఎంతమంది తల్లిదండ్రులు వారి పిల్లల్ని మా కాలేజీకిపంపుతారో చెప్పలేం. ఇక ఆఖరిదైన మోక్షం గురించి చెప్పడం మొదలు పెడితే మాకు కపాల మోక్షం తప్పదు" అనగానే సభలోని యావన్మందీ పగలబడి నవ్వారట.

## "బ్రహ్మచారినైనా స్త్రీలగురించి ఎక్కువ నాకే తెలుసు"

ఒక సభలో బ్రహ్మచారి అయిన డాక్టర్ రెడ్డిగారిని హనుమంతుని తోనూ, వినాయకునితోను, భీష్మునితోను పోల్చడం జరుగగా వెంటనే రామలింగారెడ్డిగారు లేచి సమాధానంగా "అయ్యా నన్ను లేనిపోని విశేషణా లతో ఎందుకు పొగుడుతారు? బ్రహ్మచారి అయిన నాకు స్త్రీలగురించి గృహస్థుల కంటే ఎక్కువ తెలుసు" అన్నారట కొంటెగా.

మద్రాసులో ఒకానొక రాజకీయ సభలో కట్టమంచివారు ప్రసంగిస్తూ వుండగా, ఆయనపై కొంతమంది రాళ్ళు వేయడం జరిగింది. రాళ్ళు వేసింది జస్టిస్ పార్టీవారని ఆయన అనుమానం. తన అనుమానాన్ని ఆయన హాస్యంతో కలిపి "జస్టిస్ పార్టీవారు ఇంకా రాతియుగంలోనే వున్నారనటానికి ఇదే నిదర్శనం" అని చమత్కరించడంతో సభికులంతా గొల్లున నవ్వారట.

## హనుమంతుడి భోజనం

ఒకసారి లండన్‌లో డాక్టర్ సి. ఆర్. రెడ్డి ఒక విందులో పాల్గొన్నారు. ఆ విందులో యాపిల్ పండ్లను పాశ్చాత్య పద్ధతిలో కత్తులు, ఫోర్కులు ప్రయోగించి తినడం కష్టంగా తోచింది రెడ్డిగారికి, కాని అలా తినకపోతే తన పాశ్చాత్య మిత్రులు నవ్వుతారు. అప్పుడు ఆ సందిగ్ధావస్థ నుంచి బయటపడటానికి ఒక తమాషా చేశారు డాక్టర్ రెడ్డి "మిత్రులారా! మా దేశంలోని రామాయణగాథలో హనుమంతుడు పండ్లను ఈ విధంగా తినేవాడు" అంటూ యాపిల్ పండును నోటికి అప్పగించారు.

రెడ్డిగారి ప్రథమ ప్రేమసత్యనహారం విఫలంకావటంతో జీవితాంతం బ్రహ్మచారిగానే వుండిపోయారట. వివాహంగురించి ఆయన చమత్కారంగా "పెళ్ళి ఒక పంజరం. ఆ పంజరం బయటవుండేవారు లోపలికి పోవాలని ప్రయత్నిస్తారు. ఆ పంజరం లోపలివారు బయటకు రావాలని ప్రయత్నిస్తుంటారు. కాబట్టి నేను ఆ పంజరంలోకి పోవటమెందుకు? తిరిగి బయటకు రావాలని ప్రయత్నించటమెందుకు?" అనేవారు

ఒకసారి మనదేశ ప్రజలను గురించి కట్టమంచి వ్యంగ్యంగా "మనం మాటకుమాటిగా ఏక్వటం నేర్చుకున్నాంగాని అందరం కలిసి పనిచెయ్యటం నేర్చుకోలేదు" అన్నారు.

## నరుడు - వానరుడు

ప్రముఖ న్యాయవాది, భారత రాజ్యాంగ రచయితలలో ఒకరైన అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ షష్టిపూర్తి ఉత్సవం జరుగుతోంది. అయ్యర్‌గారి ఆకారం కొంచెం వింతగా ఉండేది. ఇది మనస్సులో పెట్టుకొని ఆ సందర్భంగా ప్రసంగిస్తున్న సి.ఆర్.రెడ్డి హాస్యంగా "మన అయ్యర్‌గారు వానరుడికి, నరుడికి మధ్య తెగిన లింకు" అనగానే అయ్యర్‌గారితోసహా సభాసదులంతా పగలబడి నవ్వారట.

ఒకసారి కట్టమంచి పెట్టె, బెడ్డింగులతో విజయవాడ రైలుస్టేషన్‌లో దిగి ఎవరికోసమో ఎదురుచూస్తున్నారు. ఏమైనా వార్తలు దొరుకుతాయేమోనని పత్రికావిలేఖర్లు ఆయనవద్దకు వెళ్ళి "అయ్యా, మేము ప్రెస్ రిపోర్టర్లం వార్తలు ఏమైనా చెబుతారా? అనగానే ఆయన చటుక్కున "నేను పోర్టర్స్‌కోసం ఎదురుచూస్తున్నాను. రిపోర్టర్స్‌కోసం కాదు" అన్నారు.

ఒకమారు కట్టమంచికి సన్మానంచేద్దామని నెల్లూరు రైల్వేస్టేషన్ నుంచి టౌనుహాలుకు మేళతాళాలతో ఊరేగింపుగా తీసుకువెళ్ళుతూవుండగా ఆయన యథాప్రకారం హాస్యంగా "మీరు నాకిలాంటి మర్యాదలు ఎందుకు చేస్తున్నారో అర్థంకావటంలేదు. నేను మంత్రినికాదు, పెళ్ళికొడుకునంత కన్నాకాను, కనీసం శవాన్నికూడాకాదే!" అన్నారు.

## ఏప్రిల్ - 1

ఆంధ్రదేశంలో ముగ్గురు ప్రతిభావంతులున్నారు. దుగ్గిరాల గోపాలకృష్ణయ్య ప్రథమశ్రేణి ప్రతిభావంతుడు. కాని ఆయన జీవితంలో తృతీయశ్రేణిలో విజయం సాధించాడు. నేను ద్వితీయ శ్రేణి ప్రతిభావంతుణ్ణి అందువల్ల నా జీవితంలో సగం జయం మిగతాసగం అపజయం

పోయింది. అందుకు సమయస్ఫూర్తిగా "చీకటిలో మాట్లాడటం నాకు అల వాటులేదు నేను బ్రహ్మచారిని గద"అని కూర్చున్నారట టక్కున.

మరొకసారి ఒక సమావేశం ప్రారంభిస్తూ ప్రతివారూ ప్రసంగించ టానికి ముందు "సోదర సోదరీ మణులారా"అని మొదలు పెడతారుగదా అందరూ ఒక గనిలోని వారేగదా. అటువంటప్పుడు స్త్రీలను సోదరీ మణులు అనటం ఏమిటి? ఈ మణులేమిటి?" అని హాస్యంగా ప్రసంగం ప్రారంభించారట.

చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారికి సన్మానసభ జరుగుతోంది. ఆ సభకు కట్టమంచి వారు అధ్యక్షులు. కట్టమంచివారు అధ్యక్షోపన్యాసం ఇస్తుండగా శాస్త్రిగారు మాట మాటకి ఏదో చెప్పబోయేవారు. అట్లా మాట్లాడవద్దని సూటిగా అనలేక "శాస్త్రిగారికి జంట కవిత్వం చెప్పే అలవాటు ఇంకా పోలేదని" ఒక చురక తగిలించారు.

## దోషాలు - దోపిడీలు

రెడ్డిగారు ఒక సందర్భంగా స్త్రీ పురుషుల గురించి ఈ విధంగా అంటారు. పురుషుడు దోషాలు (Blunders) చేయటానికి పుట్టగా స్త్రీ దోపిడీలు (Plunders) చేయటానికి జన్మించింది. భర్తలకు తప్పుచేసే దివ్యమైన హక్కువుంది. భార్యలకు ఆ తప్పులను క్షమించే సహజ దౌర్బల్యం వుంది.

ఒకసారి రెడ్డిగారిలా అంటారు. మనం ఒకవిషయం మర్చిపోరాదు. ఎవరేమనుకున్నా వ్యాసుని అక్రమ సంతానమే భారతజాతికి మూలపురుషులు. ఆ వ్యాసుడు అస్పృశ్య పతిత స్త్రీ కుమారుడు. ఈ మాట మర్చిపోయి లేనిపోని డాబులు చెప్పుకోవటం మంచిదికాదు.



ప్రధాని 'దర్జా' వెలగబెట్టిన

# అబుల్ కలాం అజాద్

కేంద్ర ప్రభుత్వ మాజీ మంత్రి మౌలానా అబుల్ కలాం అజాద్



మహాపండితుడు. తియ్యని ఉర్దూ భాషలో ధారాళంగా మాట్లాడుతూ వుండేవారు. కొరాన్‌పై అయన వ్రాసిన వ్యాఖ్యానం ప్రపంచ ప్రసిద్ధి పొందింది. అజాద్ పార్లమెంట్‌లో అరుదుగా మాట్లాడుతూ వుండేవారు. అయితే ఆయన మాట్లాడినప్పుడు మాత్రం సభ లోని కుర్చీలన్నీ నిండిపోయేవి.

## అరగారగా మద్యం, సమోసాలు

అజాద్‌కు మద్యపానం అలవాటు జాస్తిగా వుండేది. జైలులో వున్నప్పుడు కూడా అది మానేవారు కాదు; ఏదో ఒక రకంగా తెప్పించుకుని త్రాగుతూ వుండేవారు. ఈ సంగతి కొంతమంది గాంధీజీకి ఫిర్యాదు చేసినా గాంధీజీతో "త్రాగడం లేద"ని బుకాయించేవారు అజాద్.

ఆయన ఒంటరిగా తన రూంలో కూర్చొని అరగారగా మద్యం సేవిస్తూ సమోసాలు తింటూ వుండేవారు. అందువల్లనే ఆయన సాయంత్రం ఏ డిన్నరు పార్టీకి వెళ్ళినా డిన్నరు కాగానే ఎవరితో చెప్పాచెయ్యకుండా చల్లగా జారుకొని తన ఇంటికిపోయి మద్యం సేవిస్తూ కూర్చునేవారు. ఒకోసారి తప్పత్రాగి పడిపోతూ వుండేవారు. ఆ విధంగా పడినప్పుడు ఒకసారి నడుం విరగడం, అపరేషన్‌చేసి స్టీలు ప్లేటు వేయడంకూడా జరిగింది.

## సమర్ధతకు గీటురాయి

ఒకసారి అజాద్ పశ్చిమ జర్మనీ పర్యటనకు వెళ్ళారు. అప్పుడు అక్కడ మన రాయబారిగా పనిచేస్తున్న ఏ. సి. నంబియార్ ఆజాద్ అల వాట్లు బాగా ఎరిగినవాడు కావడంచేత ఆయన బసచేసిన రూంనిండా ఖరీదైన మద్యం సీసాలు అమర్చాడు. అజాద్‌కు అమితంగా ఇష్టం అయిన షాంపైన్ సీసాలు అధికంగా పెట్టాడు.

నంబియార్ ఏర్పాటుచేసిన విందులో సుష్టుగా తిని మిగతా ప్రముఖ అతిధులవద్ద సెలవుకూడా తీసుకోకుండా చల్లగా తన బసలోకి పోయి తాపీగా సీసాలు ఖాళీ చేశారట! అంతేగాక తన పర్యటన ముగించుకువచ్చిన తర్వాత మన విదేశీ రాయబారులందరిలోకి ఏ. సి. నంబియూర్ అత్యంత సమర్ధుడని కితాబు ఇచ్చాడు నంబియారుకు.

## ప్రధాని దర్జా

ఒకసారి పండిట్ నెహ్రూ బ్రిటన్ పర్యటనలో వుండగా అజాద్ ప్రధాని నెహ్రూ అనుమతి లేకుండానే తాను తాత్కాలిక ప్రధానినని ప్రక టించుకున్నారు. అంతటితో ఆగకుండా పైలట్ మోటారుసైకిల్ తన కారు ముందుంచుకొని వెనకాల పోలీసు బందోబస్తుతో ప్రధాన మంత్రిలాగా వ్యవహారించేటప్పటికి క్యాబినెట్ సెక్రటరీ ఈ విషయం తక్షణం పర్యట నలోనున్న ప్రధాని నెహ్రూకు ఫోనులో తెలియజేశాడు. పండిట్‌నెహ్రూ ఇందుకు చికాకుపడి తాను ఎవరినీ తాత్కాలిక ప్రధానిగా నియమించలేదని, ఇందుకు సంబంధించి వెంటనే ఒక ప్రకటన జారీ చేయవలసిందని ఫోను లోనే సమాధానం చెప్పారట. దాంతో పాపం అజాద్ హతాశుడయ్యారు.

## బోళా మనిషి

అయితే అజాద్ చాలా బోళామనిషి. మనస్సులో వున్నమాట దాచు కునేవాడుకాదు. ఆయనకు రవ్వంత మతాభిమానంకూడా వుండేది. ఎన్నిక

అలో ముస్లిం అభ్యర్థులకు ఎక్కువ సీట్లు సంపాదించడం కోసం తంటాలు పడుతూ వుండేవారు. అది 1952 ఎన్నికల సమయం. ఆనాటి కాంగ్రెసు కార్యదర్శి యు. ఎస్. మల్లియ్యవద్దకు ముస్లిం పేరులుగల చీటీలు తీసుకు వెళ్ళి వారికి టిక్కెట్లు ఇప్పించవలసిందని వేధిస్తూ వుండేవారు అజాద్.

ఈ బాధపడలేక ఒకసారి మల్లియ్య, కామరాజ్ కలసి ఒక ఎత్తు వేసి అజాద్‌ను చిత్తు చేశారట.

అదేమంటే తమిళనాడు కాంగ్రెసు అభ్యర్థుల లిస్టు పరిశీలనలో వుంది. మల్లియ్య సలహాపై కామరాజ్ లిస్టు మొదటి దఫా పరిశీలనలో గైరు హాజరయ్యారు. ఒక నియోజక వర్గం అభ్యర్థులను పరిశీలిస్తూ యు. ఎస్. మల్లియ్య తన ప్రక్కనేవున్న అజాద్‌తో "ఈ నియోజకవర్గంలో దరఖాస్తు చేసిన వారెవ్వరూ నాకు నచ్చలేదు. ఒక ముస్లిం అభ్యర్థిని పెడితే బాగుంటుంది" అనగానే అల్పసంతోషి, బోళామనిషి అయిన అజాద్ సంబర పడుతూ, "నిజమే, నిజమే అలా చేస్తేనే బాగుంటుంది" అన్నారు.

"మరి ఎవరి పేరైనా చెప్పండి" అన్నారు మల్లియ్య. సమయానికి తన దగ్గర పేర్లు లేకపోవడంతో "మీరే ఒకరిని నిర్ణయించండి" అన్నారు అజాద్ మల్లియ్యతో. అదనుకోసం ఎదురుచూస్తున్న మల్లియ్య ఒక పేరును సూచించారు. ముస్లిం అభ్యర్థిని నిర్ణయించినందుకు అజాద్ కొండెక్కినంత సంతోషించారు మల్లియ్యను ఎంతగానో మెచ్చుకున్నారు.

ఆ సాయంత్రం లిస్టు రెండవసారి పరిశీలనలో కామరాజ్ కూడా హాజరయ్యారు. మల్లియ్య సూచించిన ముస్లిం అభ్యర్థి పేరు చూసిన కామరాజ్ "ఇదేమిటి? ఈ పేరు గలాయన చనిపోయి 30 ఏళ్ళుఅయింది కదా!" అనేటప్పటికి కూడబలుక్కుని ఎత్తువేసిన కామరాజ్, మల్లియ్య మినహా సమావేశంలో మిగతా వారంతా గొల్లున నవ్వారట. పాపం అజాద్ వెర్రిమొఖం వేశారట.



మనోవర్తిదావా ద్వారా
స్త్రీల హక్కుల పోరాటానికి
శ్రీకారంచుట్టిన

# విజయలక్ష్మి పండిట్

జవహర్‌లాల్ నెహ్రూ సోదరి విజయలక్ష్మి పండిట్ వివాహ సందర్భంగా జరిగిన సంఘటన ఇది! సాధారణంగా కాశ్మీరీ బ్రాహ్మణ



కుటుంబాలలో ఆడపిల్లలు పెళ్ళిలో లేతగులాబి రంగు వస్త్రాలు, బంగారు ఆభరణాలు ధరించటం రివాజు అయితే గాంధీజీ దానికి సమ్మతించలేదు. పెళ్ళి కుమార్తెకు గులాబి రంగు చీరకు బదులు తెల్లని ముతక ఖద్దరుచీరకట్టాలనీ,అంతేగాకఆమెకు బంగారునగలు పెట్టవద్దని మోతీలాల్ నెహ్రూకు ఉత్తరం రాశారు.

## చాదస్తపు గాంధీ

ఆ ఉత్తరం చూడటంతోనే మోతీలాల్ భార్య గాంధీజీమీద మండి పడ్డారు. అంతకు పూర్వం నుంచే గాంధీజీ పద్ధతులు ఆవిడకేమీ నచ్చటం లేదు. దీంతో మరీ రెచ్చిపోయి "అయినా ఈ గాంధీ ప్రతివాళ్ళలోనూ తనమాటే సాగాలనటం ఏమిటి? మన కుటుంబంమీద పెత్తనం చేయటానికి ఆయనెవరు? పెళ్ళికూతురు తెల్లచీర ధరించటం ఎంత అశుభం! పైగా

ఆభరణాలు కూడా వద్దంటాడా? అదేం వీల్లేదు. మన అమ్మాయి పెళ్ళి మనఇష్టప్రకారం సాంప్రదాయిక పద్ధతిలోనే జరగాలి" అని మోతీలాల్‌తో ఖచ్చితంగా చెప్పేసింది.

అసలు మోతీలాల్‌కు కూడా పెళ్ళికూతురు తెల్లచీర ధరించాలనటం నచ్చలేదు. ఆరోజుల్లో తెల్లచీరను వితంతువులు మాత్రమే కట్టుకునేవారు. అందువల్ల ఆయనకు కూడా ఆ పద్ధతి ఇష్టంలేక గాంధీజీ సూచనకు తన అయిష్టాన్ని తెల్పుతూ ఉత్తరం రాశారు.

అయితే గాంధీజీ తనపట్టు విడవకుండా దానికి సమాధానం రాశారు. ఆవిషయమై వారిద్దరిమధ్య కొన్ని ఉత్తరాలు నడిచాయి. ఎవరూ తమ అభిప్రాయాన్ని మార్చుకోలేదు. ఎవరి అభిప్రాయానికి వారు కట్టుబడి వుండటంతో సమస్య పరిష్కారం కాలేదు.

## కస్తూరిబా సూచించిన పరిష్కారం

వారి పట్టుదలలు అలావుండగా గాంధీజీ భార్య కస్తూరిబా సమయస్ఫూర్తితో ఒక పరిష్కారమార్గం సూచించారు. అందుకు అందరూ అంగీకరించారు. దానిప్రకారం కస్తూరిబా స్వయంగా తయారుచేసిన ఖద్దరుచీరకు గులాబీరంగు అద్దకం వేయించి పెళ్ళిలో విజయలక్ష్మి పండిట్‌తో కట్టించారు. బంగారునగలకు బదులు రకరకాల పూలతో ఆమెను అలంకరించారు. వివాహం నిరాడంబరంగా జరిగింది. ఆ పెళ్ళికి అతిథులు దేశం నలుమూలల నుంచీ వచ్చారు. గాంధీజీతోసహా దేశనాయకులందరూ పెళ్ళికి విచ్చేశారు!

## మనోవర్తి దావా

పండిట్ నెహ్రూ సోదరి శ్రీమతి విజయలక్ష్మి పండిట్ భర్త రంజిత్ పండిట్ కారాగార క్లేశం వల్ల అకస్మాత్తుగా మరణించడంజరిగింది. రంజిత్ పండిట్ ఆకస్మాత్తుగా పోవటం వలన వీలునామా కూడా ఏమీ వ్రాయటం జరగలేదు. అందువల్ల వితంతువైన శ్రీమతి విజయలక్ష్మి

పండిట్‌కు అనేక ఇబ్బందులు వచ్చిపడ్డాయి. అప్పటికే తండ్రి మోతీలాల్ నెహ్రూ చనిపోవడం, పండిట్ నెహ్రూ జైలులో వుండడంతో శ్రీమతి విజయలక్ష్మికి దిక్కుతోచని పరిస్థితి ఏర్పడింది.

## నెలకు 150 మాత్రమే

ఆనాటి న్యాయ చట్ట ప్రకారం వితంతువులకు ఉమ్మడి కుటుంబం ఆస్తిలో ఏ మాత్రం హక్కు వుండేది కాదు. ఈ అవకాశం చూసుకొని విజయలక్ష్మి పండిట్ మరిది (రంజిత్ పండిట్ తమ్ముడు) ప్రతాప్ రంజిత్ అన్న చనిపోయిన వెంటనే శ్రీమతి విజయలక్ష్మికి ఒక రిజిష్టరు ఉత్తరం వ్రాస్తూ ఆమెకు తమ ఉమ్మడి ఆస్తిలో ఏ విధమైన వాటా హక్కు లేదని, తన తండ్రి పోతూ వ్రాసిన వీలునామా ప్రకారం కోడలు విజయలక్ష్మికి నెలకు 150 రూపాయలు మాత్రమే ఇచ్చే ఏర్పాటు చేశారని అంతకుమించి ఆమెకు వచ్చేదేమీ లేదనీ చెప్పాడు. ఉత్తరంతోపాటు తన తండ్రి వ్రాశాడని చెబుతున్న వీలునామా కాపీని కూడా జత పర్చాడు.

ఈ ఉత్తరం చూచుకొని శ్రీమతి విజయలక్ష్మి పండిట్ హతాశురాలయింది. మామూలుగా తను పెడుతున్న ఖర్చులన్నింటిని తగ్గించి వేసుకుంది. ఇంట్లో నౌకర్లను తీసివేసింది. పచారి కొట్లో బాకీ కొద్దిరోజుల్లో సర్దుతానని నచ్చ జెప్పుకుంది. ఇంటి అద్దె బాకీ నిదానంగా సర్దగలనని యజమానిని బ్రతిమలాడుకుంది. ఆ విధంగా ఆవిడ సంవత్సరం పాటు దుర్భర దరిద్రాన్ని అనుభవించింది.

## కోర్టుకెక్కిన వీలునామా

ఈ లోగా శ్రీమతి విజయలక్ష్మి తమ కుటుంబ స్నేహితుడు, శ్రేయోభిలాషి అయిన ప్రఖ్యాత న్యాయవాది, రాజ్యాంగ నిపుణుడు సర్ తేజ్ బహదూర్ సప్రూతో సంప్రదింపులు ప్రారంభించింది. సప్రూ ఆవిడ

పట్ల ఎంతో సానుభూతి చూపించారు. అయినా ఇప్పుడున్న న్యాయ చట్టం ప్రకారం మనం ఏమీ చేయలేమని, వితంతువులకు ఉమ్మడి కుటుంబంలో ఏ మాత్రం హక్కులు లేవని చెబుతూ "మీ మామగారు వ్రాసినట్లు చెబుతున్న వీలునామాను కోర్టులో సవాలుచేసి చూద్దాం. ఈ దావా గెలుస్తుందని నాకు ఆశలేదు. అయినా నీకోసం, ధర్మం కోసం నేను ఈ కేసును జిల్లా కోర్టులో వాదించటానికి సిద్ధపడుతున్నాను" అన్నారు.

వీలునామాను కోర్టులో సవాలు చేశారు. హైకోర్టు, సుప్రీంకోర్టులలో తప్ప క్రింద కోర్టులకు రావడం అలవాటు లేని సర్ తేజ్ బహాదూర్ సప్రూ జిల్లా కోర్టుకు హాజరయ్యారు. కాని దావా ఓడిపోవడం మాత్రమే జరిగింది. అయితే శ్రీమతి విజయలక్ష్మి కోర్టులో ఓడిపోయినా ఆవిడ వాదనకు దేశమంతటా మద్దతు లభించింది. అనేక పత్రికలు వ్యాసాలు, సంపాదకీయాలు వ్రాసి వితంతువులకు న్యాయం చేయాలని, స్త్రీకి ఆస్తి హక్కులు వుండేలా చేయాలని,న్యాయ చట్టాలు మార్చాలని ఘోషించాయి. మహిళా సంఘాలన్నీ తీర్మానాలు చేసి స్త్రీలకు ఆస్తి హక్కు కల్గించాలని డిమాండ్ చేశాయి. ఈ విధంగా శ్రీమతి విజయలక్ష్మి మనోవర్తి దావా స్త్రీల హక్కుల పోరాటానికి నాందీవాచకం పలికింది.

## మధ్యవర్తుల రాయబారము

ఈ లోగా అనేక మంది మధ్యవర్తులు శ్రీమతి విజయలక్ష్మి మరిది ప్రతాప్ వద్దకు వెళ్ళి ఆమెకు "న్యాయంగా" కాకపోయినా "ధర్మంగా" రావలసిన వాటా అయినా ఇవ్వవల్సిందిగా అర్థించారు. అయినా ప్రతాప్ మనస్సు కరగలేదు. ఈ స్థితిలో గాంధీజీ కలుగచేసుకొని ప్రతాప్‌ను తన వద్దకు వచ్చి మాట్లాడవలసిందిగా కబురు పెట్టారు. ప్రతాప్ గాంధీజీని కలుసుకోవడానికి నిరాకరించడమే కాక తన అన్న చనిపోవడానికి గాంధీజీయే కారణమని నానా దుర్భాష లాడాడు. దానితో ఆ రాయబారం కూడా విఫలమయింది.

అఖరిసారిగా నెహ్రూ కుటుంబానికి, రంజిత్ కుటుంబానికి కావలసిన కొంతమంది న్యాయవాదులు సమావేశమై ప్రతాప్ వద్దకు మరోసారి రాయబారం వెళ్ళాలని, ఈ సారి కూడా అతడు లొంగిరాకపోతే దావాను హైకోర్టుకు దాఖలు చేయాలని నిర్ణయించారు. ఆ విధంగానే వారు ప్రతాప్ వద్దకు వెళ్ళి ఎన్నో విధాల నచ్చజెప్పిన మీదట ఎట్టకేలకు రంజిత్ పండిట్ స్వయంగా సంపాదించుకున్న ఆస్తిని మాత్రం శ్రీమతి విజయలక్ష్మికి ఇవ్వడానికి అంగీకరించాడు. ఉమ్మడి ఆస్తిలో ఒక్క పైసా కూడా ఇవ్వనని భీష్మించాడు. వెళ్ళిన రాయబార వర్గం కూడా చేసేదిలేక—హైకోర్టుకు వెళ్ళినా దావా గెలవదనే భయంతో ప్రతాప్ ఇవ్వజూపినదానికే అంగీకరించింది. గాంధీజీ కూడా అందుకు సమ్మతించారు. శ్రీమతి విజయలక్ష్మి పండిట్ అంతటితోనే తృప్తి పడవలసి వచ్చింది.

## "చూడుబాబూ పెళ్ళెప్పుడు చేసుకుంటావ్"

శ్రీమతి విజయలక్ష్మి పండిట్ ఒక్కొక్కప్పుడు దౌత్యమర్యాదలు పాటించేవారుకారు. వెంటనే చేసిన పొరపాటు తెలుసుకొని నాలుక్కొరుచుకునేవారు.

ఒకసారి వేల్సుయువరాజు నేపాల్ రాజు పట్టాభిషేకానికి వెళుతూ ఢిల్లీ వచ్చారు. ఆ సందర్భంగా రాష్ట్రపతి ఆయన గౌరవార్థం విందు ఏర్పాటుచేశారు. విందులో వేల్సుయువరాజు ప్రక్కనే కూర్చున్న శ్రీమతి విజయలక్ష్మి పండిట్ యువరాజుతో "చూడుబాబూ పెళ్ళెప్పుడు చేసుకుంటావ్?" అని చటుక్కున అనేసి ఆ వెంటనే దౌత్యమర్యాదలకు భిన్నంగా ప్రవర్తించినట్లు తెలుసుకొని "క్షమించండి. తొందరపడి వాగేశాను. మీ పెళ్ళికి రావాలనే కాంక్షతో తొందరపడ్డాను" అన్నారు. సహజంగానే హాస్యధోరణిలో ఉండే యువరాజు "మరేం పర్వాలేదు. మీరేం తప్పుమాట్లాడలేదు" అంటూ నవ్వేశారట.

# వంటవాడు తెచ్చిన తంటా

శ్రీమతి విజయలక్ష్మి పండిట్ సోవియెట్ యూనియన్‌లో కొంత కాలం మన రాయబారిగా వున్నారు. బుదీలాల్ అనే హరిజనుడు ఆవిడకు మొదట్నుంచీ వంటచేసి పెడుతూ వుండేవాడు. అతను చేసే వంటలపట్ల ఆమె ఎంతో మక్కువ చూసేవారు. మాస్కోకు వెళుతూ బుదీలాల్‌ను కూడా ఆవిడ వెంట తీసుకుని వెళ్ళడం జరిగింది.

సోవియట్ దేశం బుదీలాల్‌ను ఎంతో ఆకర్షించింది. హెచ్చు తగ్గులు లేని అక్కడి సమాజం అతగాడ్ని ఎంతో ఆకట్టుకుంది. బుదీలాల్ అచ్చట రష్యన్ భాష కూడా నేర్చుకొని అనేక మంది సోవియట్ పౌరులతో కూడా స్నేహం కట్టాడు.

శ్రీమతి విజయలక్ష్మి సోవియట్ రాయబారిగా పదవీ విరమణ చేయడంతో బుదీలాల్ కూడా ఢిల్లీకి తిరిగివచ్చాడు. రాగానే కొంత మంది పత్రికా విలేకర్లు బుదీలాల్‌ను ఇంటర్వ్యూ చేయగా సోవియట్ దేశం గురించి ఆకాశానికెత్తుతూ శ్లాఘించడం జరిగింది.

తదుపరి శ్రీమతి విజయలక్ష్మిని అమెరికాలో మన రాయబారిగా నియమించారు. అప్పట్లో అమెరికా వారికి సోవియట్ రష్యా వారికి మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గున మండేది. కమ్యూనిస్టులన్నా, కమ్యూనిస్టు అభిమానులన్నా అమెరికావారు విపరీతంగా ద్వేషించేవారు. ఈ పరిస్థితులలో శ్రీమతి విజయలక్ష్మి వెంట బుదీలాల్ వెళ్ళడానికి ఢిల్లీలోని అమెరికా రాయబార కార్యాలయం వారు ససేమిరా అంగీకరించలేదు. బుదీలాల్ పచ్చి కమ్యూనిస్టని, అతడ్ని తనదేశంలో అడుగు పెట్టనీయమని వాదించారు. శ్రీమతి విజయలక్ష్మి ఎంత నచ్చచెప్పినా అమెరికా వారు బుదీలాల్ తమ దేశం రావడానికి సమ్మతించలేదు. పాపం బుదీలాల్ అమెరికా ప్రయాణం ఆగిపోవడమే కాక శ్రీమతి విజయలక్ష్మి అమెరికాలో సరైన వంటవాడు దొరక్క నానా ఇబ్బంది పడవలసి వచ్చింది. ★

గురకలు పెట్టే వాలంటీర్ నుంచి
కాంగ్రెసు అగ్రనాయకుడిగా ఎదిగిన

# కామరాజ్

దేశానికి స్వాతంత్ర్యం రాక ముందు సంగతి ఒకసారి. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ మద్రాసు వచ్చినప్పుడు అప్పటి మద్రాసు అసెంబ్లీలో కాంగ్రెస్ పక్షం నాయకుడైన సత్యమూర్తిగారింట్లో బసచేశారు. ఆ రాత్రి పండిట్ నెహ్రూ మంచం ప్రక్కనే ఒక కాంగ్రెస్ వలంటీర్ నేలపై పడుకున్నాడు. ఆ వలంటీర్ పెట్టే గురకలతో ఆ రాత్రి పండిట్జీకి నిద్రపట్టింది కాదు.



చిరాకెత్తిన పండిట్ నెహ్రూ లేచి సత్యమూర్తిని పిల్చి "ఈ వలంటీర్‌ను ఇక్కడ నుంచి గెంటివేయండి" అంటూ కేకలేశారట. ఆ వలంటీర్ ఎవరో కాదు శ్రీ కామరాజ్ నాడార్.

## "ఈయనతల్లి సిరాబుడ్డిలాగా వుండేది కాబోలు"

నేరేడుపండు నలుపుగా వుండే కామరాజ్‌ను మొదటిసారిగా చూచిన ఒకనాక అమెరికన్ విలేఖరి హాస్యంగా "అబ్బా! ఈయనే ఇంత నల్లగా వున్నాడు-ఈయనగారి తల్లి సిరాబుడ్డిలాగా వుంటుంది కాబోలు" అన్నారట.

## పుష్కలంగా దేహశుద్ధి

కాంగ్రెస్ నాయకులు కామరాజ్ తమిళనాడులోని విరుద్‌నగరంలో నిరుపేద కుటుంబంలో జన్మించారు. కామరాజ్‌ను 5 సంవత్సరాల వయస్సులో బడిలో చేర్పించడం జరిగింది. ఆయన మొట్టమొదటి ఉపాధ్యాయుని పేరు వేలాయుధన్. అయితే ఆయన్ని కోలాయుధన్ అని పిలిచేవారట. ఎందువల్లనంటే ఆయన దండనీతి పిల్లలకు సింహస్వప్నంగా వుండేది. ప్రతి చిన్న తప్పుకూ చితకబాదుతూ వుండేవారట.

ఇక బాల కామరాజ్ చదువులో కొంచెం మందంగా వుండడంతో దేహశుద్ధి పుష్కలంగా జరిగేది. దాంతో కామరాజ్ ఆ పంతులుగారి వద్ద చదవనని మారాం చేయడంతో మరొక పంతులుగారి వద్ద చేర్పించడం జరిగింది. ఆ చదువు కూడా ఎక్కువకాలం సాగలేదు.

## పెళ్ళిచేస్తేగాని తిక్క కుదరదు

శ్రీ కామరాజ్‌కు చిన్నప్పటి నుంచి రాజకీయాలు తప్ప మరే ధ్యాసా వుండేదికాదు. కుటుంబ విషయాలు అసలు పట్టించుకునేవారుకాదు. కాంగ్రెస్ జెండా పుచ్చుకుని జనాన్ని వెంటేసుకు తిరగడం తప్ప మరో సంగతి పట్టించుకునేవారు కాదు. ఆయన కుటుంబ పెద్దలు పెళ్ళిచేసి ఒక ఇంటివాడ్ని చేస్తేనేగాని తిక్క కుదరదని సంబంధాలు చూడడం ప్రారంభించారు.

అయితే, కామరాజ్ "పెళ్ళిమాట ఎత్తారంటే నేను మళ్ళీ ఈ ఇంట్లో అడుగు పెట్ట" నని భీష్మించడంతో కామరాజ్ పట్టుదల ఎరిగిన కుటుంబ పెద్దలు ఆ ప్రయత్నం విరమించారు. ఆ విధంగా శ్రీ కామరాజ్ ఆజన్మాంతం బ్రహ్మచారిగానే వుండిపోయారు

# నిదానమే ప్రధానం

శ్రీ కామరాజ్ చిన్నప్పటి నుంచీ కూడా దేనికీ తొందరపడేవారు కాదు. తనకు రావల్సిందేదో తన వద్దకు వచ్చేదాకా నింపాదిగా వుండే వారు. చిన్ననాటి ఒక సంఘటన ఇందుకు నిదర్శనంగా చెప్పుకోవచ్చు.

ఆయన చదువుకునే రోజులలో ఒకసారి వినాయక చవితి సందర్భంగా దేవాలయంలో ప్రసాదం కోసం పిల్లలందరూ ఎగబడి త్రొక్కిసలాటకు దిగగా కామరాజ్ మాత్రం తాపీగా త్రొక్కిసలాట అయ్యే వరకు నింపాదిగా వేచి వుండి అందరూ వెళ్ళిపోయిన తర్వాత పూజారి వద్దకు వెళ్ళి ఇక మిగిలిన కొద్ది ప్రసాదం మాత్రమే పెట్టించుకుని సంతృప్తి పడ్డారు. ఇదే స్వభావం ఆయన జీవితాంతం కానవస్తుంది. ఆయన ఏ పదవికోసం ఆతృతపడినట్టు కానరాదు ఆ పదవులే అయన వద్దకు వెతుక్కుంటూ వచ్చేదాకా ఆయన నింపాదిగా వుండినట్టు మనకు కానవస్తుంది.

## కామరాజ్ రాజాజీ

శ్రీ కామరాజ్‌కు, రాజాజీకి ఎప్పుడూ పడేది కాదు. ప్రత్యర్థులుగా వుండేవారు. అయినా శ్రీ కామరాజ్‌కు రాజాజీ అంటే వల్లమాలిన అభిమానం వుండేది. ఎన్నడూ రాజాజీని వ్యక్తిగతంగా విమర్శించేవారు కాదు.

ఒకసారి రాజాజీ బొంబాయిలోని తమిళుల నుద్దేశించి మాట్లాడుతూ-అప్పుడు మద్రాసు ముఖ్యమంత్రిగా వున్న కామరాజ్‌ను ఎత్తిపొడిచే ధోరణిలో- "మీరు అదృష్టవంతులు. మీరు ఇక్కడ బొంబాయిలో చక్కటి ప్రభుత్వం కలిగి వున్నారు" అన్నారట. ఆ మాటలు మర్నాడు వార్తాపత్రికలలో పెద్ద పెద్ద అక్షరాలలో వెలువడగా శ్రీ కామరాజ్ తన ప్రక్కనున్న వారితో "పాపం రాజాజీ గురించి బొంబాయి తమిళులు ఏమనుకుంటున్నారోగదా!" అన్నారట. 

"నా ఏకైక శత్రువు నా తల్లి" అన్న

# రాజకుమారి అమృత్‌కౌర్

కేంద్ర ప్రభుత్వ మాజీ ఆరోగ్య శాఖమంత్రి రాజకుమారి అమృత్ కౌర్ కపుర్తలా రాజవంశీయురాలు. లండన్‌లో సీనియర్ కేంబ్రిడ్జి పూర్తయిన తర్వాత యూనివర్శిటీలో చదువుకోవాలని ఉబలాటపడుతుంటే తల్లి అందుకు అడ్డు చెప్పింది. చదువు మాన్పించి ఇంటికి పిలిపించింది.

## తల్లి ముఖం చూడని తనయ

రాజకుమారి అమృత్‌కౌర్ ఒక ఆంగ్లేయుణ్ని ప్రేమించింది అందుకు కుటుంబ పెద్దలు అంగీకరించలేదు. ముఖ్యంగా తల్లి అసలు అంగీకరించలేదు. కొంతకాలానికి తండ్రి మెత్తబడినా తల్లి మాత్రం ఆ పెళ్ళి జరగటానికి ససేమిరా అంగీకరించలేదు. ఈ విషయమై తల్లీ కూతుళ్ళ పట్టుదలలు పెరిగి పోవడంతో అమృత్‌కౌర్ తల్లికి దూరంగా వెళ్ళి అన్న

"నా ఏకైక శత్రువు నా తల్లి" అన్న

# రాజకుమారి అమృత్‌కౌర్

కేంద్ర ప్రభుత్వ మాజీ ఆరోగ్య శాఖమంత్రి రాజకుమారి అమృత్ కౌర్ కపుర్తలా రాజవంశీయురాలు. లండన్‌లో సీనియర్ కేంబ్రిడ్జి పూర్తయిన తర్వాత యూనివర్శిటీలో చదువుకోవాలని ఉబలాటపడుతుంటే తల్లి అందుకు అడ్డు చెప్పింది. చదువు మాన్పించి ఇంటికి పిలిపించింది.

## తల్లి ముఖం చూడని తనయ

రాజకుమారి అమృత్‌కౌర్ ఒక ఆంగ్లేయుడ్ని ప్రేమించింది అందుకు కుటుంబ పెద్దలు అంగీకరించలేదు. ముఖ్యంగా తల్లి అసలు అంగీకరించలేదు. కొంతకాలానికి తండ్రి మెత్తబడినా తల్లి మాత్రం ఆ పెళ్ళి జరగటానికి ససేమిరా అంగీకరించలేదు. ఈ విషయమై తల్లీ కూతుళ్ళ పట్టుదలలు పెరిగి పోవడంతో అమృత్‌కౌర్ తల్లికి దూరంగా వెళ్ళి అన్న

గారింట్లో ఉండిపోయింది. ఈ ప్రపంచంలో తనకున్న ఒకే ఒక శత్రువు తన తల్లేనని అమృత్‌కౌర్ అభిప్రాయం. అందుకు తగ్గట్టుగా అమృత్‌కౌర్ ఎన్నడూ తల్లి ముఖం చూడలేదు. తల్లి చనిపోయిన తర్వాత మాత్రమే ఆమె స్వగృహం చేరుకుంది. ఈ ప్రేమ వ్యవహారం ఈ విధంగా విఫలమవడంతో అమృత్‌కౌర్ జీవితాంతం పెళ్ళి లేకుండానే వుండిపోయారు.

## నా అనుభవ రీత్యా

రాజకుమారి అమృత్‌కౌర్ కొంతకాలం గాంధీజీకి కార్యదర్శిగా పని చేశారు. గాంధీజీ సిఫార్సు పై పండిట్ నెహ్రూ ఆమెను తన మంత్రి వర్గంలోకి తీసుకొని ఆరోగ్యశాఖ ఇచ్చారు. ఆరోగ్యమంత్రిగా ఆమె చెప్పుకోతగ్గంత రాణించలేకపోయారు. క్రింది అధికార్లపై ఎక్కువగా ఆధారపడేవారు. సాటి మంత్రులు గాని, పార్లమెంటు సభ్యులుగాని నిగ్గదీసి ప్రశ్నలు అడిగినప్పుడు సమాధానం చెప్పలేక కళ్ళనీళ్ళు పెట్టేవారు.

ఒకసారి అమృత్‌కౌర్ బెంగుళూర్‌లో ఒక కుటుంబనియంత్రణ సమావేశానికి అధ్యక్షత వహించారు. ఆ సభలో అనేక మంది ప్రముఖ వైద్యులు, శాస్త్రవేత్తలు పాల్గొన్నారు. కుటుంబనియంత్రణ గురించి వివరించుతూ అవివాహిత అయిన అమృత్‌కౌర్ "వైద్యశాస్త్ర అనుభవాల ప్రకారం" అనబోయి "నా స్వతంత అనుభవాలరీత్యా బహిష్టు అయ్యే ముందు ఆ తదుపరి కొద్ది రోజులు భార్యాభర్తలు సంసారం చేయకుండా వుంటే గర్భధారణ జరగకుండా వుంటుంది. పైగా ఈ సహజమైన పద్ధతి గాంధీజీ సిద్ధాంతాలకు అనుగుణంగా కూడా వుంటుంది" అని ప్రసంగించారు. సమావేశంలోని పెద్దలంతా నవ్వితే కేంద్రమంత్రిగారికి కోపం వస్తుందేమోనని ఆ సమావేశం అయ్యేదాకా నవ్వు ఆపుకొని ఆమె వెళ్ళిన తర్వాత పొట్టచెక్కలయ్యేటట్టు నవ్వుకున్నారట. ★

నెహ్రూనే నిలువరించిన బాల

# శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్

ప్రముఖ సంఘ సేవకురాలు శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ చిన్నప్పటి నుంచి మొగమాటం లేకుండా మాట్లాడుతూ వుండేవారు.



**వచ్చినపని ఇంకా కాలేదా?**

వారి కుటుంబం కాకినాడలో వుండేరోజుల్లో ఓసారి వారి దూరపు బంధువు ఆ ఊరికి ఏదో పనిమీద వచ్చి వారింట్లోనే చాలా రోజులు తిష్టవేశాడు. అతని వాలకం చూస్తే ఎన్నాళ్ళిటికీ వెళ్ళేటట్టు లేకపోవడంతో చిన్నారి దుర్గాబాయ్ ఒకరోజున ఆ బంధువు మొహంమీదనే "ఏమండీ

మీరు వచ్చిన పని కాలేదా ఇంకా?" అంది. పాపం బిక్కచచ్చిపోయిన ఆ బంధువు వెంటనే మూటాముల్లే సర్దుకుని వెళ్ళిపోయాడు.

మరొకసారి ఇంకొకబంధువు వచ్చాడు. దుర్గాబాయ్ తల్లిచేసిన కూర రుచిగా వుండటంతో ఆ బంధువు మారు వడ్డించమని చిన్నారి దుర్గాబాయ్‌ను కోరగా నదురు బెదురు లేకుండా "సారీ! మీరేమీ అనుకోకండి. కూర కొంచెంగానే చేసింది మా అమ్మ" అన్నదట నిర్మొహమాటంగా.

## నెహ్రూనే నిలవరించిన బాలాకుమారి

1923లో కాంగ్రెస్ సభలు కాకినాడలో జరిగాయి. అప్పటికి 14 సంవత్సరాల ప్రాయంలోవున్న దుర్గాబాయ్ ఆ సభలకు వాలంటీరుగా పని చేసింది. సభాస్థలి ముఖద్వారం వద్ద టిక్కెట్లు తనిఖీచేసి ప్రతినిధులను లోపలకు పంపేపని దుర్గాబాయ్‌కి ఒప్పగించారు. టిక్కెట్ లేకుండా ఎవ్వరినీ లోనికి పోనివ్వవద్దని మహాసభల నిర్వాహకుడు ప్రముఖ కాంగ్రెస్ నాయకులు కొండా వెంకటప్పయ్యగారి ఆదేశం. ఆ ప్రకారమే దుర్గాబాయ్ గేటు వద్ద టిక్కెట్లు తనిఖీ చేస్తున్నారు. ఈలోగా ఒకవ్యక్తి హడావుడిగా టికెట్ చూపకుండా లోపలికి పోబోయాడు. దుర్గాబాయ్ ఆ వ్యక్తిని అటకాయించి టిక్కెట్టు చూపమంది. "టిక్కెట్ కొనటం మర్చిపోయాను" అన్నాడు ఆ వ్యక్తి "అయితే టిక్కెట్టు రుసుం రెండణాలు ఇచ్చివెళ్ళండి" అన్నది చిన్నారి దుర్గాబాయ్. రెండణాల కోసం ఆ వ్యక్తి జేబులు తడుము కోగా చిల్లరలేదు. ఆ వ్యక్తి చిరునవ్వుతో అటు ఇటూ చూస్తూవుండగా కొండా వెంకటప్పయ్యగారు హడావిడిగా పరిగెత్తుకుంటూ వచ్చారు. ఆ వ్యక్తి వెంకటప్పయ్యగారి దగ్గర చిల్లర తీసుకొని టిక్కెట్టుకొని లోపలికి వెళ్ళారు. ఆ వ్యక్తి ఎవరోకాదు సాక్షాత్తు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ. ఆ తర్వాత దుర్గాబాయ్‌ని వెంకటప్పయ్యగారు మందలించినా పండిట్ నెహ్రూ మాత్రం ఆ పిల్ల కర్తవ్యదీక్షకు ఎంతగానో మెచ్చుకున్నారట. ★

ధీమాగల నాయకుడు

# మొరార్జీదేశాయ్

మాజీ ప్రధానమంత్రి మొరార్జీ దేశాయ్ తండ్రి బహునిక్కచ్చి మనిషి. నెలకు 40 రూపాయల జీతంతో ఎలిమెంటరీ స్కూల్ టీచర్‌గా



పనిచేసేవారు. తన ఉద్యోగం సక్రమంగా చేసుకోవటమే తప్ప అధికార్ల అడుగులకు మడుగు లొత్తే నైజంకాదు ఆయనది. అందువల్ల వారు కోపంతో ఆయనకు ప్రమోషన్ ఇవ్వలేదు. ఎన్నాళ్ళయినా ప్రమోషన్ రాక పోవటంతో విరక్తిచెందిన ఆయన ఆత్మహత్య చేసుకున్నారు.

ఆ విధంగా 9 మంది సభ్యులు గల కుటుంబభారం మొరార్జీ మీద పడింది. అప్పటికి మొరార్జీకి 15 ఏళ్ళు మాత్రమే! అప్పుడు బొంబాయిలో మెట్రిక్ చదువుతున్న మొరార్జీ ఎవరిదగ్గరకూ అప్పుకు వెళ్ళకూడదని, తన స్వశక్తితో కుటుంబపోషణ చేసుకోవాలనే దృఢనిశ్చయానికి వచ్చారు. ఆ వయసులోనే మొరార్జీకి నెలకు 10 రూపాయల స్కాలర్‌షిప్ వచ్చేది. మొరార్జీ చదువులో కనపరుస్తున్న శ్రద్ధనుచూసి స్కూలు యాజమాన్యం

ో జనవసతి కూడా సమకూర్చింది. మొరార్జీ మెట్రిక్ చదివేరోజులలోనే చిన్న తరగతుల వారికి ట్యూషన్లు చెప్పి కొంత రాబడి సమకూర్చుకునే వారు. బొంబాయిలో ఎక్కడకు వెళ్ళాల్సి వచ్చినా నడిచేవెళ్ళేవారు. ఆ విధంగా వీలైనంత పొదుపును పాటించి 9మంది సభ్యులుగల కుటుంబాన్ని పోషించుకు వచ్చారు.

## దేశాయ్ ధీమా

మొరార్జీ కాలేజీలో చదువుతున్న రోజులలో రాష్ట్ర సివిల్ సర్వీసు పరీక్షలకు హాజరయ్యారు ఇంటర్వ్యూకు పిలుపువచ్చింది. సరైన బట్టలు లేని మొరార్జీ స్నేహితుడి దగ్గర బట్టలు అరువు తీసుకుని దానికి హాజరయ్యారు. ఇంటర్వ్యూ బోర్డులో ముగ్గురు ఐ.సి.ఎస్. ఆఫీసర్లు ఉన్నారు. అది ముగిసేటప్పుడు ఒక ఆఫీసర్ మొరార్జీతో "నీవు ఈ ఉద్యోగానికి సెలక్టుకాకపోతే ఏంచేస్తావ్" అన్నాడు మొరార్జీ వెంటనే ఈ ఉద్యోగం రాకపోయినంతమాత్రాన నాకుపోయేది ఏమీలేదు. "ఈ సువిశాలమైన భారత దేశంలో ఇంతకన్న మంచి ఉద్యోగం సంపాదించుకోగల"నని ధీమాగా అన్నారు. ఆ ఆత్మవిశ్వాసం, నిర్భయత్వాలకు వారు ఎంతో సంతోషించి అప్పటికే కావల్సిన పోస్టులన్నీ భర్తీచేసినా మొరార్జీకి మరో అదనపుపోస్టు సృష్టించి ఇచ్చారు!

## వెర్రిమొర్రి ఆలోచనలు

జనతా ప్రభుత్వంలో ప్రధానిగా ఎన్నికైనపుడు మొరార్జీకి 82 ఏళ్ళు ఆయన ఎంతోకాలం బ్రతకడు, ఆయన పోయిన తర్వాత ఛాన్సు తమదేనని ఆనాటి కేంద్రమంత్రివర్గంలో ఒకరిద్దరు సీనియర్ మంత్రులు భావించారు. ఆ ఆలోచనలను పసిగట్టిన రాష్ట్రపతి సంజీవరెడ్డి "మీరేదో ఊహిస్తున్నారు గాని మీ అందరికన్నా మొరార్జీ ఎక్కువకాలం బ్రతుకుతాడు. వెర్రిమొర్రి ఆలోచనలు చేయకండి" అని వారిని మెత్తగా మందలించారు. ★

ఎడిసన్ అంతిమశ్వాస భద్రపర్చిన

# హెన్రీ ఫోర్డు

"నేను జన్మతహా ఇంజనీర్ని. నా ఆట వస్తువులు యంత్ర పరికరాలే" అని అనేవారు హెన్రీ ఫోర్డు. నిజం కూడా అంతే, ఎంతటి క్లిష్టతరమైన యంత్రాన్నైనా ఒక్కమాటు చూసినంత మాత్రాన అది పనిచేసే విధానాన్ని అవగాహన చేసుకునేవారు ఫోర్డు. పన్నెండు సంవత్సరాల వయస్సులో హెన్రీ ఫోర్డు దృష్టి అలారం గడియారాల మీదకి పోయింది. చదువు సంధ్యలు మానివేసి గ్రామాల వెంట తిరుగుతూ చెడిపోయిన గడియారాలన్నీ బాగు చేసేవాడు. మరమ్మతు చేసినందుకు ఛార్జీ ఏమీ తీసుకునేవాడు కాదు.



పదహారు సంవత్సరాలవయస్సులో ఫోర్డు డెట్రాయిట్‌లోని ఒక వర్కుషాపులో పని నేర్చుకొనడానికి కుదిరాడు. వర్కుషాపు వాళ్ళు అతనికి వారానికి $2\frac{1}{2}$ డాలర్లు ఇచ్చేవారు. యిచ్చేజీతం $2\frac{1}{2}$ డాలర్లు అయితే అతను వుండే గదికి అద్దె, భోజనం ఖర్చు వారానికి $3\frac{1}{2}$ డాలర్లు అయ్యేవి. పగలు వర్కుషాపులో పని నేర్చుకుంటూ రాత్రిపూట ఒక కొట్లో గడియారాలు బాగుచేస్తూ వుండేవాడు. కొంతకాలానికి అదే పట్టణంలో ఎడిసన్ కంపెనీలో ఇంజనీరుగా కుదిరాడు. అనతికాలంలోనే తన ప్రజ్ఞా ప్రాభవాల వల్ల చీఫ్ ఇంజనీర్‌గా నియమింపబడ్డాడు.

ఎడిసన్ కంపెనీలో పనిచేస్తున్నా ఫోర్డు మనస్సు అంతా వేరొక దానిపై లగ్నమై వుంది. చిన్నకారు తయారు చేయాలని అతడి అభిలాష. అప్పటికే కొన్ని కార్లు మార్కెట్టులో తయారవుతున్నాయి. కార్లతయారీ గురించి పత్రికలలో కొంతమంది వ్యాసాలు వ్రాస్తూవుండేవారు. ఫోర్డు ఆ వ్యాసాలనన్నింటినీ క్షుణ్ణంగా చదివి ఆకళింపు చేసుకొని తాను స్వంతంగా మిగతా కార్లకంటె భిన్నమైన కారును తయారు చేయాలని తలపెట్టాడు.

## "గుర్రాలు లేని బగ్గీ"

ఎలాగయితేనేం రేయింబవళ్ళు శ్రమించి 1896 నాటికి ఒక కారు తయారు చేయగలిగాడు. అతడు తయారుచేసిన చిన్నకారుకు నేటి చిన్న కారుకు ఎంతో వ్యత్యాసం వుంది. అతడు తయారు చేసిన కారు నాల్గు చక్రాల సైకిల్‌వలె వుండేది. ముందువున్న మోటారుకు వెనక చక్రాలకు బెల్టువుండేది. దీన్ని ప్రజలు "గుర్రాలులేని బగ్గీ" అని పిల్చేవారు ఫోర్డు దీన్ని నడుపుకుంటూ డెట్రాయిట్ వీధుల్లో కన్పించేవాడు. ప్రజలు ఈ వింత బగ్గీని చూడడానికి విపరీతంగా గుమికూడే వారు. ఈ బగ్గీని చూసినంతనే గుర్రాలు బెదిరి పారిపోయేవి. దాంతో వీధుల్లో జనంలో త్రొక్కిస

లాట ప్రారంభమయ్యేది. పోలీసులకు జనాన్ని అదుపులో పెట్టడం ఒక సమస్యఅయి కూర్చుంది. పోలీసులు ఈ కొత్త ఉపద్రవాన్ని ఎదుర్కొన డానికి హెన్రీ ఫోర్డు ప్రభుత్వంనుంచి లైసెన్సు పొందితే నేగాని ఈకారును నడపడానికి వీల్లేదని ఆంక్ష విధించారు.

## చౌకధర కారు

1921లో జరిగిన ఒక సంఘటనతో ఫోర్డు జీవితమే మారిపోయింది. ఆ సంవత్సరం జరిగిన కార్ల పందాలలో ఫోర్డు తయారుచేసిన కారు ప్రథమంగా రావడంతో హెన్రీ ఫోర్డుకు విశేష ప్రచారం లభించింది. ఫోర్డు మోడల్ కారుకు అనేక ప్రశంసలు లభించాయి. కొంతమంది మిత్రులు ఫోర్డుకు ఆర్థిక సహాయం చేయడానికి ముందుకు వచ్చారు.

1903లో లక్ష డాలర్ల పెట్టుబడితో ఫోర్డు మోటారు కంపెనీ స్థాపించాడు. ఏ వస్తువు తయారుచేసినా అత్యధిక ప్రజల అవసరానికి తగినదిగా వుండాలని ఫోర్డు భావన. అదే వుద్దేశ్యంతో 1903 లోనే ఈ క్రింది ప్రకటన చేశాడు. నేను జనసామాన్యానికి పనికివచ్చే చౌకధర కారు తయారు చేస్తాను. ఆ కారు కుటుంబానికి సరిపోయేంత పెద్దది గాను, ఒకేవ్యక్తి కూడా సాకగలిగేంత చిన్నదిగాను వుంటుంది. నాణ్యమైన సరుకుతో నిపుణులైన పనివారితో ఆ కారు తయారు చేయబడుతుంది. ఆ కారు ధర సామాన్యమైన ఉద్యోగస్థునికి కూడా అందుబాటులో వుంటుంది."

ఇవన్నీ అతిశయోక్తులు ఏమీ కావు. ఫోర్డు అన్న మాటలకు కట్టుబడే వున్నాడు. అదే సంవత్సరంలో మోడల్-టి ఫోర్డుకార్లు 12 వేలు తయారైనాయి. మరుసటి సంవత్సరం 19 వేలు తయారు చేయబడినాయి. 1915 నాటికి మోడల్-టి ఫోర్డుకార్లు 1 కోటి 60 లక్షలు అమ్ముడు పోయాయి.

**1912లో** ఫోర్డు తన కర్మాగారంలో సరిక్రొత్తగా ఎసంబ్లీ లైన్‌లను ప్రవేశ పెట్టాడు. ఈ కొనస ముడిసరుకు వేస్తే ఆ కొనన కారు పూర్తిగా తయారై ప్రతి 93 నిమిషాలకు ఒకకారు బయటకు వచ్చేది. 1925 లో అసెంబ్లీ లైన్‌లలో మరికొన్ని వినూత్న మార్పులు చేయడం వలన ప్రతి 15 సెకండ్లకు ఒక కారు తయారై బయటకు వచ్చేది.

## కార్మిక శ్రేయోభిలాషి

**1914** జనవరి 5న ఫోర్డు పేరు ప్రపంచ పత్రికలన్నింటిలోను పతాక శీర్షికలలో వెలువడింది. అందుకు ఒక ముఖ్య కారణముంది. ఆదే రోజున ఫోర్డు తన ఫ్యాక్టరీలోని కార్మికులందరికీ ఎనిమిది గంటల పని, రోజుకు 5 డాలర్ల వేతనంగా నిర్ణయించాడు. ఆరోజుల్లో అమెరికాలో మిగతా పరిశ్రమలలో రోజుకు $2\frac{1}{2}$ డాలర్ల వేతనం, తొమ్మిది గంటల పనిగా వుండేది. ఈ విధంగా కార్మికులకు రెట్టింపు వేతనం ప్రకటించి ప్రపంచ ప్రజలందరి మన్ననలను పొంది కార్మిక శ్రేయోభిలాషి అయినాడు. ఆ రోజులలో ప్రపంచంలో ఇంత ఎక్కువ వేతనం ఇంత తక్కువ పని ఇచ్చిన వ్యక్తిగాని, ప్రభుత్వం గాని, మరే సంస్థగాని లేదు.

హెన్రీ ఫోర్డు కటిక దరిద్రుడుగా పుట్టి ప్రపంచంలోకెల్లా కోటీశ్వరుడైనాడు. 82 సంవత్సరాల వయస్సులో అతడు చనిపోయే నాటికి అతడి ఆస్థి అనేక వందల కోట్ల డాలర్లుగా వుండేది. ఇందులో చాలా భాగం దానధర్మాలు చేశాడు. అతడు చనిపోయే నాటికి దానధర్మాలు చేయడానికి తాను నెలకొల్పిన ఫోర్డు ఫౌండేషన్‌లో 250 కోట్ల డాలర్లు, అంటే దాదాపు 1800 కోట్ల రూపాయలు వున్నవి. ఈ ఫోర్డు ఫౌండేషన్ ప్రతి సంవత్సరం ప్రపంచం నలుమూలలా సంక్షేమ కార్యక్రమాలకొరకు 35-40 కోట్ల డాలర్లు ఖర్చుచేస్తూ వుంటుంది.

## ఎడిసన్ అంతిమ శ్వాస

వ్యక్తిగతంగా ఫోర్డు చాలా వింత వ్యక్తి. రకరకాల యంత్రాలక పనికివచ్చే సామగ్రిని దాచిపెట్టుకునేవాడు. మొదటి ప్రపంచయుద్ధం ముమ్మ రంగా జరుగుతున్న రోజులలో శాంతినౌకను ఐరోపాకు పంపించాడు థామస్ అల్వా ఎడిసన్ ఆఖరిశ్వాసను ఒక సీసాలో పట్టి భద్రపర్చుకున్నా డట. ఒకసారి అధ్యక్ష పదవికి పోటీచేసి కొద్దిలో ఓడిపోయాడు. 7( సంవత్సరాల వయస్సులో సోల్కా నృత్యం చేసేవాడు.

## ప్రియురాండ్ర కోర్కెలు

అమెరికాలో మోడల్ టి. ఫోర్డు తయారు చేయడానికి ముంద కార్లనేవి పురుషులకు మాత్రమే పరిమితమైనవిగా వుండేవి. స్త్రీలకు వాటి నడిపే సామర్థ్యం లేదని భావించబడేది. ఫోర్డు కార్లు స్త్రీలు కూడా అవలీలగా నడపడానికి వీలు కల్గించినాయి. 1908 నాటికి ఫోర్డు కార్లను పురుషులతో పాటు స్త్రీలు కూడా దేశవ్యాప్తంగా నడపడం ప్రారంభించారు. అమెరికన్ నారీ లోకంలో హెన్రీ ఫోర్డు పేరు ఎంత వ్యాప్తిచెందిందంటే, 1915 నాటికి దేశం నలుమూలలా అవివాహిత కన్యలు తమ తమ ప్రియులను సంబోధిస్తూ "మాకు నగలువద్దు, నాణాలువద్దు, మేడలూ మిద్దెలూ అంత కన్నావద్దు, ఫోర్డు కారుకొనిస్తే అదే పది వేలు" అని పాటలు పాడుతూ వుండేవారట.

హెన్రీ ఫోర్డు మిచిగన్ అమెరికా రాష్ట్రం లోని గ్రీన్‌ఫీల్డులో 1863లో జన్మించాడు. 1947లో చనిపోయాడు. 1945లో ఫోర్డు మోటారు కంపెనీ అధిపతిగా హెన్రీఫోర్డు మనుమడు రెండవహెన్రీ నియమించబడి నాడు.

## పాత అలవాటు వీడని పత్రికా సంపాదకుడు

# ఖాసా సుబ్బారావు

సుప్రసిద్ధ పత్రికా సంపాదకులైన ఖాసా సుబ్బారావుగారు మంచి తనానికి, మానవత్వానికి మరో పేరు. ఆయన తను నమ్మిన సిద్ధాంతాల కోసం జీవితం ధారపోసిన మహామనీషి. ప్రకాశం పంతులుగారంటే ఖాసా సుబ్బారావుగారికి ఎంతో అభిమానం.

### స్వంత పత్రికలో వ్యతిరేకం

ప్రకాశం పంతులుగారు "స్వరాజ్య" పత్రిక పెట్టిన రోజులవి. సుబ్బారావుగారు ఆ పత్రికకుసంపాదకులుగా ఉండేవారు. కాంగ్రెసు పార్టీ తరఫున ప్రచారంచేస్తూ ఒకానొక బహిరంగసభలో ప్రకాశంగారు చేసిన ఓ ఉపన్యాసం సుబ్బారావుగారికి నచ్చలేదు. వెంటనే ఆ మర్నాడు స్వరాజ్యపత్రిక సంపాదకీయంలో ఘాటుగా ప్రకాశంగార్ని విమర్శించారు ఈ విషయం



ప్రకాశంగారైతే అంతగా పట్టించుకోలేదుగాని వారి మిత్రులు మాత్రం "ఇదేమిటండీ ప్రకాశంగారూ ? మీ స్వంత పత్రికే మీకు వ్యతిరేకంగా రాసింది?"అని ఎత్తిపొడిచారు. దాంతో టంగుటూరివారికి కాస్తంత

చురుకు తగిలి వెంటనే 'స్వరాజ్య' ఆఫీసుకువెళ్ళి సుబ్బారావుగారిని మంద లించారు. సుబ్బారావుగారు మారుమాట్లాడకుండా తక్షణం తన రాజీనామా పత్రాన్ని ప్రకాశంగారికి అందజేశారు. ప్రకాశంగారు ఇది ఊహించలేదు. వెంటనే ఆయన తన తొందరపాటుకి బాధపడుతూ "సారీ! సుబ్బారావు నా తొందరపాటుకి చింతిస్తున్నాను. నా పత్రికలో ఇటువంటి గొప్ప వ్యక్తి త్వం కల్గిన ఎడిటర్ ఉన్నందుకు ఇప్పుడు నేను గర్వపడుతున్నాను" అని అభినందించారట.

## ప్రతిభావంతుల సంస్కారం

సుబ్బారావుగారికి రాజాజీకి కూడా ఎనలేని మైత్రీ సంబంధాలు ఉండేవి. అయినా సమయం వచ్చినప్పుడు ఖాసావారు రాజాజీని తీవ్రంగా విమర్శిస్తూ ఉండేవారు. ఆ మాటకొస్తే అసలు ఖాసావారు విమర్శించినంత తీవ్రంగా మరెవ్వరూ రాజాజీని విమర్శించేవారు కాదేమో? అయినా వారిద్దరూ జీవితాంతం ఎంతో అన్యోన్యంగా మంచి స్నేహితులుగానే ఉండేవారు. ఉభయులూ ఆయా రంగాలలో గొప్ప ప్రతిభావంతులు కావటమే గాక అభిప్రాయభేదాలున్నా పరస్పరం గౌరవించుకునే ఉత్తమ సంస్కారం విశాల హృదయం వారిలో ఉండేది. సుబ్బారావుగారి చివరి రోజుల్లో రాజాజీ వారిని అనేక విధాల ఆదుకున్నారు.

## పాత అలవాటు వీడని పత్రికా సంపాదకుడు

ఖాసావారు ఎడిటింగ్‌లో మహాదిట్ట. ఆయన ఏ పత్రికకు సంపాదకుడుగా ఉన్నా సహాయ సంపాదకుల మీద ఎక్కువగా ఆధారపడేవారు కారు. ఎంత పేరుపడ్డ రచయిత వ్యాసమైనాసరే స్వయంగా చదివి పిల్లల కాంపోజిషన్ దిద్దినట్లుగా దిద్దేవారు. అసలు సుబ్బారావుగారు మొదట బడి పంతులుగానే తన జీవితం ప్రారంభించారు. అదే అలవాటు సంపాదకులైనా వదలుకోలేదు.



త్రాగుడు అంటే వల్లమాలిన అభిమానం కలిగిన

# క్రుశ్చేవ్

సోవియెట్ యూనియన్ మాజీ ప్రధానమంత్రి కృశ్చేవ్‌ను చిన్నప్పుడు 'పుట్‌బాల్' అనే పేరుతో ఎగతాళిగా పిలిచేవారట! అయితే కుదిమట్టంగా, లావుగా వుండే కృశ్చేవ్ ఎల్లప్పుడూ చలాకీగా హుషారుగా వుండేవారు.

## 11 గ్లాసులు షాంపైన్

కృశ్చేవ్‌కు త్రాగుడు అంటే వల్లమాలిన అభిమానం. ఎక్కువగా మద్యపానీయాలు తీసుకుంటూ వుండేవారు. ఆయన ఒకానొక విందులో ఏకబిగువున 11 గ్లాసులు షాంపైన్ తీసుకున్నారు. ఆ పైన టొమాటో రసం తీసుకున్నారట।



అయితే ఎంత త్రాగినా ఆయన త్రాగినట్లు కనపడేవారు కాదు. అతి త్రాగుడువల్ల కలిగే వికారాలు ఆయనలో ఎప్పుడూ కానవచ్చేవి కావు. ఎంత త్రాగినా నిబ్బరించుకుని తొణకకుండా వుండేవారు.

ఒకసారి ఆయన బొంబాయి పర్యటన సందర్భంగా విమానం దిగే ముందు చిత్తుగా త్రాగేసి బొంబాయి మేయర్‌తో "మిస్టర్ మేయర్! నేను మీ రాష్ట్రం వస్తూనే ఇక్కడి అమలులోవున్న ఒక న్యాయచట్టాన్ని ధిక్కరించాను. (మహారాష్ట్రలో అప్పుడు మద్యపాన నిషేధ చట్టం అమలులో వుంది) క్షమించాలి. విమానాశ్రయంలో అసంఖ్యాక ప్రజలు గుమిగూడటంతో భయపడ్డాను. బ్యాగ్‌లో నుంచి వోడ్కా సీసాతీసి త్రాగేశాను" అన్నారట నవ్వుతూ.

బొంబాయి మేయర్ అందుకు ప్రతిగా నవ్వుతూనే "మీరేం బాధపడనవసరంలేదు. మా అధికారం భూమిమీద, సముద్రంలోనూ మూడు మైళ్ళ ప్రాంతం వరకే పరిమితం. అందువల్ల మీరు విమానం దిగకముందే ఆకాశంలో వున్నప్పుడే వోడ్కా సేవించారు కనుక మీరు చట్టాన్ని అతిక్రమించినట్టు కాదు" అన్నారట.

## మేథాశక్తి అపారం

కృశ్చేవ్ మేథాశక్తి అసాధారణం. ఆయన జ్ఞాపకశక్తి కూడా అంతటిదే! ఒకసారి లండన్‌లో ఒక సమావేశంలో పాల్గొన్నప్పటి సంగతి.

ఆనాటి సమావేశంలో బ్రిటిష్ ప్రధానమంత్రి, ఇంకా తదితరులు ఫైళ్ళు ముందేసుకుని చూస్తూ, సలహాదారులతో సంప్రదిస్తూ చర్చలలో పాల్గొనగా కృశ్చేవ్ మాత్రం తనముందు ఏ ఫైలూ లేకుండా సలహాదార్ల మీదకూడా ఆధారపడకుండా అతి చాకచక్యంగా చర్చలు జరిపి అందర్నీ ఆశ్చర్యంలో ముంచెత్తారట!

కృశ్చేవ్ అతిగా మాట్లాడేవాడని పేరు వుండేది.



## 739 పౌన్లు బరువుగల మహాకాయుడు

# డేనియల్ లాంబెర్ట్

సరిగ్గా 200 సంవత్సరాల క్రిందట బ్రిటన్‌లో ఒకవ్యక్తి జన్మించాడు. అతనిపేరు డేనియల్ లాంబెర్ట్. బరువు 739 పౌన్లు (అక్షరాలా ఏడువందల ముప్పయితొమ్మిది పౌన్లు) నడుం చుట్టుకొలత తొమ్మిదడుగుల నాలుగు అంగుళాలు, చరిత్రాధారాలున్నంతవరకు ప్రపంచంలోకెల్లా అత్యధికమైన బరువు కలిగిన వ్యక్తి ఇతడే. ఇంతటి మహాకాయుడు నాటికీ నేటికీ మరొకరు పుట్టి వుండలేదు

డేనియల్ లాంబెర్ట్ బ్రిటన్‌లో స్టాంఫర్డు పట్టణంలో 1770 మార్చిలో జన్మించాడు. తండ్రి చెరసాల కాపలాదారు.

లాంబెర్ట్‌కు 18 సంవత్సరాల వయస్సు రాగానే తండ్రి స్థానేచెరసాల కాపలాదారునిగా నియమించబడ్డాడు. 18 సంవత్సరాల వయస్సులోలాంబెర్డు బరువు 280 పౌన్లు, ఇంత బరువున్నా లాంబెర్ట్ అతి చలాకీగా వుండేవాడు రోజూ వ్యాయామం చేసేవాడు. నదిలో ఈతకొడుతూ వుండేవాడు. కుస్తీ పట్లుకూడా పడుతూ వుండేవాడు.

లాంబెర్డ్ పెద్దలపట్ల అతివినయంగాను, పిల్లలపట్ల అమిత వాత్సల్యంతోను ప్రవర్తించేవాడు. చిన్నపిల్లలను ఎప్పుడూ వెంటవేసుకుతిరుగుతూ వుండేవాడు. వారికి వ్యాయామం, ఈతకొట్టడం నేర్పుతూ వుండేవాడు. ఇద్దరు ముగ్గురు పిల్లలను వీపుపై ఎక్కించుకుని నదిలో ఈతకొడుతూ వుండేవాడు.

## "పొట్ట పగిలిపోదు కదా ?"

లాంబెర్ట్‌కు 21 సంవత్సరాలు వచ్చేటప్పటికి 448 పౌన్లు వున్నాడు. అతడు నడిచేటప్పుడుగాని, మరే పనిచేసేటప్పుడుగాని హైరానా చెందినట్లు కనిపించేవాడుకాదు. అయినా, నానాటికీ పెరిగిపోతున్న తన శరీరాన్ని చూచుకొని ఆందోళన చెందేవాడు. ఎలాగైనా బరువు తగ్గించుకోవాలని అనేక మార్గాలు అవలంబించాడు. రోజూ 30 మైళ్ళు నడిచేవాడు. బలవర్ధక మైన ఆహారం విసర్జించాడు. వారంలో కొన్నిరోజులు కేవలం పచ్చి మంచినీళ్ళతో గడిపేవాడు. ఇన్ని చేసిలా లాంబెర్ట్ శరీరం కృశించి పోవడానికి బదులు రోజురోజూ పెరిగిపోతూవుండేది.

లాంబెర్ట్ నానాటికీ స్థూలం అయిపోవడం ఆరోజులలో పత్రికల దృష్టిలోకూడా పడింది. స్టాంఫర్డ్‌లోని ఒకపత్రిక "ఈమహాకాయుని శరీరం పెరిగిపోవడం ఏనాడు ఆగితోతుందో?"అని ఒక సంపాదకీయం వ్రాసింది.

లాంబెర్ట్ శరీరం ఇంకా ఉబ్బిపోతూనేవుంది. ఇదంతా గమనిస్తూ వున్న స్టాంఫర్డ్ ప్రజలు "ఇతని శరీరం ఇలాగే పెరిగి పెరిగి ఏనాటికైనా పొట్ట పగిలిపోదుగదా!" అని ఆందోళన చెందేవారు.

## ప్రకృతి వింత

లాంబెర్ట్ విషయం దేశమంతా ప్రాకిపోయింది. దేశం నాలుగు మూలల నుంచి ఇతనిని చూడడానికి తీర్థప్రజలవలె అనేక మందిరాసాగారు. నానాటిక లాంబెర్ట్ శరీరంతోపాటు అతడిని చూడడానికి వచ్చేవారుకూడా పెరిగిపోతున్నారు. చూడటానికి వచ్చేవారికి టిక్కెట్లుపెట్టి బాగా ధనం సంపాదించవచ్చునని లాంబెర్టుకు కొంతమంది స్నేహితులు సలహాఇచ్చారు. లాంబెర్టుకు ఈ సలహా నచ్చింది. చెరసాల ఉద్యోగానికి రాజీనామాచేసి దేశపర్యటనచేసి తద్వారా ఎక్కువ మందిని ఆకర్షించవచ్చునని తల పెట్టాడు.

లాంబెర్టు అభిమానులు కొంతమంది చందాలు వేసుకుని ప్రయాణా నికి ప్రత్యేకంగా ఒక బండి తయారు చేయించి ఇచ్చారు. స్థానిక దర్జీవాడు లాంబెర్టుకు మూడు సూట్లు కుట్టి ఇచ్చారు. ఒక్కొక్క సూటుకు 14 గజాల గుడ్డ పట్టిందట.

లాంబెర్టు మొదట లండన్ చేరుకున్నాడు. ఒక హోటల్‌లోని విశాల మైన గదిలో మకాంపెట్టి ప్రేక్షకులకు దర్శనం ఇవ్వసాగాడు. ఒక్కొక్క మనిషికి ఆరు పెన్నీలు టిక్కెటు పెట్టాడు. లండన్ పేపర్లలో లాంబెర్టును గురించి ప్రకటనలు పడేవి అసంఖ్యాకంగా కరపత్రాలు ముద్రించి లండన్ పౌరులకు తనను గురించి పరిచయం చేసుకున్నాడు లాంబెర్టు. లండన్ పేపర్లు లాంబెర్టును "ప్రకృతి వింత"గా వర్ణించాయి. అనేక పత్రికలు లాంబెర్టును గురించి ప్రత్యేక వ్యాసాలుకూడా ప్రచురించాయి.

## పోలిష్ మరుగుజ్జు సందేహం

ఆరోజులలో పోలెండ్‌లో ఒక మరుగుజ్జు వుండేవాడు. ఇతడు ఆనాడు యూరప్ దేశాలన్నింటిలోను ప్రసిద్ధి చెందాడు. లాంబెర్టును గురించి పేపర్లలో చదివిన ఈ మరుగుజ్జు లాంబెర్టుకు నిజంగా ఇంతశరీరం ఉందా? ఇన్నిపౌన్ల బరువు వుంటాడా? ఇదంతా పట్టి బూటకమేమోనని బహిరంగంగానే సందేహం వెలిబుచ్చాడు. అంతటితో ఊరుకోక 'ఆ' ఇదంతా వట్టి మోసం. లాంబెర్టు శరీరం చుట్టూ గుడ్డలు చుట్టుకొని ప్రజలను దగా చేసి డబ్బులు గుంజుకుంటున్నాడని పత్రికా ప్రకటనకూడా చేశాడు.

ఈ ప్రకటన చూసిన లాంబెర్టుకు మహా పెద్ద కోపం వచ్చింది, పోలెండ్ మరుగుజ్జును తనను చూడడానికి రావలసిందని హుటాహుటిని కబురు పెట్టాడు.

మరుగుజ్జు రానే వచ్చాడు లాంబెర్టు తన దుస్తులను విప్పిపొట్టమీద వీపుమీద ఎక్కి పరీక్షించు కోవలసిందని మరుగుజ్జును ఆదేశించాడు. మరుగుజ్జు అంతా పరీక్షించి వంచిన తల ఎత్తలేదు. అనాలోచితంగా చేసిన పత్రికా ప్రకటనకు క్షమాపణ చెప్పుకున్నాడు. సహజంగానే సౌమ్యుడైన లాంబెర్టు మరుగుజ్జును క్షమించి తన చొక్కానుంచి ఒక పీలిక చింపి చొక్కా కుట్టించుకోమని మరుగుజ్జు కిచ్చాడు.

## 739 పౌన్లు

లాంబెర్ట్ నానాటికి బరువు పెరుగుతున్నాడే కాని తగ్గడంలేదు. 38 సంవత్సరాలు వచ్చేనాటికి లాంబెర్టు బరువు 739 పౌన్లు. అతడు లోగడ వలె చలాకీగా వుండేవాడుకాదు. రానురాను నడవడమే కష్టమయ్యేది. అసలు ఇంకా కొన్నాళ్ళకు అడుగుతీసి అడుగువేయలేని పరిస్థితి కూడా ఏర్పడింది. ఎప్పుడూ మంచంమీద పడుకుని ఉండడమో, కుర్చీలో కూర్చొని వుండడమో చేసేవాడు.

లాంబెర్టును చూడడానికి ఇంకా ప్రేక్షకులు అసంఖ్యాకంగా వస్తూనే వుండేవారు. వచ్చినవారితో ఉల్లాసంగా మాట్లాడుతూ వుండేవాడు. తన జీవిత విశేషాలను అడిగిన వారికి వివరించి చెప్పేవాడు. స్త్రీలతో పరాచి కాలాడుతూ వుండేవాడు.

లండన్ నుంచి కేంబ్రిడ్జికి కాలేజి విద్యార్థులు లాంబెర్ట్‌ను బండికో కూర్చోబెట్టి తాము స్వయంగా బండిలాగుతూ బజార్ల వెంట అట్టహాసంగా ఊరేగించారు. లాంబెర్ట్ అక్కడ కొన్నాళ్ళు గడిపి, హంటింగ్‌డన్ అనే మరొక పట్టణం వెళ్ళాడు. ఆ పట్టణం మేయర్, తదితర పెద్దలు, ప్రజలు లాంబెర్ట్‌ను నాలుగు బజార్ల కూడలికి పెద్ద ఊరేగింపుగా తీసుకు వచ్చి బహిరంగంగా కాటా వేశారు. అప్పుడు అతడి బరువు 739 పౌన్లు.

## అంతిమ యాత్ర

లాంబెర్ట్ హంటింగ్‌డన్ నుంచి స్వగ్రామమైన స్టాంఫర్డ్ తిరిగి వచ్చిన కొద్దిరోజులకు ఉన్నట్టుండి ఒకరోజున నిద్రలోనే ఆఖరి శ్వాస పీల్చాడు.

లాంబెర్ట్‌కు శవపేటిక తయారుచేయడం ఒక సమస్య అయింది. అయిదడుగుల వెడల్పు, మూడడుగుల ఎత్తుగల పేటిక ప్రత్యేకంగా తయారు చేయవలసి వచ్చింది. శ్మశానవాటికకు తీసుకుపోవడానికి వీలుగా దానికి చక్రాలు కూడా అమర్చారు.

లాంబెర్ట్ అంత్యక్రియలకు చుట్టుపట్ల గ్రామాల నుంచి అనేక వందల మంది హాజరయారు. శవపేటిక నుంచి లాంబెర్ట్ భౌతికకాయాన్ని దించడానికి 40, 50 మంది సాయం పట్టవలసివచ్చింది.

చనిపోయేనాటికి లాంబెర్ట్ వయస్సు 39 సంవత్సరాలు.

గాంధీజీబండి లాగిన

# జి. డి. బిర్లా

గాంధీజీ నెలకొల్పిన అనేక ఆశ్రమాలకు సంస్థలకు ప్రముఖ పారిశ్రామికవేత్త జి. డి. బిర్లా ఆర్థిక సహాయం చేస్తూ వుండేవారు. తొలిసారిగా



1920లో బిర్లాకు గాంధీజీతో పరిచయం ఏర్పడింది. ఎలాగంటే 1920లో ఓసారిగాంధీజీ కలకత్తా రైల్వే స్టేషన్‌లో దిగారు. అప్పుడు అక్కడ చిన్న వ్యాపారం చేసుకొంటున్న బిర్లా ఆయన స్నేహితులతో కల్సి గాంధీజీని

బండిలో కూర్చోబెట్టి తామే బండి లాగుతూ కలకత్తాలో ఊరేగించారు అప్పటినుండి బిర్లా, గాంధీజీ ముఖ్య అనుచరులలో ఒకరు అయ్యారు. గాంధీజీ బిర్లా ఇంట్లో చాలా కాలం నివశించారు. కొద్ది వయస్సులో బిర్లా భార్య చనిపోగా గాంధీజీ సలహాపై బిర్లా తిరిగి పెళ్ళి చేసుకోలేదు.

గాంధీజీ ఆశ్రమం కొరకు బిర్లా ఏటా 50 వేలు ఖర్చు చేసేవారు. గాంధీకి ఇచ్చిన పైకాన్ని బిర్లా తన ఖాతా పుస్తకాలలో రాసుకునేవారు కాదు. అయితే గాంధీజీ మాత్రం తాను వాడిన ఖర్చునంతా స్వదస్తూరితో జమా ఖర్చు రాసి బిర్లాకు ఇస్తూ వుండేవారు, బిర్లా ఏనాడూ వాటిని పరిశీలించేవాడు కాదు. ఇచ్చిన జమా ఖర్చు కాగితాలను వెంటనే చించి పారవేస్తూ వుండేవాడు.

## పుణ్యం ! పురుషార్థం !!

బిర్లా ఈ విధంగా గాంధీజీకి ఆయన సంస్థలకు, చేసే ఆర్థిక సహాయాల వలన ప్రజలలో ఆయనకు కీర్తి ప్రతిష్టలు పెరగటమే కాక వ్యాపారానికి కూడా అపారంగా లాభించేది. గాంధీజీతో సన్నిహితంగా వుండటం వలన రాజకీయ రహస్యాలు అనేకం ఆయనకు ముందుగానే తెలుస్తూ ఉండేవి. అది కూడా ఆయన వ్యాపారాభివృద్ధికి ఎంతగానో తోడ్పడేది. అలా పుణ్యాన్నీ పురుషార్థాన్నీ ఏకకాలంలో సాధించారు బిర్లా. ★

# మెక్సికో అధ్యక్షుడి 'బారి' నుంచి
# భార్యను రక్షించుకున్న
# జాన్. ఎఫ్. కెన్నడీ

జాన్. ఎఫ్. కెనడీ అమెరికా అధ్యక్షుడుగా వున్నప్పుడు ఒకసారి మెక్సికో ప్రెసిడెంట్ మాటీస్, ఆయన భార్య అమెరికా పర్యటనకు వచ్చారు. వైట్ హవుస్‌లో విందు సందర్భంగా అధ్యక్షుడు కెనెడీ ధరించిన చేతిగడియారం చూసి శ్రీమతి మాటీస్ ముచ్చట పడి దానివైపు తదేకంగా చూడటం జరిగింది. ఇది గమనించిన కెనెడీ తన గడియారం తీసి శ్రీమతి మాడీస్‌కు ఇవ్వబోయాడు. ఆమె కంగారుపడి



"అబ్బే అది నాకు కావాలనటం లేదు. అది ఎంతో అందంగా వుంది. అందుకు చూస్తున్నాను" అంది. అందుకు కెనెడీ "అలా కాదు మా దేశాచారం ప్రకారం అతిథులు ముచ్చటపడిన వస్తువును జ్ఞాపకార్థం ఇవ్వటం గృహస్థుధర్మం" అని చెప్పి ఆ వాచీని ఇచ్చివేశాడు.

కొంచెం హాస్య ధోరణి కల్గిన మెక్సికో అధ్యక్షుడు ఇదంతా గమనించి, కెనెడీని ఉడికించాలనుకొని కెనెడీ భార్య జాక్వెలెన్ వెంట ఆ రోజంతా తిరుగుతూ ఆమె అందాన్ని తెగపొగడటం ప్రారంభించాడు. దాంతో ఖంగుతిన్న కెనెడీ ఇబ్బందిగా మొహం పెట్టి శ్రీమతి మాటిస్‌తో మెల్లగా "నా వాచి నాకు తిరిగి ఇస్తావా, దాన్ని నేను వదులుకోలేను" అని చెప్పి గడియారం వాపసు తీసుకొని మెక్సికో అధ్యక్షుడి 'బారి' నుంచి తన భార్యను దక్కించుకున్నాడట!



సైకిల్ వీరుడు

# సుందరయ్య

కమ్యూనిస్టు గాంధీగా ప్రసిద్ధిచెందిన పుచ్చలపల్లి సుందరయ్య గారి చిన్నప్పటి సంగతి. ఆయన అప్పుడు కాలేజీలో చేరటం కోసం బెంగుళూరు వెళుతూ మద్రాసు స్టేషన్‌లో దిగారు. ఎంక్వయిరీ ఆఫీసుకువెళ్ళి బెంగుళూరు రైలు ఎప్పుడో విచారిద్దామని వెళ్ళారు. అడిగేందుకు ఆ ఆఫీసులో ఉద్యోగి కనపడలేదు. ఆ గదిలో భారతదేశ రైల్వేలకు సంబంధించిన పెద్ద మ్యాపు వేలాడుతోంది. మ్యాపులు ఆసక్తిగా



చూడటం సుందరయ్యగారికి చిన్నప్పటినుంచి హాబీగా వుండేది. మ్యాప్ కనబడటంతో బట్టలు, పుస్తకాలువున్న సంచి క్రిందపెట్టి మ్యాప్ చూడటంలో నిమగ్నమైపోయారు. ఇంతలో ఎంక్వయిరీ ఉద్యోగివచ్చి గభాల్న ఆయన చేయి పుచ్చుకొని "ఏం దొంగతనం చేయటానికి వచ్చావా?"అంటూ తిట్టటం ప్రారంభించాడు. సుందరయ్యగారు నేను దొంగను కాను, చదువుకునే విద్యార్థిని-ఇదిగో బెంగుళూర్ వెళ్ళేందుకు కొన్న టిక్కెట్టు, మ్యాప్ కనబడితే కుతూహలం కొద్దీ చూస్తున్నా -దొంగతనం చేసేవాళ్ళు సామానుసంచి క్రిందబెట్టి చేస్తారా? అని ఎన్నివిధాలా మొత్తుకున్నా ఆ ఉద్యోగి వినిపించుకోకుండా "నీవు నిజంగా దొంగతనం చేయటానికే వచ్చావు. ఉండు

పోలీసుల్ని పిలుస్తా" అంటూ నిజంగానే పోలీసుల్ని పిలుచుకువచ్చాడు ఆ తలతిక్క ఉద్యోగి.

పోలీసు ఇన్‌స్పెక్టర్ వచ్చి సుందరయ్యగార్ని ప్రశ్నించటం ప్రారంభించాడు. సుందరయ్య తన రైలు టిక్కెట్టు, పుస్తకాలు, బట్టలుచూపించి తను నిజంగా విద్యార్థినని, తను బెంగుళూరు వెళుతున్నానని, అక్కడ తన బావగారు జడ్జిగా పని చేస్తున్నారని (సుందరయ్యగారి బావ అప్పట్లో బెంగుళూరులో జడ్జిగా వుండేవారు) చెప్పిన మీదట ఎలాగైతేనేం సుందరయ్య చెప్పింది నిజమేనని నమ్మి వదిలేశాడు.

## వాసెక్టమీ ఆపరేషన్

సుందరయ్యగారు పెళ్ళయిన వెంటనే పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించుకొన్నారు. దీనికి మొదటి కారణం - పిల్లలు పుడితే సంసార బాధ్యతలు పెరిగి పార్టీ పనిలో పూర్తిగా నిమగ్నమవ్వటానికి ఆటంకంగా వుంటుందని ఆయన భావించారు. అయితే ఈ కారణమేగాక మరొక ముఖ్య కారణంకూడా వుంది. సుందరయ్యగారి వంశంలో అనువంశికంగా మానసికవ్యాధి వుంది. ఆ వ్యాధి ప్రభావం వారసత్వంగా కలగబోయే పిల్లలమీద కూడా పడవచ్చునేమోనని సుందరయ్యగారి అనుమానం. ఈ కారణంగా లీలతో పెళ్ళయిన వెంటనే భార్యాభర్తలిద్దరూ బాగా చర్చించుకొని పిల్లలు పుట్టకుండా చేసుకుంటేనే అన్ని విధాలా మేలని ఒక నిర్ణయానికివచ్చి ఆ విధంగా చేసుకున్నారు. పార్టీ కార్యక్రమాలకే తమ జీవితాన్నంతా ధారపోశారు.

## "తిట్లన్నీ బసవపున్నయ్యకు – మహాజరు నాకు"

సుందరయ్యగారిలో సమయస్ఫూర్తి, హాస్యధోరణి కూడా బాగా వుండేవి. ఒకసారి సుందరయ్య, మాకినేని బసవపున్నయ్యగార్లు సూర్యాపేటలో ఏదో ఒక సమావేశానికివచ్చి రహదారి బంగ్లాలో విశ్రాంతి తీసు

కుంటున్నారు. బసవపున్నయ్యగారు బయట వరండాలో పడుకున్నారు. సుందరయ్యగారు లోపలి గదిలో పడుకున్నారు. ఈలోగా ఒక పాత కమ్యూనిస్టు నాయకుడిభార్య బంగ్లాకువచ్చి తన భర్త కమ్యూనిస్టుపార్టీలో చేరటంవలనే తమ ఆస్తంతా పోయిందని, తన భర్త అన్నివిధాలా చెడి పోయాడని, తన కుటుంబం అన్నివిధాలా చిన్నాభిన్నమయిందని, ఇదంతా కమ్యూనిస్టుపార్టీ వలన దాని నాయకుల ప్రోద్బలంవల్లనే జరిగిందంటూ పార్టీని, నాయకుల్ని గంటసేపు అదేపనిగా తిట్టిపోసి ఒక మహజరు అక్కడ పడేసి వెళ్ళింది.

కాస్సేపటికి సుందరయ్య, బసవపున్నయ్యలకు భోజనం తెచ్చిన కార్యకర్తలతో బయట పడుకున్న బసవపున్నయ్యగారు "ఏం భోజనమో- ఏమో....ఫలానా నాయకుడి భార్యవచ్చి మమ్మల్ని నానా తిట్లు తిట్టి ఇదిగో ఈ మహజర్ ఇక్కడ పడేసి పోయింది" అనగానే లోపల పడుకున్న సుందరయ్యగారు నవ్వుతూ "తిట్లన్నీ బయట పడుకున్న బసవపున్నయ్య అందుకున్నాడు. లోపల వున్న నాకు మాత్రం ఈ మహజరే అందింది" అన్నారట.

## పొగడ్తలకు వ్యతిరేకం

సుందరయ్యగారికి పొగడ్తలంటే ఇష్టంవుండేదికాదు. పైగా పూర్తిగా వ్యతిరేకించేవారు. ఆయనకు జబ్బుచేసి మాస్కో వెళ్ళినప్పుడు "జనశక్తి" పత్రికా సంపాదకులు సుందరయ్యగార్ని కీర్తించుతూ మాస్కోనుంచి ఆరోగ్యంగా తిరిగిరావాలని ఆకాక్షించుతూ ఒక గేయం ప్రచురించారు. సుందరయ్యగారు మాస్కోనుంచి తిరిగి వచ్చిన తర్వాత పత్రికా సంపాదకులను గట్టిగా మందలించుతూ "నన్ను గురించి ఏదైనా మంచిగా రాయవలసివస్తే ఇప్పుడు కాదు నేను చనిపోయేనాటికి కూడా కమ్యూనిస్టుగా పనిచేస్తూవుంటే అప్పుడు రాయండి" అన్నారట. అలాగే జనశక్తి దినపత్రిక ప్రారంభో

త్సవ సందర్భంగా పార్టీ కార్యకర్తలు "సుందరయ్య జిందాబాద్" అని నినాదాలిస్తుంటే వారిని మందలించుతూ "ఇప్పుడుకాదు సుందరయ్య జిందా బాద్ అనవల్సింది. నేను చివరిశ్వాస కమ్యూనిస్టుగా పీల్చిన రోజున ఆ మాట అనండి" అన్నారట.

మరొకసారి హైదరాబాద్‌లో యువజన సంఘ మహాసభ జరుగుతోంది. సభాధ్యక్షులు సుందరయ్యగార్ని పరిచయంచేస్తూ "పీడిత ప్రజల ప్రియతమ నాయకులు శ్రీ సుందరయ్యగారు" అనగానే సుందరయ్యగారు వెంటనే లేచి ఇలాంటి విశేషణలు, అతిశయోక్తులు అలా తేలిగ్గా వాడటం మంచిదికాదు అని హితవు చెప్పారు.

అలాగే మరొకసారి విజయవాడలో ఒక ప్రాంతానికి 'సుందరయ్య నగర్' అని నామకరణం చేసి బోర్డు పెడితే ఆబోర్డు తక్షణం తీసివేయించి తన వినమ్రతను చాటుకున్నారు.

## సుందరయ్య దుకాణం

సుందరయ్యగారు ప్రజాసేవకు అంకితమైన తొలి రోజుల్లో ఆయన స్వగ్రామం నెల్లూరు జిల్లా అలగానిపాడులో రైతులు, వ్యవసాయ కూలీల కోసం ఒక సహకార సంఘాన్ని నడిపేవారు. లాభనష్టం లేని పద్ధతిలో ఆ దుకాణంలో ప్రజలకు కావల్సిన నిత్యావసర సరుకులు విక్రయిస్తూ వుండేవారు. ఆ సహకార సంఘం సుందరయ్య దుకాణంగా ప్రసిద్ధి చెంది చుట్టుప్రక్ల గ్రామాలవారు కూడా వచ్చి ఆ దుకాణంలో సరుకులు కొనుక్కునేవారు. ఆ దుకాణాన్ని సుందరయ్య ఒక్కరే నడిపేవారు. అన్ని పనులూ ఆయనే చేసుకునే వారు. ప్రతి రోజూ సైకిల్‌మీద నెల్లూరు వెళ్ళి సరుకులు తెచ్చి అమ్ముతూ వుండేవారు. సైకిల్ మీద తేవడానికి వీలులేని కిర్సనాయిల్ డబ్బాలు వగైరా బస్సుమీద వేసుకొచ్చి బస్సు నుంచి ఊళ్ళోకి వున్న రెండు మైళ్ళు కావిట్లో వేసుకు వచ్చేవారు.

## కామేశ్వరమ్మ హోటల్

సుందరయ్యగారు ఏలూరులో వుండే రోజుల్లో అక్కడ కామేశ్వరమ్మ హోటల్ అనే బ్రాహ్మణ హోటల్ వుండేది. సుందరయ్య, ఆయన అనుచరులు ఆ హోటల్‌లోనే భోంచేసేవారు. ఆ హోటల్ యజమానురాలు కామేశ్వరమ్మ నోటి గద్దరి మనిషి. అందర్నీ దబాయించేది. పదార్థాలు కొంచెం కొంచెం మాత్రమే వడ్డించేది. సుందరయ్యగారికి కూరలు, నెయ్యి ఎక్కువగా వడ్డించుకోవడం అలవాటు. కామేశ్వరమ్మ రవ్వంత కూర, రెండు బొట్లు నెయ్యి వడ్డించి సరిపెట్టేది. సుందరయ్యగారు ఇంకా కాస్త వడ్డించు అనగానే "ముందు ఇది తినవయ్యా తర్వాత వడ్డిస్తాను" అనేది. సుందరయ్యగారు ఆ కాస్తంతా రెండు ముద్దల్లో ఖాళీ చేసి మళ్ళీ కేక వేసేవారు. మళ్ళీ కొంచెం వడ్డించి వెళ్ళేది. దాన్ని కూడా ఖాళీచేసి మళ్ళీ పిలవడం, ఆమె విసుక్కుంటూ వచ్చి కాస్తంత విస్తర్లో వేసి "ఇదిగో అబ్బాయ్, నీవు మా హోటల్‌కు రేపటి నుంచి రావద్దు. నీ చుట్టూ తిరగలేక చస్తున్నా" అంటూ వుండేది. అయినా సుందరయ్యగారు ఆ హోటల్‌కి వెళ్ళడం మానేవారే కాదు. కామేశ్వరమ్మ కూడా ఏదో బెదిరించడానికి గాని గట్టిగా రావద్దని ఏనాడూ తెగేసి చెప్పేది కాదు. సుందరయ్యగారు మామిడికాయ పచ్చడి చాలా ఇష్టంగా తినేవారు. వేరే కూరలు ఏమీ లేకపోయినా మామిడికాయ పచ్చడి, నెయ్యితో తృప్తిగా భోంచేసేవారు. మామిడికాయ పచ్చడి ఎక్కువగా తినటం వలన కడుపులో అల్సర్ ఏర్పడి చికిత్స కోసం మాస్కో కూడా వెళ్ళాల్సి వచ్చింది.

## సైకిల్ వీరుడు

సుందరయ్యగారికి సైకిల్ తొక్కడంలో మంచి సామర్థ్యం వుండేది. సైకిల్‌కు, ఆయనకు విడదీయరాని సంబంధం వుండేది. అసలు ఆయన్ని సైకిలు వీరుడని కూడా కొంతమంది పిలిచేవారు. దేశానికి స్వాతంత్ర్యం రాక పూర్వం కమ్యూనిస్టు పార్టీపై నిషేధం వున్న రోజుల్లో

రహస్యంగా "స్వతంత్ర భారత్" అనే సైక్లోస్టయిల్ చేసిన పత్రికను నడిపేవారు. సుందరయ్యగారు ఆ పత్రికను పోలీసుల కంట పడకుండా సైకిల్‌పై ఊళ్ళ వెంట తిరిగి పార్టీ సభ్యులకు అందజేస్తూ వుండేవారు. ఏలూరు, గుడివాడ, విజయవాడ మొదలైన చోట్లకు రహస్యంగా రాత్రి పూట డొంక రోడ్లవెంట సైకిల్‌పై తిరుగుతూ పత్రికను చేరవేస్తూ వుండేవారు. అలాగే ఒకసారి సుందరయ్యగారు అవనిగడ్డలో పత్రిక ఇచ్చి విజయవాడ వస్తున్నారు మధ్యలో వర్షం సాగింది. డొంక దారిపై ప్రయాణం. వల్లూరు వచ్చేసరికి వర్షం మోపై మట్టిరోడ్డు కావడం వల్ల సైకిల్ కదలలేని పరిస్థితి ఏర్పడింది. పాపం సుందరయ్యగారు ఏం చేస్తారు. సైకిల్ నెత్తిమీద పెట్టుకొని మిగతా 9 మైళ్ళు మోసుకుంటూ విజయవాడ వచ్చి చెడీ చేరారట! సుందరయ్యగారు ఢిల్లీలో పార్లమెంట్ సభ్యులుగా వున్నా, హైదరాబాద్‌లో అసెంబ్లీ ప్రతిపక్ష నాయకుడిగా వున్నా సైకిల్ మీదే ఆయన ప్రయాణం అంతా.

## ప్రకాశంగారి బుకాయింపు

1935లో జరిగిన సంగతి. సుందరయ్య అప్పుడు సామాన్య కార్యకర్తగానే వున్నాడు. ఒకానొక బహిరంగ సభలో ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారు ఆవేశంగా ఉపన్యసిస్తూ సోవియెట్ యూనియన్‌ను దుయ్యబడుతున్నారు. అప్పుడు ప్రేక్షకులలో కూర్చున్న సుందరయ్యలేచి "మీరు చెప్పేదంతా అబద్ధం" అని కేక పెట్టారు. ప్రకాశంగారు ఉపన్యాసం ఆపి తన సహజ ధోరణిలో "ఎవడ్రా కేక పెట్టింది?" అని గద్దించారు. సుందరయ్య లేచి "నేనే. నా పేరు సుందరయ్య. మీరు చెప్పేదంతా నిజం కాదు" అని నిలబడ్డాడు. ప్రకాశం గారికి ఏం చేయడానికి పాలుపోక "అట్లాగా నీవు పుట్టకముందే నేను సోవియెట్ రష్యా వెళ్ళి వచ్చా. ఇక కూర్చో" అన్నారట. నిజానికి ప్రకాశంగారు ఎన్నడూ రష్యా వెళ్ళలేదు. ఊరికే అలా బుకాయించారు, సుందరయ్యను కూర్చో బెట్టడానికి.



పరిశోధనాలయాన్నే

పిరమిడ్‌గా నిర్మించుకున్న

# సి. వి. రామన్

**1925లో...** డాక్టర్ సి.వి.రామన్ ప్రముఖ పారిశ్రామికవేత్త జి.డి బిర్లాకు ఒక లేఖ రాస్తూ "నేను చేసే పరిశోధనకు కొన్ని పరికరాలు ఇతర దేశాల నుంచి దిగుమతి చేసుకోవాల్సి వుంది. మీరు గనుక దయతల్చి ఒక్క 20 వేల రూపాయలు సహాయం చేస్తే నా పరిశోధన కొనసాగించి నోబెల్ బహుమతి సంపాదించగలననే గట్టి నమ్మకం" అన్నారు. బిర్లా వెంటనే ఆ మొత్తాన్ని చెక్కు ద్వారా



పంపడం, సి.వి. రామన్ తనక్కావలసిన విదేశీ పరికరాల్ని తెప్పించుకొని పరిశోధన చేసి "రామన్ ఎఫెక్ట్" కనిపెట్టడం, అనుకున్నట్టుగానే 1930లో రామన్‌కు నోబెల్ బహుమతి రావడం జరిగిందంటే రామన్‌కు తన కృషి మీద వున్న ఆత్మ విశ్వాసం ఎంతటిదో ఊహించుకోవచ్చు.

రామన్ నోబెల్ బహుమతి స్వీకరించడానికి వెళ్ళినప్పుడు కూడా మామూలుగా ఎప్పటిలాగానే తలపాగాతోనే వెళ్ళడమే కాకుండా బహుమతి స్వీకరణ తర్వాత ప్రసంగిస్తూ, ప్రక్కనే కూర్చొన్న ఒకానొక బ్రిటిష్ మంత్రి వైపు కొరకొర చూస్తూ "ఈ నోబెల్ బహుమతి నేను నా పక్షాన గాక నా దేశస్థులందరి తరపున, ముఖ్యంగా చెరసాలలో మ్రగ్గుతున్న నా సోదర భారతీయుల తరపున స్వీకరిస్తున్నా"నని అన్నారంటే ఆ విజ్ఞాని జాతీయత, దేశభక్తి కూడా అర్థం చేసుకోవచ్చును.

1888 నవంబర్ 7న జన్మించారు చంద్రశేఖర వెంకటరామన్. పుట్టింది తమిళనాడులోని తిరుచనాపల్లి అయినా తండ్రి విశాఖపట్నం ఎ.వి.ఎన్. కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తూ వుండడం వలన రామన్ బాల్యం విశాఖపట్నంలోనే గడిచింది. అందువల్లనే ఆయన తమిళంతో పాటు తెలుగు కూడా ధారాళంగా మాట్లాడేవారు మిడిల్ స్కూల్లో చదివే రోజులలోనే రామన్ స్థానికంగా దొరికే సామాగ్రితో డైనమో తయారుచేశారు. 18 ఏళ్ళ వయస్సులో పరిశోధనా వ్యాసాలు వ్రాసి పత్రికలకు పంపేవారు. రామన్ ఎం.ఎ. చదవడానికి కాలేజీలో చేరాడే గాని వాస్తవానికి ఆయన క్లాసుకి హాజరయింది మొత్తం మీద ఏ 10, 15 రోజులు మాత్రమే! మిగతా రోజుల్లో ఇంటివద్దనే పరిశోధనలు చేస్తూనే ఎం.ఎ పూర్తిచేశారు. శారీరకంగా అర్భకుడవడం వలన ఇంకా పై చదువులకు విదేశాలకు వెళ్ళడం సాధ్యపడలేదు. ఇది ఒక రకంగా మంచిదే అయింది. పుట్టిన గడ్డ మీదే స్వయంకృషితో సొంత ఆలోచనలతో దేశీయ పరికరాలతో పరిశోధనలు చేయడానికి వీలుపడింది.

ఎకౌంటెంట్ జనరల్‌గా పదేళ్ళు పనిచేశారు రామన్. తర్వాత కలకత్తా విశ్వవిద్యాలయంలో 16 ఏళ్ళు ప్రొఫెసర్‌గా పనిచేశారు. ఆ

తర్వాత బెంగుళూరులోని 'ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్'కు డైరెక్టరుగా వెళ్ళారు.

ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ నుంచి రిటైర్ కాగానే తన యావదాస్తి వెచ్చించి బెంగుళూర్‌లోనే 'రామన్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్'ను స్థాపించారు. అందమైన పూతోటల మధ్య అన్ని హంగులతో రామన్ పరిశోధనాలయం సర్వాంగ సుందరంగా నిర్మించబడింది. రామన్ మాటల్లో — "ఈ పరిశోధనాలయం నా స్మృతి చిహ్నం. ఈజిప్టు రాజులు తమ మరణానికి ముందే పిరమిడ్లు కట్టుకున్నట్టుగా ఈ పరిశోధనాలయం నా పిరమిడ్‌గా నిర్మించుకున్నాను."

రామన్‌కు ఖనిజాలు, స్ఫటికాలు సేకరించడం హాబీగా వుండేది. ఆయన విదేశాలకు ఎప్పుడు వెళ్ళినా రకరకాల స్ఫటికాలు తెస్తూ వుండేవారు. ఒకసారి ఆయన యూరోప్ పర్యటన నుంచి వస్తూ పెద్ద మూట స్ఫటికాలు తెస్తున్నారు. విమానాశ్రయంలో ఈ మూటకు బోల్డు సర్ ఛార్జీ కట్టవల్సి వచ్చింది. అందుకు సరిపడ పైకం తన దగ్గర లేకపోతే తన వద్దనున్న మిగతా వస్తువులే కాక కట్టుబట్టలు కూడా విమానాశ్రయ అధికారులకు తాకట్టుపెట్టి ఆస్ఫటికాల మూట తెచ్చుకున్నారట !

రామన్‌కు అత్యున్నత భారతదేశపుఅవార్డు 'భారతరత్న' లభించింది. సోవియట్ దేశపు 'ఆర్డర్ ఆఫ్ లెనిన్' కూడా లభించింది. ఇక ఎన్ని విశ్వవిద్యాలయాలు డాక్టరేట్లు ఇచ్చాయో, ఎన్ని విదేశీ అవార్డులు, మెడల్స్ వచ్చాయో లెక్కలేదు.

భారతరత్న సి.వి. రామన్ 1970 నవంబర్‌లో మరణించారు. ఆయన భౌతిక కాయాన్ని రామన్ పరిశోధనాలయం ఆవరణలోనే దహనం చేశారు.



"సెనేట్ మెంబరు పదవి లభించటం
కోతికి కొబ్బరికాయ లభించినట్లే" అనిపించుకున్న

# విశ్వనాథ సత్యనారాయణ

---

కీర్తిశేషులు ప్రసిద్ధ కవులు విశ్వనాథ సత్యనారాయణ, పింగళి లక్ష్మీకాంతంగార్లకు సాహితీపరంగానేగాక వ్యక్తిగతంగా కూడా అసూయా ద్వేషాలు వుండేవి.



ఒకసారి ఆంధ్రవిశ్వవిద్యాలయం సెనేట్ ఎన్నికలు జరుగుతున్నాయి. పింగళి లక్ష్మీకాంతం గారు అంతకు పూర్వం కూడా కొన్నిసార్లు సెనేట్ మెంబరుగా నిలబడి గెల్చారు. ఈసారి మాత్రం విశ్వనాథ సత్యనారాయణగారితో పోటీ పడి ఓడిపోయారు. ఆ సందర్భంగా పరామర్శించటానికి వచ్చిన తన అభిమానులతో "ఈ ఓటమి నాకైతే కరిమింగిన వెలగపండేగాని అతడికి మాత్రం (విశ్వనాథవారు సెనేట్ మెంబరుగా ఎన్నికకావటం ఇదే మొదటి సారి) కోతికి దొరికిన కొబ్బరికాయే!" అన్నారట.



అష్టావధానికి అర్జంటు పని కల్పించిన

# త్రిపుర్నేని రామస్వామి చౌదరి

సంఘ సంస్కర్త, హేతువాది కవిరాజు త్రిపుర్నేని రామస్వామి చౌదరిగారు లండన్‌లో బారిష్టరు చదివే రోజుల్లో కూడా మామూలు గానే పంచెకట్టి తలపాగా చుట్టుకునే వారు. ఆయన అద్దెకు వుండే ఇంటావిడ ఈ పద్ధతి నచ్చక ఆయనతో "ఎక్కడ వుండేటప్పుడు అక్కడి పద్ధతులు ఆచరించాలి. నీవు కూడా ఇక్కడ అందరిలాగా సూటు వేసుకోరాదూ?" అనగా రామస్వామిగారు చటుక్కున "మరి మీ



ఇంగ్లీషు వాళ్ళు మా దేశం వచ్చినప్పుడు మా పద్ధతుల ప్రకారం దుస్తులు ధరించరెందుకని" అనగా మళ్ళీ ఎప్పుడూ ఆవిడ రామస్వామి గారి దుస్తుల గురించి ప్రశ్నించలేదట! రామస్వామిగారు లండన్‌లో వున్నప్పుడు కూడా మాంసాహారం తీసుకునేవారు కాదు. తనువుండే ఇంటికి ఎంతో దూరంలో వున్న శాకాహార హోటల్‌కు వెళ్ళి భోంచేసి వచ్చేవారు.

## బ్రాహ్మణమతద్వేషి మాత్రమే

రామస్వామిగారు బ్రాహ్మణ ద్వేషిగా కొంతమంది ఆయన్ని అనుమానించే వారు గాని వాస్తవానికి వారు బ్రాహ్మణ మతద్వేషిగాని బ్రాహ్మణ వ్యతిరేకి మాత్రం కాదు. ఇందుకు నిదర్శనం తెనాలి మున్సిపల్ ఛైర్మన్‌గా ఆయన వున్నప్పుడు దాదాపు ఉద్యోగాలన్నీ బ్రాహ్మణులకే ఇచ్చారు. ఇంత కన్నా వేరే నిదర్శనం ఏముంటుంది?

## ఆంటీ అంటనట్లు వుండే తండ్రి కొడుకులు

రామస్వామి చౌదరిగారు వారి కుమారుడు ప్రసిద్ధ రచయిత గోపీ చంద్ గారు అంటీ అంటనట్లుగా వుండేవారు. వాళ్ళిద్దరు ఎదురు బొదురుగా ఏనాడూ మాట్లాడుకునేవారు కాదట! అయితే గోపీచంద్‌గారు తండ్రి అంటే ఎనలేని భయభక్తులతో వుండేవారు. అలాగే రామస్వామిగారు కూడా కుమారుడంటే ఎంతో ఆప్యాయంగా వుండేవారు. అయితే దాన్ని బయటకు కనపర్చేవారు కాదు.

## అరటిగెల ఈశాన్యం మూల

ఒకసారి కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు సూతాశ్రమానికి వచ్చారు. అప్పుడు చౌదరిగారు అరటి చెట్టుకు పాదుచేస్తున్నారు. విశ్వనాథగారు "రామస్వామిగారూ అరటిగెల ఈశాన్యం మూల వేయ

రాదంటారు, వెంటనే కోయించండి" అనగానే రామస్వామిగారు "అట్లాగే కోద్దాము లెండి. కాని మీరు చెప్పినట్లు తక్షణంకాదు. అరటిగెల ఇంకో వారం రోజుల్లో పక్వానికి వస్తుంది. అప్పుడు కోస్తాములెండి" అనగానే విశ్వనాథగారు మళ్ళీ మాట్లాడలేదట.

## కమ్మ – కుమ్మరి – విప్ర – వుప్పర

గుంటూరు జిల్లా కొల్లూరులో జరిగిన ఒక సాహిత్యసభ సందర్భంగా ఒక దీక్షితులుగారు వ్యంగ్యంగా "కమ్మ", "కుమ్మర" శబ్ద సామ్యం బట్టి వీరిద్దరు ఏకోదరులనగానే తక్షణం చౌదరిగారు లేచి "అలాగైతే 'విప్ర' 'వుప్పర' సామ్యాన్ని బట్టి వీరిద్దరూ మాత్రం ఏకోదరులు గాకుండా పోతారా?" అనగానే దీక్షితులుగారు నోరుమూయటం ప్రేక్షకులు హర్ష ధ్వానాలు చేయటం జరిగింది.

## నూలువడికితే స్వరాజ్యం వస్తుందా ?

రామస్వామిగార్కి గాంధీజీ పట్ల అపార శ్రద్ధా భక్తులు వుండేవి. గాంధీజీని ఎంతో గౌరవించేవారు. అయితే గాంధీజీ సిద్ధాంతాల పట్ల ఆయనకు కొన్ని అనుమానాలు వుండేవి. ఒక సందర్భంగా ఇలా అన్నారట. "గాంధీజీ నూలువడికితే స్వరాజ్యం వస్తుందంటారు. అసలు మనం స్వరాజ్యం కోల్పోయింది నూలు వడికే రోజుల్లోనే కదా? మరి మళ్ళీ నూలు వడికితే స్వరాజ్యం ఎలావస్తుందో నాకర్థం గాకుండా వుంది."

ఒక పెద్దమనిషి రామస్వామిగారి వద్దకు వచ్చి "ఇంతకీ దేవుడు ఉండాడనా? లేడనా?" అని సూటిగా ప్రశ్నించగా "నేరం చేస్తేనే కోర్టుకు వెళ్ళాల్సింది. అలాగే తప్పులు చేసినవాడే దేవుడ్ని కొలుస్తూ వుంటాడు. సత్ప్రవర్తన కలిగినవాడికి దేవుడితో పనిలేదు. పరమ నాస్తికుడైన కవి

రాజుగారు చివరి రోజుల్లో ఆస్తికుడుగా మారారని అంతేగాక రామనామ స్మరణ చేసేవారని ఆయన వ్యతిరేకులు ఒక పుకారు లేవదీశారు. ఈ పుకారు వట్టిదని జనాన్ని నమ్మించటానికి రామస్వామిగారి చివరిరోజుల్లో ఆయనతో సన్నిహితంగావున్న కన్నెగంటి జగ్గయ్యగారు ఎంతో ప్రయాస పడవల్సి వచ్చింది.

## చెళ్ళపిళ్ళవారి శిష్యులా ?

రామస్వామిగారు బాగా పేరులోకి వచ్చి అనేకచోట్ల సన్మానాలు అందుకొంటున్న రోజుల్లో హఠాత్తుగా చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి అభిమానులు "ఈ రామస్వామి చెళ్ళపిళ్ళ వారి శిష్యులే"నంటూ ఒక పుకారు లేవదీశారు. ఈ పుకారు లేవదీయటంలో చెళ్ళపిళ్ళ వారి పాత్ర, స్వార్ధం కూడా వుంది. వాస్తవానికి రామస్వామిగారు చెళ్ళపిళ్ళవారి శిష్యుడు కానే కాదు. అయితే రామస్వామిగారు బందరులో చదువుతున్న రోజుల్లో చెళ్ళపిళ్ళ వారు ఆయన క్లాసుకి తెలుగుపండితులుగా వుండేవారు. పైగా ఆ రోజుల్లో చెళ్ళపిళ్ళవారు రామస్వామిగార్ని 'బ్రాహ్మణేతర కుర్రవాడి'గా కూడా చూసేవారట. అంతకన్నా ఒరగ బెట్టింది ఏమీలేదు.

## శ్రీరాముడికి ప్రతిసంవత్సరం పెళ్ళా ?

రామస్వామిగారు తెనాలిలో ఉన్నంతకాలం ఎవరైనా పురాణ, మత సంబంధమైన ఉపన్యాసాలు చెప్పటానికి జడిసేవారు. ఒకసారి కొంతమంది తెనాలిలో శ్రీరామనవమి ఉత్సవాలు చేస్తూ ఆ సందర్భంగా రామస్వామి గార్ని ఉపన్యసించటానికి ఆహ్వానించారు. రామస్వామిగారు ఉపన్యాసం ప్రారంభించి "శ్రీరాముడు ప్రతి సంవత్సరం పెళ్ళి చేసుకోవటం ఏమిటి? ఇతనికి నీతినియమం లేదా ఏమిటి?" అంటూ రామునిలోగల లోపాలన్నీ ఏకరువు పెట్టి, కేవలం ఈ ఉత్సవాలన్నీ బ్రాహ్మణులు బ్రతుకుతెరువు

కోసం చేసే తంతులు తప్ప మరేమీ కాదంటూ ఉపన్యసించారు. దాంతో ఈయన్ని ఎందుకు పిలిచామూఅని నెత్తీ నోరు బాదుకున్నారట ఆహ్వానించిన పెద్దలు.

## అష్టావధానిగారికి అర్జంటు పని

ఒకసారి ఒక అష్టావధాని గారు తెనాలిలో అష్టావధానం చేస్తు న్నారు. ఇలా ఒక సమస్య అడుగుతున్నారు. రామస్వామిగారు రాముడు సీత సంవాదం గురించి ఒక పద్యం చెప్పమనగానే అవధానిగారు జంగు తిని రామస్వామిగారి చేతుల్లో పరాభవం తప్పదని అర్థంతరంగా ఏదో అర్జంటుపని వచ్చిందని అవధానం ఆపేసి చల్లగా జారుకున్నాడట.

ఒక సందర్భంలో ఒక పండితుడు కవిరాజుతో మతవిషయమై తీవ్రంగా చర్చిస్తున్నాడు. ఒక సందర్భంగా కవిరాజు ఆ పండితుణ్ని "మీరు మ్లేచ్ఛులు గదా?" అనగానే ఆయన ఉగ్రుడై "కాదు. నేను స్వచ్ఛమైన బ్రాహ్మణ్ని అన్నాడట. "మరి మీరు మనుస్మృతి ఒప్పుకోరా? అని రామ స్వామి గారు అనగా "ఎందుకు ఒప్పుకోను. దానిలోని ప్రతి అక్షరం శిరసావహిస్తాను" అని పండితుడు అనగానే రామస్వామిగారు మనుస్మృతి లోని "వింధ్యపర్వతాలు దాటి వచ్చిన వారంతా మ్లేచ్ఛులే"నని ఉన్న ఒక శ్లోకం చదివి ఆ పండితులవారి నోరు మూయించారు.

కవిరాజుగారు మొదట్లో తన పేరును త్రిపుర్నేని రామస్వామి చౌదరిగా రాసుకునేవారు క్రమంగా రామస్వామిగారు కులమతాలకు అతీ తంగా హేతువాదిగా మానవతావాదిగా ఎదగటంతో కులం చిహ్నమైన "చౌదరి" అక్షరాలను విసర్జించారు.



# దస్తూరి పరమదరిద్రంగా వుండే కమ్యూనిస్టు సిద్ధాంతకర్త

# కారల్ మార్క్స్

కమ్యూనిజం సిద్ధాంతకర్త కారల్ మార్క్స్ కడు పేదవాడు. పేదరికంలో అష్టకష్టాలు పడేవాడు. ఆయన రోజువారీ వాడే వస్తువులు కూడా ఒక్కోసారి తాకట్టులోనే వుండేవి. ఒకసారి మార్క్స్ తాకట్టు పెట్టిన వస్తువుని అనుమానించి తాకట్టుకొట్టు యజమాని పోలీసురిపోర్టు ఇవ్వగా మార్క్స్‌ని అరెస్టుచేసి ఒక రోజు జైల్లో వుంచారు. మార్క్స్ కుమార్తె చనిపోతే అంత్యక్రియలు జరిపించటానికి చేతిలో పైసాలేకపోతే నలుగుర్ని యాచించవల్సి వచ్చింది. అప్పులవాళ్ళ బాధపడలేక మార్క్స్ కొన్నిరోజులు మొఖం చాటేస్తూ వుండేవాడు.



ఈ అప్పుల బాధ తప్పించుకోవటానికి ఏదైనా ఉద్యోగంలో చేరాలని ప్రయత్నించాడు. లండన్ రైల్వే కార్యాలయానికి దరఖాస్తు చేశాడు. ఇంటర్వ్యూ వచ్చింది కాని ఆయన దస్తూరి పరమ దరిద్రంగా వుండటంతో ఆయనకు ఉద్యోగం ఇవ్వటానికి అధికార్లు ఒప్పుకోలేదు.

మార్క్సిజం సిద్ధాంత గ్రంథం "క్యాపిటల్" మొదటి భాగం రాసి దానిపై వచ్చే ఆదాయంతోనైనా తన ఆర్థిక బాధలు తీరతాయని ఆశించాడు. కాని అది కూడా నిరాశే అయింది. మొదట్లో జనం ఆ గ్రంథాన్ని పెద్దగా ఆదరించలేదు. మొదటి వెయ్యి ప్రతులు నాలుగేళ్ళకు గాని అమ్ముడుపోలేదు. నిరాశ, నిస్పృహలతో మార్క్స్ తన అల్లుడికి రాసిన ఉత్తరంలో "క్యాపిటల్" పుస్తకం రాస్తూ కాల్చిన సిగరెట్ల ఖర్చు కూడా ఆ పుస్తకం అమ్మకాల ద్వారా రాలేదని వాపోయాడు. 

ఆరుసార్లు యఫ్.ఎ. తప్పిన
ప్రసిద్ధ పత్రికా సంపాదకులు

# ముట్నూరి కృష్ణారావు

---

ప్రసిద్ధ పత్రికా సపాదకులు ముట్నూరి కృష్ణారావు యఫ్.ఎ. (ఇప్పటి ఇంటర్మీడియట్‌ను అప్పుడు యఫ్.ఎ. అనేవారు) ఆరుసార్లు తప్పారు. ఆయనకు ఇంగ్లీషబాగా వచ్చేది కాని లెక్కలు మాత్రం వచ్చేవికావు. అందువలన ఆయన ఎప్పుడూ లెక్కలలో తప్పుతూ వుండేవారు, అయితే కృష్ణారావు ఇంగ్లీషులో మాత్రం అఖండులు ఆయన యఫ్.ఎ.చదివే రోజుల్లోనే బి ఎ. విద్యార్థులకు ట్యూషన్లుచెప్పే వారు. షేక్స్ పియర్ నాటకాలు ఆయనకు కొట్టినపిండి.



బందరు నోబుల్ కాలేజీలో ముట్నూరి కృష్ణారావు యఫ్.ఎ. చదివే రోజుల్లో ప్రసిద్ధ రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు ఉపాధ్యాయులుగా వుండేవారు. ఇంగ్లీషు బోధించటంలో వెంకటరత్నం నాయుడుగార్కి పెద్దపేరుండేది. ఒకసారి కృష్ణారావుగారు బి.ఎ. విద్యార్థులకు పాఠాలు చెబుతున్నారు. అటుగా వెళ్ళుతున్న వెంకటరత్నంనాయుడుగారు కృష్ణారావుగారి ఆంగ్ల పాండిత్యానికి ముగ్ధులై ఆపళంగానే గంటసేపు చాటుగా నిలబడి విన్నారు. కృష్ణారావుగారు పాఠంచెప్పటం కాగానే వెంకటరత్నం నాయుడుగారు ఆనందం పట్టలేక కృష్ణారావుగార్ని కౌగలించుకొని "నాకంటే విద్యార్థివైనా నీవే పాఠం బాగా చెప్పావు." అంటూ ఎంతగానో మెచ్చుకున్నారట!

## నెలకు వందరూపాయలు

ముట్నూరి కృష్ణారావుగారు "కృష్ణా పత్రిక" సంపాదకత్వం వహించే రోజుల్లో ఖర్చులన్నీ పోను నెలకు 100 రూపాయలు మాత్రమే మిగిలేవి. సాదాగా మితవ్యయంతో ఈ 100 రూపాయలతోనే కుటుంబ పోషణ చేసుకునేవారు. ఆర్థిక వేత్త, వ్యాపార దృష్టి కల్గిన పట్టాభి సీతారామయ్యగారు ఒకసారి కృష్ణారావుగారితో "3,4 వేల రూపాయలు ఖర్చుపెట్టి ప్రెస్ పెద్దది చేసి కృష్ణాపత్రిక సర్క్యులేషన్ పెంచితే మరో 300 దాకా సంపాదించ వచ్చుగదా?" అనగా నేను కృష్ణాపత్రికను వ్యాపార దృష్టితో నడపంలేదు. వందరూపాయలు మాకుటుంబానికి చాలకపోవు" అని మొహమాటం లేకుండా సమాధానం చెప్పారట పత్రికా సంపాదకులకు ఆదర్శప్రాయుడు కృష్ణారావు.

## మామూలు కృష్ణారావు - సంపాదకుడు కృష్ణారావు

ముట్నూరి కృష్ణారావుగారు కృష్ణాపత్రికను ఎంతో దీక్షదక్షతలతో నిర్వహించారు. సంపాదకత్వం ఒక తపస్సుగానే భావించారు. ఆయన సంపాదకీయాలు వ్రాసేటప్పుడు స్వపరభేదం పాటించేవారుకాదు. సంపాదకుని కుర్చీలో వున్నంతసేపు రాగద్వేషాలకు అతీతంగా ప్రవర్తించేవారు. అవసరం అయితే తన సన్నిహిత మిత్రులను విమర్శించటానికి వెనుకాడేవారుకాదు. కృష్ణారావుగారు పట్టాభిసీతారామయ్యగారు అత్యంత సన్నిహితులు మంచి మిత్రులుకూడా. ఒకసారి ఏదో సందర్భంగా కృష్ణారావుగారు తన సంపాదకీయంలో పట్టాభిగార్ని తీవ్రంగా విమర్శించారు. అందుకు పట్టాభిగారు ఎంతో బాధపడి ఈ విషయం రైతునాయకులు గొట్టిపాటి బ్రహ్మయ్యగారితోకూడా ప్రస్తావించారు. పట్టాభిగారి ఆవేదన బ్రహ్మయ్యగారు కృష్ణారావుగారితో చెప్పగా అందుకు కృష్ణారావుగారు "సంపాదకునిగా ఈ కుర్చీలో వున్నంతసేపునాకు శత్రుమిత్ర భేదంలేదు. కృష్ణాపత్రిక సంపాదకునిగా నేను దేవునిసైతం లక్ష్యపెట్టను" అని తలపాగా తీసి బల్లమీద పెట్టి ఇవతల కుర్చీలోకి వచ్చి కూర్చుని "ఇప్పుడు నేను మామూలు కృష్ణారావుని. పట్టాభి నాకు ప్రియమిత్రుడు పట్టాభిని ఎవరైనా అంటే నేను సహించను. కాబట్టి మామూలు కృష్ణారావుకి, కృష్ణాపత్రిక సంపాదకుడు కృష్ణారావుకి భేదం గ్రహించు" అన్నారట!



లంచాలు తినే మేజిస్ట్రేట్‌కు బుద్ధిచెప్పిన

## దే శ భ క్త

# కొండ వెంకటప్పయ్య పంతులు

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు కాంగ్రేసు నాయకులు దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారు విద్యార్థిగా వున్నరోజుల్లో



జరిగినసంగతి. కొండ వెంకటప్పయ్య అప్పుడు గుంటూరులో మెట్రిక్యులేషన్ చదువుతున్నారు. ఆరోజుల్లో గుంటూరులో వెంకటప్పయ్య పంతులు చదివే మిషన్ పాఠశాలకు డాక్టర్ యాలి అనే క్రైస్తవ పాదిరీ హెడ్‌మాష్టర్‌గా కూడావుండేవాడు. వెంకటప్పయ్య పంతులంటే డాక్టర్ యాలు ప్రత్యేకాభిమానంగా వుండేవాడు.

వెంకటప్పయ్యకూడా డాక్టర్ యాలుపట్ల ఎంతో గౌరవప్రపత్తులతో వుండే వారు. వెంకటప్పయ్య తరుచుగా డాక్టర్ యాలు ఇంటికికూడా వెళ్ళేవారు. డాక్టర్ యాలు భార్య యాలుదొరసాని కూడా వెంకటప్పయ్యపట్ల పుత్ర వాత్సల్యంతో వుండేది.

## క్రైస్తవమతంలో చేరాలని ఉబలాటం

డాక్టర్ యాలు ఆయన భార్యకూడా క్రైస్తవ మతంపట్ల ప్రగాఢాభి మానాలతో వుండేవారు. ప్రతిపని క్రీస్తుపేరుమీదగానే చేసేవారు. హిందూ వులు ఎవరైనా క్రైస్తవమతంలో చేరతానంటే వారికి పరమానందంగా వుండేది. డాక్టర్ యాలు ఇంటికి తరుచుగా వచ్చిపోతూవుండే వెంకట ప్పయ్యకు డాక్టర్ యాలు ఆయన భార్యపై ఎంతో గురికుదిరింది. వారి మంచితనం తనపై చూపే వాత్సల్యంకు ఎంతో ముగ్ధుడై ఒకనాడు హఠా త్తుగా తానుకూడా క్రైస్తవమతంలో చేరతానని యాలు దొరసానికి చెప్పే టప్పటికి ఆమె ఎంతో సంతోషపడి ఒక్కపరుగున బయట వరండాలో కూర్చొని చదువుకుంటున్న డాక్టర్ యాలుకుకూడా ఈ విషయం చెప్పే సింది. అంతటితో ఆగకుండా క్రైస్తవమతం స్వీకరించటానికి ఇంతకన్నా మంచి ముహూర్తంలేదని చెప్పి వెంకటప్పయ్యతో "జాధ్యం తీసేయ్. ఇప్పుడే క్రైస్తవమతం స్వీకరించటానికి తగుఏర్పాట్లు చేస్తాను" అంటూ అదే పనిగా తొందర పెట్టడం ప్రారంభించింది. డాక్టర్ యాలు మాత్రం భార్యను వారిస్తూ వెంకటప్పయ్యతో "తొందర ఏమీలేదు. నీవింకా కుర్రవాడివి మీఇంటికివెళ్ళి మీ అమ్మ, నాన్న, బంధువులను సంప్రదించిరా వాళ్ళుకూడా ఈ పనికి అంగీకరిస్తే క్రైస్తవ మతంలోకి మారుదువుగాని" అని సర్ది చెప్పి పంపాడట.

ఈ విషయం వెంకటప్పయ్యగారి ఇంటివద్ద తెలిసి నానాగొడవ అయింది. తల్లిదండ్రులు నెత్తినోరు బాదుకున్నారు. "పవిత్ర బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన నీకివేం బుద్ధులని" వెంకటప్పయ్యమీద విరుచుకు పడ్డారు. సంగతి తెలిసిన బంధువులు కూడా వచ్చి క్రైస్తవమతం తీసుకో వద్దని వెంకటప్పయ్యమీద వత్తిడి తీసుకువచ్చారు. అయినా వెంకటప్పయ్య తన పట్టుదల వీడకపోవటంతో వెంకటప్పయ్యకు ప్రాథమిక పాఠశాలలో విద్యాబుద్ధులు నేర్పిన కొండుకొట్ల సుబ్రమణ్యశాస్త్రిగార్ని తీసుకువచ్చారు. సుబ్రమణ్యశాస్త్రిగారంటే వెంకటప్పయ్యకు ఎంతో గౌరవం, గురిపుండేవి. ఆ వచ్చిన సుబ్రమణ్య శాస్త్రిగారు వెంకటప్పయ్యను ఒంటరిగా ఎడంగా తీసుకువెళ్ళి "బాబూ నీవింకా చిన్నవాడివి. శాస్త్రప్రవేశం లేనివాడివి. హిందూమతం గొప్పతనం గురించి తెలియనివాడివి. ఏమీ తెలియకుండా క్రైస్తవమతంలో చేరే బదులు ఒక పనిచెయ్యి. హిందూ మతగ్రంథాలు క్రైస్తవమత గ్రంథాలు క్షుణ్ణంగా చదువు. చదివిన తర్వాతకూడా నీకు హిందూమతం నుంచి క్రైస్తవమతంలోకి మారాలనిపిస్తే అలాగేచెయ్యి." అని హితవు చెప్పిన తర్వాత ఎట్టకేలకు గురువుగారు చెప్పిందికూడా సమంజసంగానే వుందని భావించి వెంకటప్పయ్య తన పట్టుదల సడలించాడు.

ఇది జరిగిన తర్వాత వెంకటప్పయ్య డాక్టర్ యాలుగారింటికి వెళ్ళి జరిగినదంతా చెప్పాడు. విశాల హృదయుడైన డాక్టర్ యాలు కూడా అందుకు సంతసించి మీ గురువు సుబ్రమణ్యశాస్త్రిగారు చెప్పినమాట లలో తప్పులేదు. ముందునీవు శాస్త్రపరిజ్ఞానాన్ని పెంచుకో. అన్నిమత

గ్రంథాలు చదువు. నీవు క్రైస్తవుడివి కానవసరంలేదు. మంచి హిందువు (బి ఎ గుడ్ హిందూ)గానేవుండు" అన్నాడట. అలాగే వెంకటప్పయ్యగారు జీవితాంతం మంచిహిందువుగానే వున్నారు.

## నూతనగృహంలో తద్దినం

కొండ వెంకటప్పయ్యగారు గుంటూరులో 1917లో నూతన గృహం నిర్మించుకున్నారు. గృహప్రవేశం సందర్భంగా విందు ఏర్పాటు చేశారు. ఆరోజుల్లో ఇంగ్లాండు వెళ్ళివచ్చినవారిని 'మైల' పడినవారిగా భావించేవారు సనాతన బ్రాహ్మణులు. అప్పట్లో గుంటూరు నుండి నడింపల్లి లక్ష్మీనరసింహారావు, పంగలూరు తల్పశాయిగార్లు చదువుల నిమిత్తం ఇంగ్లాండు వెళ్ళివచ్చినవారు. వీరిద్దర్నీ సనాతన బ్రాహ్మణులు ఏకార్యానికీ పిల్చేవారుకాదు. విందుకు అసలే పిల్చేవారుకాదు. వెంకటప్పయ్యగారు ఈ ఛాదస్తపు బ్రాహ్మణులమాట లక్ష్యపెట్టకుండా నడింపల్లి లక్ష్మీనరసింహారావు, పంగలూరు తల్పశాయిగార్లను విందుకు పిల్చారు. వీరిద్దరి గాలి తమకు సోకకుండా పూర్వాచార పరులైన బ్రాహ్మణులు తలుపులు బిడాయించుకొని ఇంటిలోపల కూర్చొని భోజనాలు చేశారట. విందుకువచ్చిన లక్ష్మీనరసింహారావు, తల్పశాయిగార్లు ఈ ఛాదస్తపు బ్రాహ్మణులతో తగాదాపడి వెంకటప్పయ్యగార్ని ఇరకాటంలో పెట్టటం ఇష్టంలేక బయట వరండాలోనే కూర్చొని భోంచేశారట !

వెంకటప్పయ్యగారి నూతన గృహప్రవేశం జరిగిన ఆరు రోజులకే తండ్రి తద్దినం వచ్చింది. నూతన గృహంలో తద్దినంలాంటి అశుభ కార్యములు చేయరాదని మళ్ళీ సనాతన బ్రాహ్మణులు గోలచేయటం ప్రారంభించారు. తమ మాటవినకుండా నూతనగృహంలో తద్దినం జరిపించితే గృహయజమానికి కీడు రాగలదనికూడా బెదిరించారు. వెంకటప్పయ్యగారు

ఈ బెదిరింపులకు లొంగకుండా నూతన గృహంలోనే తండ్రి తద్దినం జరిపించారు. ఆవిధంగా వెంకటప్పయ్యగారు జీవితాంతం చాదస్తపు హిందువుగాకుండా మంచి హిందువుగానే వుండిపోయారు.

## లంచాలు తీసుకునే మేజిస్ట్రేట్

దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారు బందరులో న్యాయవాదిగా వున్నప్పుడు జరిగిన సంగతి.

పశువులను గ్రామాధికార్లు బందెలదొడ్డికి తోలుకు పోతుండగా ఒకానొక రైతు తమకు అడ్డంతగిలాడనే నేరారోపణపై అవనిగడ్డ మేజిస్ట్రేట్ కోర్టులో కేసు దాఖలు చేయబడింది. మేజిస్ట్రేట్ ఆ రైతును జైలులో పెట్టించి దరిమిలా ఆరైతువద్ద వందరూపాయలు లంచంపుచ్చుకొని విడుదల చేయించాడు.

ఈ విషయం వెంకటప్పయ్య పంతులుగారికి తెలిసి మేజిస్ట్రేట్ న్యాయ విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాడని లంచాలు తీసుకుంటున్నాడని ఒక పిటీషన్ వ్రాసి పైఅధికార్లకు ఒక ప్రతి పంపి మరొక ప్రతిని మేజిస్ట్రేట్ కే స్వయంగా ఇంటికి వెళ్ళి ఇచ్చివచ్చారట!

మేజిస్ట్రేట్ ఇందుకు మండిపడి తనపై వ్యక్తిగత దూషణచేస్తూ కోర్టు ధిక్కార నేరం చేశాడని వెంకటప్పయ్య పంతులుగారిపై కేసు బనాయించాడు. అందుపై వెంకటప్పయ్యగారు మేజిస్ట్రేట్ చర్యపై హైకోర్టులో అప్పీలుచేసి ప్రఖ్యాతన్యాయవాది కృష్ణస్వామి అయ్యర్ ని తనతరపువాదించటానికి తెచ్చుకున్నారు. హైకోర్టు ఈ అపీల్ను విచారించి వెంకటప్పయ్య పంతులుగారు ఎటువంటి కోర్టుధిక్కార నేరంచేయలేదని తీర్పుచెప్పి మేజిస్ట్రేట్ కేసు కొట్టివేయటమేగాక మేజిస్ట్రేట్ను మందలించారు. ★

"గురితెలియని వాళ్ళు
అధికారంలోకి వస్తే
ఏంపాలిస్తారు" అనవి

# అయ్యదేవర కాళేశ్వరరావు

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు అయ్యదేవర కాళేశ్వరరావు గారు బందరులో ఒకసారి ఎన్నికలసభలో ప్రసంగిస్తున్నారు. ఎక్కడ నుంచో ఒక రాయివచ్చి వేదిక గుంజకు కొట్టుకుంది. కాళేశ్వరరావు గారు తొణక్కుండా బెణక్కుండా "పాపం ఆరాయి విసిరిన వాడికి గురి చూసి కొట్టటం కూడా తెలియనట్లుంది. నా ముఖానికి కొట్టబోయి వేదిక గుంజకు కొట్టాడు. ఇటువంటి గురితెలియని మనుషులు అధికారంలోకి వస్తే ఏం పరిపాలిస్తారు" అని తన ఉపన్యాసం కొనసాగించారట.





## హిందువులకు వేదాంతి,
## క్రైస్తవులకు ఫాదిరీ,
## ముస్లింలకు మవుల్వీ

# రామమోహన్‌రాయ్

రాజారామమోహనరాయ్‌ని గురించి పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ తన "డిస్కవరీ ఆఫ్ ఇండియాలో" ఈ విధంగా వర్ణించారు. "అతను పండితుడేకాదు, మీదు మిక్కిలి నిశిత పరిశీలకుడు. అన్నింటికన్నా మించి సంఘసంస్కర్త. బాల్యంలో ఇస్లాంమతంచే ఆకర్షించబడి ఆ తరువాత క్రైస్తవ మత ప్రభావానికి లోనైనప్పటికీ తన మతానికే అంటిపెట్టుకొని ఆ మతంలోని దురాచారాలను దుష్ట సాంప్రదాయాలను సంస్కరించ బూనిన వ్యక్తి."

రాజారామమోహనరాయ్ అనగానే బ్రహ్మసమాజం, సతీసహగమన నిషేధం, సంఘసంస్కరణ మొదలైన విషయాలు స్ఫురణకు వస్తాయి.

సతీసహగమనమనే ఆచారం భారతీయులకు బహుశా 'టార్‌టార్' ప్రజలనుంచి సంక్రమించి ఉండవచ్చును. 'టార్‌టార్' ప్రజలలో యజమాని చనిపోగానే అతని సేవకులుకూడా అతనితోపాటే చితిలో దూకి మరణించడం సంప్రదాయంగా ఉండెడిది. ఈ సంప్రదాయమే భారతీయ ప్రజలలో ప్రచారంలోకి వచ్చి సతీసహగమనంగా మారి ఉండవచ్చును.

### వదినగారి సతీసహగమనం

ఈ సహగమనం మిగతా భారతదేశంలో అంత ప్రచారంలో లేదుగాని బెంగాల్ రాష్ట్రంలో మాత్రం ముఖ్యంగా ఉన్నత కుటుంబాలలో అదొక ఆచారంగా పాటించబడుతూ ఉండెడిది. ఒక్క కలకత్తా నగరం

లోనే 1828లో 300 మంది పైచిలుకు వితంతువులు, 1815 నుంచి 1817 వరకు 1500 మంది సహగమన మాచరించినారట. రామమోహనరాయ్ వదినగారు 1821లో ఈ దుష్ట సంప్రదాయానికి గురైనదట. ఈ దారుణ హింసాకాండను కళ్ళారా గాంచిన రామమోహనుడు ఎలాగైనా రూపుమాపాలని ప్రతిన తీసుకుని కరపత్రములు, సభలు, సమావేశముల ద్వారా ఈ దురాచారాన్ని నిరసిస్తూ ప్రజలలో ఒక విధమైన అలజడి తీసుకురాగలిగెను. బ్రిటిష్‌పాలకుల వద్దకు రాయబారమెళ్ళి దీనిని నిషేధించవలసిన ఆవశ్యకతను గూర్చి వివరించెను. సహృదయుడగు బెంటింగ్ ప్రభువు రామమోహనుని వాదమును సావధానముగా విని 1829లో సతీసహగమనము శాసననిషిద్ధంగా చేసెను.

## సంతకాల ఉద్యమం

ఈ శాసనము అమలులోకి రావటంతోనే పరమసనాతనులైన ఇరవై మంది పండితులు, 800 మంది కలకత్తా పౌరుల సంతకాలతో సహగమనాన్ని నిషేధించరాదంటూ ఒక మహాజరును బెంటింగ్ ప్రభువునకు సమర్పించిరి. దీనికి ప్రతిగా రామమోహనుడు అనేకమంది పౌరుల సంతకాలతో సహగమన నిషేధశాసనాన్ని అభినందిస్తూ బెంటింగ్‌కు సమర్పించి సనాతనుల కుట్రను వెల్లడించి భారతనారీమణులకు మహోన్నతమైన ఉపకారము చేయగలిగెను.

రాజారామమోహనుని కీర్తి ఆచంద్రార్కం నిలచేటట్లు చేయగలిగింది బ్రహ్మసమాజ స్థాపన. ఈ సమాజ కార్యాలయమునకు ఒక గృహము ఖరీదు చేసి 1830 జనవరి 23న బ్రహ్మమందిరమునకు ధర్మకర్తల నేర్పరచెను. ఈ బ్రహ్మ మందిరపు దానపత్రములో పేర్కొనిన నియమములనుబట్టి అతని ఆశయాలు ఎంత ఉన్నతమైనవో గ్రహింపవచ్చును. ఆ పత్రములో పేర్కొనిన అనేక విషయాలలో కొన్ని ఇవి.

"ఈ మందిరమందు ఏ విగ్రహమును గాని, శిలనుగాని, చిత్తరువు గాని,

ఏ స్వరూప చిహ్నమునుగాని ఉంచరాదు. బలులు నైవేద్యాలిందు పనికి రావు. ఈ ఆవరణయందు మతాచారములకొరకుగాని, ఆహారముకొరకు గాని ఎట్టి జీవహింస చేయరాదు. సర్వమతములకు అంగీకారములో ఉండునట్టి ప్రసంగములు, ఉపదేశములు, ప్రార్థనలు తప్ప ఎట్టి దుష్ప్రచారము చేయరాదు."

## దేశభాషా పత్రికలకు పితామహుడు

రామమోహనరాయ్ దేశభాషా పత్రికలకు పితామహుడుకూడా. 1821లో అతను ప్రచురించిన బెంగాలీ వారపత్రిక దేశభాషలలో మొట్ట మొదటిది. ఇదిగాక ఇంకా అనేక పత్రికలు బెంగాలీ, ఇంగ్లీషు, పారసీక భాషలలో ప్రచురించెను. అంతేకాదు, పత్రికా స్వాతంత్ర్యము కోసం పాటుబడిన వారిలోకూడా రాయ్ ప్రథముడు. 1823లో ప్రభుత్వం 'కలకత్తా జర్నల్' సంపాదకుడు బకింగ్‌హామ్‌ను దేశంనుంచి వెడలగొట్టిన పిదప పత్రికల మీద తీవ్రమైన నిర్బంధములు విధించి, గవర్నరు జనరల్ అను మతి లేనిదే ఏ పత్రికా ప్రచురించరాదని శాసించెను. దీనికి వ్యతిరేకంగా రామమోహనుడు తీవ్ర అందోళన జరిపి అనేక మహజర్లు ప్రభుత్వమునకు సమర్పించెను. 1835 లో తిరిగి పత్రికా స్వాతంత్ర్య పునరుద్ధరణ జరగ టం ఆయన కృషి ఫలితమేనని చెప్పవచ్చును.

## ఫ్రెంచి విప్లవాలపట్ల ఆనందం

అప్పట్లో భారతదేశ విముక్తికోసం ప్రత్యేకంగా పాటుబడక పోయి నప్పటికీ రామమోహనుని స్వాతంత్ర్యేచ్ఛ, దేశభక్తి నిరుపమానమైనది. ఫ్రెంచివిప్లవకారుల విజయవార్తలు చదివిఆనందించెడివాడట.దక్షిణఅమెరికా స్పెయిన్‌మీద తిరుగుబాటు జరిపి జయమొందినప్పుడు ఆనందాతిశయంతో స్నేహితులను పిలిచి గొప్ప విందుచేసి, సోదరమానవుల సంతోషంలో తానుకూడా భాగం పంచుకొనెనట.

రామమోహనరాయ్‌కి వివిధ భాషలలోగల పాండిత్యం అపార మైనది. అరబ్బీ, పర్షియన్, ఇంగ్లీషు మొదలైన పది భాషలలో విశేష పాండిత్యమార్జించెను. సుప్రసిద్ధ ఆంగ్ల తత్వవేత్త జెర్మీ బెంతోహామ్ రామమోహనుని ఒకానొక గ్రంథం పరిశీలించి "గ్రంథకర్త పేరు చూడనిచో ఈ గ్రంథము నెవరో ఆంగ్ల పండితుడు వ్రాసియుండెనని అనుకొనెడివాడను" అని రాయ్‌కి ఉత్తరం వ్రాసెనట

## హిందువులకు వేదాంతి,
## క్రైస్తవులకు పాదరీ, ముస్లింలకు మవుల్వీ

రామమోహనుడు హిందువులకు ఒక వేదాంతిగాను, క్రైస్తవులకు పాదరీగాను, మహమ్మదీయులకు మవుల్వీగాను కనిపించెడివాడు. వీటన్నింటినీ మించి ఈ అన్ని మతాలను క్షుణ్ణంగా పరిశీలించిన పండితుడు. మానియర్ విలియమ్స్ మాటలలో చెప్పాలంటే "వివిధ మతాల తారతమ్య జ్ఞానాన్ని నిశితంగా పరిశీలించిన పండితుడు". దురాచారాలు మూఢ నమ్మకాలూ ఏ మతంలో ఉన్నా సహించెడివాడు కాదు. అందువలననే ఒక్కొక్కప్పుడు హిందూ సనాతనులతోను, మరొక్కప్పుడు క్రైస్తవ మతోన్మాదులతోను వాగ్వివాదానికి దిగవలసి వచ్చేది.

రామమోహనరాయ్ ఆంగ్ల విద్యావ్యాప్తికి బహుళంగా తోడ్పడెను. **1817**లో కలకత్తాలో స్థాపించబడిన హిందూ కళాశాల ఆయన కృషి ఫలితమే.

రామమోహనుని సంస్కరణలు ఏ ఒక్క రంగానికో పరిమితమై ఉండక సర్వతోముఖమైనవి. ఆ రోజులలో ప్రజాస్వామ్యానికి అందుబాటులో ఉన్న సారస్వతం లేకుండెను పద్యకావ్యములుతప్ప గద్యకావ్యములు లేవు. అట్టి స్థితిలో ప్రజలకు సులభంగా బోధపడు గద్యరచనలుచేసి ఆధునిక వంగ భాషా పితామహుడనిపించుకొనెను. ★

ఒక్కొచొక్కా, రెండులాగుల

# అబ్రహాం లింకన్

స్ప్రింగ్‌ఫీల్డు వీధులవెంట ముతకబట్టలతో తిరిగే అనాకారి, కొద్ది పాటి వకీలు అబ్రహాం లింకన్ అమెరికా అధ్యక్షుడు కాగలడని, జాతి



సమైక్యం రక్షించగలడని ఎవరూ వూహించలేదు. లింకన్ అధ్యక్షుడుగా ఎన్నుకోబడిననాటికి దక్షిణ కెరోలినా అలబామా, మిసిసిపి, ఫ్లారిడా, లూసియానా మొదలైన రాష్ట్రాలు యూనియన్‌నుంచి విడిపోయి, వేరే ప్రభుత్వం ఏర్పరుచుకున్నాయి. దేశం అత్యంత క్లిష్టదశలో ఉన్నది.

లింకన్ అధ్యక్ష పదవిని స్వీకరిస్తూ జాతిని ఉద్దేశించి ఈ విధంగా వక్కాణించారు. "అత్యంత విషమమైన ఈ అంతర్యుద్ధ సమస్య మీచేతుల్లో ఉందిగాని నాచేతులలోకాదు. అంతర్జాతీయ ధర్మరక్షణ కేమి,రాజ్యాంగచట్ట రక్షిణకేమి ఈ రాష్ట్రాల యూనియన్ నిరంతరాయంగా సాగవలసిందనేదే నా నిశ్చయం. ఏ రాష్ట్రం కూడా తన ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించి విడిపోవటానికి వీలులేదు."

## నీగ్రోల శ్రేయోభిలాషి

ఇది ఆయన దృఢ నిశ్చయం. దీని కోసం ఆయన అంతర్యుద్ధం కొనసాగించి నాలుగు సంవత్సరాలు తన శక్తి యుక్తులన్నీ ధారపోయవలసి వచ్చింది. దక్షిణ రాష్ట్రాల సైన్యాధిపతి, మిక్కిలి సమర్థుడును అయిన జనరల్ లీతో ఢీకొని అనేక వ్యయ ప్రయాసలకు లోను కావలసి వచ్చింది. దక్షిణాదివారు తమ తాత ముత్తాతలు సంపాదించిన స్వాతంత్ర్య రక్షణకై పోరాడుతున్నామని భావించారు. ఉత్తరాదివారు తమ పూర్వీకులు స్థాపించిన యూనియన్ రక్షణకై పోరాడుతున్నామని భావించారు. ఏమైతేనేం నాలుగు సంవత్సరాలు మహాదారుణంగాను, వీరోచితంగాను సాగిన ఈ అంతర్యుద్ధం యూనియన్ బలాల విజయంతో సమాప్తి నొందింది. అబ్రహాం లింకన్ అమెరికన్ ప్రజల మహోన్నత నాయకుడుగా, నీగ్రోల శ్రేయోభిలాషిగా బయల్పడ్డాడు. అంతర్యుద్ధం లింకన్ మేధాశక్తికి, శక్తి యుక్తులకు, సమయస్ఫూర్తికి గీటురాయిగా నిల్చింది.

## ఒక చొక్కా, రెండు లాగులు

1809 ఫిబ్రవరి 12న ఇల్లినాయిస్ రాష్ట్రంలో జన్మించిన అబ్రహాం లింకన్ తల్లిదండ్రులు నిరుపేదలు. అతడు జన్మించినది ఒక కర్ర గుడిసెలో. నివసించినది కూడా అక్కడే. దానికున్నది ఒకే ఒక చిన్న తలుపు, ఒకే కిటికీ. పడుకోవటం ఎండు ఆకులపైన. కాళ్ళకు చెప్పులు ఉండేవి కావు. ఒక చొక్కా, రెండు లాగులు మాత్రమే ఉండేవి. అడవికి వెళ్ళి పుల్లలు నరుక్కు జీవిస్తూ ఉండేవాడు ఆ ప్రాంతంలో పుస్తకాలు దొరకటమే అరుదుగా ఉండేది. దొరికిన పుస్తకం మాత్రం ఆసాంతం చదివే వరకు వదిలేవాడుకాదు. రాత్రులు చాలాసేపు మేల్కొని చదువుతూనో, ఆలోచిస్తూనో ఉండేవాడు.

లింకన్ అనేక వృత్తులు చేపట్టాడు. దేంట్లోనూ ముందుకురాలేదు. కొన్నాళ్ళు ఒక షాపు పెట్టాడు. అమ్మకంచేతగాక అప్పుల పాలయ్యాడు. కొన్ని సంవత్సరాల వరకూ అవి తీర్చడంతోనే సరిపోయింది. కొన్నాళ్ళు పడవలు నడిపాడు. సర్వేయర్ పోస్టుమాస్టరుగా పనిచేశాడు. ఉపన్యాసా లిచ్చాడు. ప్రజల భాషలో ఉపన్యసించగలనని గ్రహించాడు. ఇరవై అయిదవఏట శాసనసభకు ఎన్నుకోబడ్డాడు. మానవ ప్రవృత్తిని పరిశోధించ నారంభించాడు. ఇరవై ఎనిమిదవఏట ఏడు డాలర్లతో స్ప్రింగ్ ఫీల్డులో వకీల్ వృత్తి చేపట్టాడు. లాయర్‌గా పేరు గాంచాడు. కేసులో న్యాయం ఉంటేనే చేపట్టేవాడు.

1854 ప్రాంతంలో అతని ఆలోచనలు నీగ్రోల బానిసత్వం మీదకు ప్రసరించినాయి. ఒక ఉపన్యాసంలో ఈ విధంగా అంటాడు. "మానవుని స్వార్థబుద్ధివలన బానిసత్వం జనించింది. ధర్మపరుడు దానిని నిరసిస్తాడు." అప్పటికి అంతకుమించి చెప్పటం తప్పితే కార్యరూపేణా ఏమీ చేయదగిన అవకాశం కలుగలేదు. చేయనూలేదు.

1858 లో స్టీఫెన్‌వో, డగ్లస్‌తో సెనేట్‌కు పోటీచేసి వోడిపోయినా ఆనాడు అతను ప్రచార సందర్భంలో మాట్లాడిన మాటలు ప్రజల హృదయాలలో ఆలోచనలు రేకెత్తించాయి. అతని భావి కర్తవ్యానికి ఆనాడే పునాదులు పడినాయి. నీగ్రోల విముక్తి, ప్రజాస్వామ్యం, యూనియన్ పరిస్థితి మొదలైన విషయాలలో అతని స్పష్టమైన అభిప్రాయాలు దేశ ప్రజలలో ప్రచారం కాజొచ్చాయి.

## పిట్స్‌బర్గ్ ప్రసంగం

లింకన్ హాస్యప్రియుడు, వక్త. ప్రజాహృదయాలలో సూటిగా నాటుకునేట్లు హాస్యోక్తులతో, శ్రోతలకు తనవాదంపట్ల ఆసక్తి జనింపజేయ

గలిగినట్టు మాట్లాడగల దిట్ట. అతని గెట్స్‌బర్గ్ ప్రసంగం కలకాలం నిల్చి వుంటుంది. "ప్రజలకోసం, ప్రజలచే ఏర్పడిన ప్రజల ప్రభుత్వం భూమండలంనుంచి అంతర్థానం కాకూడదు" అనే మాటలు ప్రపంచంలో ప్రజాస్వామ్యం ఉన్నంతకాలం ప్రజల చెవుల్లో గింగురు మంటూనే ఉంటాయి. అంతర్యుద్ధం ముగిసిన వెంటనే కాంగ్రెసులో మాట్లాడుతూ ఈవిధంగా అంటాడు. "ఎవరిమీద ద్వేషం లేక అందరిపట్ల ఔదార్యం కలిగి భగవంతుని సాక్షిగా ధర్మాన్ని ఆచరిస్తూ, మనం తలపెట్టిన కార్యాన్ని పూర్తిచేద్దాం. ఈ జాతికి తగిలిన గాయాలను మాన్పుకుందాం. యుద్ధం నుంచి బ్రతికి వచ్చిన వీరులపట్ల, మరణించినవారి బిడ్డలపట్ల శ్రద్ధచూపుదాం. మనజాతికి, సమస్త జాతులకు న్యాయమైన సుస్థిర శాంతి చేకూరటానికి అన్నివిధాలా కృషిచేద్దాం" ఈ మాటలను బట్టే గ్రహించవచ్చు అతని ఉదార బుద్ధి, హృదయ వైశాల్యం.

మన పూజ్య బాపూజీకి, లింకన్‌కు అనేక సామ్యాలున్నాయి. నిరాడంబరతలో ఇద్దరూ ఒకటే. ఒకరు స్వాతంత్ర్యంకోసం, హరిజనోద్ధరణకోసం, సామాన్య ప్రజల శ్రేయస్సు కోసం పోరాడగా, మరొకరు నీగ్రోల విముక్తి కోసం, జాతి సమైక్యంకోసం పాటుబడ్డారు. బాపూజీ మన స్వాతంత్ర్యాన్ని హరించిన బ్రిటిష్‌వారిపట్ల వ్యక్తిగతంగా ఎలా కక్ష పూనలేదో, అలాగే లింకన్ బానిస యజమానులపట్ల, దక్షిణాది ప్రజలపట్ల, ఎట్టి క్రోధం లేక యుద్ధానంతరం ఎట్టి విచారణ లేకుండానే వారందరిని విడిచిపుచ్చాడు. నిజాయితీలో, ఉదారబుద్ధిలో ఇద్దరూ ఒకటే. బాపూజీ భారతీయులకు ఎలాగో, అమెరికా వారికి లింకన్ అలాగు. ఇద్దరూ హంతకుల తుపాకి గుండ్లకు గురిఅయినవారే. వారుసాధించిన ఉన్నతాశయాలను ఎక్కువకాలం చూడలేకపోయారు. వారు మానవాతీతులు, దైవాంశ సంభూతులు, అమరులు.



కాంగ్రేసు పెద్దలకు గుణపాఠం నేర్పిన

# రవీంద్రనాథ్ టాగూర్

విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్ చిన్నప్పటినుంచి ఎంతో ఆరోగ్యంగా వుండేవారు. అసలు చిన్నప్పుడు ఏనాడూ ఎటువంటి జబ్బు చేయలేదు. కనీసం ఏనాడూ జలుబు చేయటంకూడా లేదు. టాగూరుకు చిన్నప్పుడు బడికి వెళ్ళటం ఎంతో అయిష్టంగా వుండేది. బడిలో క్రమశిక్షణగా కూర్చోవటం, నియమిత వేళలలో చదువుకోవటం అంటే చికాకుగా వుండేది. స్వేచ్ఛగా తిరుగుతూ ఇష్టం వచ్చినప్పుడు



చదవటం అయితే బాగుండుననని భావించేవాడు. అందువలన బడి ఎగ్గొట్టటానికి ఏదైనా కారణం వుంటే బాగుండునని ఆలోచించేవాడు. మిగతా కుర్రవాళ్ళు ఏదో ఒక నెపంతో జ్వరం వచ్చిందనో, జలుబు చేసిందనో, ఏదో ఒక కారణంతో బడి మానేస్తుంటే తనకు మాత్రం ఆ "అదృష్టం" లేదు కదాని వాపోయేవాడు. తనకు కూడా ఏ జ్వరమో మరేదైనా రోగమే వస్తే ఎంత బాగుంటుంది. హాయిగా బడికి ఎగనామం పెట్టి ఇంటివద్ద కూర్చోవచ్చు అనుకునేవాడు. అయితే అదేమి చిత్రమోగాని టాగూర్ ఆశించినట్లు బడి ఎగ్గొట్టటానికి వీలుగా ఏ చిన్నరోగమూ కూడా రాలేదు చిన్నప్పుడు.

## విపరీతమైన చలిలోకూడా చన్నీళ్ళ స్నానం

రవీంద్రనాధ్ టాగూర్ చదువు నిమిత్తం సంవత్సరంన్నర ఇంగ్లాండులో వున్నాడు. ఆ సంవత్సరంన్నర ఎముకలు కొరికే చలిలోకూడా చన్నీళ్ళతోనే స్నానం చేసేవాడు. అంత చలిలో చన్నీళ్ళస్నానం చేసినా ఆయనకు ఏనాడూ జలుబు చేయలేదు. ఆయన ఆరోగ్యం అంత గొప్పది.

ఇంగ్లాండులోవున్న సంవత్సరంన్నరలో రవీంద్రనాధ్ టాగూర్ విశ్వవిద్యాలయానికి వెళ్ళింది కేవలం మూడు మాసాలే! అప్పట్లో టాగూర్ చదివే విశ్వవిద్యాలయంలో సుప్రసిద్ధుడైన హెన్రీ మోర్లే ఇంగ్లీషు ప్రొఫెసర్‌గా వుండేవాడు. ఒకసారి హెన్రీ మోర్లే క్లాసు విద్యార్థులందర్నీ భారతదేశంమీద వ్యాసాలువ్రాసి తీసుకురమ్మన్నాడు. రవీంద్రనాధ్ టాగూర్ తన వ్యాసంలో ఇండియాలో బ్రిటిష్‌వారి దుష్టపాలనను తెగనాడుతూ భారతీయులకు స్వాతంత్ర్యం ఇవ్వటం ఎంత అవసరమో వివరిస్తూ వ్రాసి ఈ వ్యాసంచూసి ప్రొఫెసర్ హెన్రీమోర్లే మండిపడతాడేమోనని ఆ మర్నాడు క్లాసుకి వెళ్ళలేదు. టాగూర్‌తోపాటు ఆ విశ్వవిద్యాలయంలోని మరో భార

తీయ విద్యార్థి మాత్రం తన వ్యాసంలో భారతీయుల పరిపాలనకు అసమర్థు లని, ఇంగ్లీషువారి పాలనలోనే భారతదేశం సుభిక్షంగా వుండగలదని వ్రాశాడు.

ఆ మర్నాడు వ్యాసాలు చదివిన ప్రొఫెసర్ మోర్లే వ్యాసాలన్నింటి లోకి రవీంద్రనాథ్ టాగూర్ రాసిన వ్యాసం ఉత్తమంగా వుందని మెచ్చు కోవటమేగాక ఆ వ్యాసం క్లాసంతటికి చదివి వినిపించాడు. అంతేగాక భార తీయుల్ని విమర్శించుతూ వ్రాసిన మరో భారతీయ విద్యార్థిని ఉపాధ్యాయుల మెప్పుకోసం ఇటువంటి వ్యాసాలురాసి తోటి భారతీయుల్ని కించపర్చటం భావ్యంకాదని ఆ విద్యార్థిని మెత్తగా మందలించాడట! ఆ రోజు భయపడి క్లాసుకు రాకుండా ఎగ్గొట్టిన రవీంద్రనాథ్ టాగూర్ విషయం తెల్సుకుని ప్రొఫెసర్ మోర్లే ఇంటికివెళ్ళి క్లాసుకి రానందుకు క్షమార్పణ చెప్పుకొని ఆయన విశాలహృదయాన్ని మెచ్చుకున్నారు.

## "సంధ్యాసంగీతం"

రవీంద్రనాథ్ టాగూర్ 20 సంవత్సరాల వయస్సులో "సంధ్యా సంగీతం" అనే చక్కటి రచన చేశారు. రవీంద్రుని ఈ సంగీత రచన గంగానది ప్రవాహంలా పరవళ్ళు త్రొక్కింది. ఈ రచన చదివిన ప్రసిద్ధ బంకించంద్ర చటర్జీ ఎంతగానో మెచ్చుకున్నాడు. చదివిన మర్నాడు బంకిం చంద్ర చటర్జీ ఒక వివాహానికి వచ్చాడు. బంకించంద్ర చటర్జీ గుర్రపుబగ్గీ దిగటంతోనే గృహయజమాని ఆయన్ని ఆహ్వానించుతూ పూలదండ వేయ బోగా "ఈ దండ వేయవల్సింది నాకుకాదు. అడుగో ఆ యువకవి రవీంద్రనాథ్‌కు, మీరు 'సంధ్యా సంగీతం' చదవలేదా?" అంటూ ఆ పూల దండను ఆ పెళ్ళికేవచ్చి కొంచెం ఎడంగా నిలబడివున్న రవీంద్రనాథ్ టాగూర్‌వద్దకు వెళ్ళి ఆయన మెళ్ళో ఆ పూదండవేసి కౌగలించుకున్నారట!

## కాంగ్రేసు పెద్దలకు గుణపాఠం

రవీంద్రనాధ్ టాగూర్ పాశ్చాత్య వేషధారణ ఏవగించుకునేవారు. అలాగే మాతృభాష వదిలేసి ఇంటివద్ద కూడా ఇంగ్లీషులో మాట్లాడటం సహించరాని విషయం అనేవారు. తల్లిపాలు త్రాగిన బిడ్డ ఏ విధంగా బలంగా ఆరోగ్యంగా వుంటుందో అలాగే మాతృభాషలో అధ్యయనంచేసిన విద్యార్థికూడా ఏపుగా ఎదుగుతాడని ఆయన వక్కాణించేవారు. ఒకసారి కలకత్తాలో కాంగ్రేసు సభలు జరిగినాయి. ఆ సభలు ముగిసిన తర్వాత ఒక పెద్దమనిషి కాంగ్రేసు నాయకులందరికి పెద్ద విందు చేశాడు. ఆ విందుకు రవీంద్రనాధ్ టాగూర్‌ని కూడా ఆహ్వానించాడు. విందుకు వచ్చిన కాంగ్రేసు పెద్దలందరూ ఇంగ్లీషు పద్ధతిలో సూటు, బూటు వేసుకురాగా రవీంద్రనాధ్ టాగూర్ ఒక్కరే పంచె కట్టుకుని పైన కండువా వేసుకు వచ్చారు. విందు కాగానే వచ్చిన పెద్దలు రవీంద్రనాధ్ టాగూర్‌ను ఒక పాట పాటమని కోరగా సూటు బూటు ధరించివచ్చిన ఆ పెద్దల నుద్దేశించి ఈ విధంగా ఆశువుగా పాడాడు.

**అడగకండి పాడమని నన్నడగకండి!**
నవ్వు తాలకైన విషయ మౌనాకో?
సంబరాలకైన వేడుకా?
పగటి వేషమా ఇది?
సిగ్గుచేటు గాథ కాదె!
పేద జనుల ఆశయాలు ఆశయాలువారి
నిట్టూర్పుల వేదనాశ్రుల తాపమెరుగ
నట్టి ప్రేలాపమ్ము లేల?

చెంప చెళ్ళుమనిపించినట్లయిన కాంగ్రేసు పెద్దలు ఒక్కొక్కరూ చల్లగా జారుకున్నారట!

## టాగూర్-గాంధీజీ అభిప్రాయబేధాలు

రవీంద్రనాధ్ టాగూర్‌కు గాంధీజీకి కొన్ని అభిప్రాయబేధాలు వుండేవి. సహాయనిరాకరణ, చరఖా కార్యక్రమం రవీంద్రనాధ్‌టాగూర్‌కు నచ్చేవికావు. ఇవేగాక బీహార్‌లో భూకంపం వచ్చినప్పుడు గాంధీజీ "అంటరాని వారిపట్ల సవర్ణ హిందువుల పై ఖరిపల్ల కల్గిన పాప ఫలితమే ఈ భూకంపం"అని గాంధీజీ ప్రకటించేటప్పటికి రవీంద్రనాధ్ టాగూరు అందుకు తన వ్యతిరేకత తెలియజేస్తూ ఈ విధంగా మూఢనమ్మకాలను ప్రోత్సహించటం దేశానికి అరిష్టమని ప్రకటించారు. చరఖా కార్యక్రమానికి విశ్వకవి ఆశీస్సులకోసం గాంధీజీ శాంతినికేతనం సందర్శించారు. ఈ విషయంలో రవీంద్రనాధ్ టాగూరేని ఒప్పించలేకపోయారు. ఈ సందర్భంగా వారిద్దరికీ వాగ్వివాదం జరిగినట్లు కూడా చెబుతారు. అలాగే సహాయనిరాకరణ విషయంలోకూడా వీరిద్దరి అభిప్రాయాలూ పరస్పర విరుద్ధంగా ఉండేవి. ఈ విధంగా ఈ మహనీయులిద్దరిమధ్యా అనేక అభిప్రాయబేధాలువున్నా పరస్పరం ఎంతగానో గౌరవించుకునేవారు ఒకరిపట్ల మరొకరు ఎంతో ఆప్యాయంగాకూడా వుండేవారు. 1930లో రవీంద్రనాథ్ టాగూర్ బ్రిటన్‌లో పర్యటిస్తూ అయన చేసిన ప్రసంగాలన్నింటిలోనూ గాంధీజీ గొప్పతనాన్ని గురించి ప్రస్తుతించేవారు. అస్పృశ్యతకు వ్యతిరేకంగా గాంధీజీ ఆమరణనిరాహారదీక్ష పూనగా రవీంద్రనాధ్‌టాగూర్ ఎంతో తల్లడిల్లిపోయి "ఒక మహామహుని మరణానికి కారణం కావద్దు" అంటూ దేశ ప్రజలకు పదేపదే విజ్ఞప్తి చేశారు. ఆయనే స్వయంగా గాంధీజీ చెంతకువెళ్ళి ఒప్పించి నిరాహారదీక్ష విరమింపజేశారు. ఆ సందర్భంగా గాంధీజీ కోరికపై రవీంద్రనాధ్‌టాగూర్ కంపించే గొంతుతో ఈ విధంగా పాడారు.

ఎద గట్టిపడి ఎండిపోయిన వేళ
నీ కరుణామృత వృష్టి కురియనిమ్ము
జీవితాన సొగసులంతమయిన
నీ గాన మాధురి నాకు సోకనిమ్ము.

1940లో రవీంద్రనాథ్ టాగూర్ అకస్మాత్తుగా జబ్బు పడ్డారు. గాంధీజీ ఆందోళనచెంది టాగూర్ క్షేమం విచారించిరమ్మని హుటాహుటిని తన కార్యదర్శి మహదేవ్ దేశాయ్‌ని పంపారు. రవీంద్రనాథ్ టాగూర్ అప్పటికి కాస్త తేరుకుని కళ్ళుతెరచి మహదేవ్ దేశాయ్ ద్వారా గాంధీజీ ఆందోళన వినటంతోనే కన్నీరు కార్చారు. బాగా స్వస్థత చిక్కిన తర్వాత గాంధీజీని గురించి ఈ విధంగా ఒక పద్యం చెప్పారు.

మేము గాంధీజీ అనుయాయులం
కొందరం ధనికులం, మరి కొందరు పేదలం
కాని లేదు మాలో బలపాటం
లేనివాళ్ళ కడుపుకొట్టి బలిసే వ్యామోహం

## నూరేళ్ళనలే భరించలేం

రవీంద్రనాథ్ టాగూర్ 80వ జన్మదినోత్సవం సందర్భంగా గాంధీజీ "ఎనభై ఏళ్ళు చాలవు. నూరేళ్ళు జీవించు ప్రేమతో" అంటూ అభినందనలు పంపితే సమాధానంగా విశ్వకవి రవీంద్రుడు "కృతజ్ఞతలు, ఎనభై ఏళ్ళే క్లేశ దాయకం. నూరేళ్ళసలే సహించలేం" అన్నారట. 

అహింసా యోధుడు

# ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్

శ్రీ గఫార్ ఖాన్ జీవితం పరిశీలిస్తే ఆయన పడ్డ కష్టాలు మరే రాజకీయవేత్త, ప్రజా నాయకుడు పడలేదేమోననిపిస్తుంది. ఆయన తన జాతి



ప్రజలకోసం చేసిన త్యాగం ఎనలేనిది. ఆయన జీవితంలో 30సంవత్సరాలు జైలులోనే గడిపారు. తన ఆస్తినంతా కోల్పోయారు. జైలు జీవితంతో ఆయన ఆరోగ్యం శిధిలమైపోయింది.

ఏ నాటికైనా బెలూచిస్తాన్ నుంచి చిత్రాల్ వరకూవున్న పఠాన్లనందర్నీ ఏకంచేసి, పాకిస్తాన్ పాలననుంచి విముక్తి చెందించి స్వయం ప్రతిపత్తిని సాధించాలని ఆ మహామహుని ఆశయం. అందుకోసం ఆయన జీవితాంతం పోరాడారు.

## జననం, బాల్యం

శ్రీ గఫార్ ఖాన్ సరిహద్దు రాష్ట్రంలోని హస్తనగర్ వద్ద వున్న 'ఉత్మాన్ జాయ్' గ్రామంలో 1890లో జన్మించారు. శ్రీ గఫార్ ఖాన్ తండ్రి బహరంఖాన్ గ్రామ పెత్తందారు. బహరంఖాన్ గ్రామ పెత్తందారైనా అహంకారం, దర్పం లేనివాడు అతి అణకువగా మెలిగేవాడు.

శ్రీ గఫార్ ఖాన్ ప్రాథమిక విద్య పెషావర్ లోని మునిసిపల్ బోర్డు స్కూల్లో సాగింది. ప్రాథమిక విద్య అయిన తర్వాత మిషన్ స్కూల్లో

చేరారు. బిరానీ కాకా అనే వ్యక్తి శ్రీ గఫార్ ఖాన్‌కు సేవకుడుగా వుండే వాడు. బిరానీ కాకా గఫార్ ఖాన్‌కు సైనికులగురించి వారి ధైర్య సాహసాల గురించి అనేక కథలు చెబుతూ వుండేవాడు. గఫార్ ఖాన్ ఇవన్నీ విని ఉత్తేజంపొంది ఏ నాటికైనా తను కూడా గొప్ప సైనికుడు కావాలని ఉవ్విళ్ళూరుతూ వుండేవాడు.

## జీవితంలో మొదటి మలుపు

హైస్కూలు విద్య పూర్తికాగానే గఫార్ ఖాన్ సైన్యంలో కమీషన్డ్ ఉద్యోగంలో చేరారు. ఆరు అడుగుల మూడు అంగుళాల ఎత్తు, స్ఫురద్రూపం కలిగిన గఫార్ ఖాన్ తేలికగా సైన్యంలోకి తీసుకోబడ్డారు.

సైన్యంలో చేరిన తర్వాత ఒకనాడు శ్రీ గఫార్ ఖాన్ పెషావరులోని తన స్నేహితుడొకర్ని చూడటానికి వెళ్ళాడు. అతడుకూడా సైన్యంలో ఆఫీసరే. వారిద్దరూ బజారులో నిలబడి ముచ్చటించుకుంటున్నారు. అప్పుడొక ఆంగ్లేయసైన్యాధికారి అటుగా వెళ్ళుతూ గఫార్ ఖాన్ స్నేహితునిచూసి ఏవో ఆవాకులు చవాకులు ప్రేలాడు. ఈ సంఘటన గఫార్ ఖాన్ జీవితాన్నే మార్చి వేసింది. సైన్యంలో ఉద్యోగానికి తక్షణం రాజీనామా చేశారు.

తిరిగి పై చదువులు చదవడానికి ఉపక్రమించారు. అలీఘర్‌లో కొంతకాలం చదివారు. లండన్ వెళ్ళి చదువుకోవాలని తలంపు కల్గింది. వెళ్ళటానికి అంతా సిద్ధం చేసుకున్నారు కూడా. కాని తల్లికి ఇష్టంలేక అడ్డు చెప్పటంవలన ఆ ప్రయత్నం విరమించవల్సి వచ్చింది. ఇక చదువుకు స్వస్తిచెప్పి ప్రజాసేవ చేయాలని నిశ్చయించుకున్నారు.

## బ్లాక్ లా

1901 లో బ్రిటిషువారు పంజాబ్ రాష్ట్రం నుంచి ఫకూన్ లుండే ప్రాంతాన్ని వేరుచేసి అనేక అమానుషచట్టాల్ని ప్రవేశ పెట్టారు. సాహ

సోపేతులైన అనేకమంది ఫక్తూన్లు బ్రిటిషువారిపై తిరగబడడం ప్రారంభించారు. ఫక్తూన్ల స్వాతంత్ర్యపోరాటం అణిచివేయడానికి "ఫ్రాంటియర్ క్రైంస్ రెగ్యులేషన్ యాక్టులను ప్రవేశపెట్టారు. దీన్నే ఫక్తూన్లు "బ్లాక్‌లా" అని పిల్చేవారు. ఈ చట్టం క్రింద నిరపరాధులైన అనేక మంది ఫక్తూన్లను ఎట్టి విచారణ లేకుండానే ఉరికంబ మెక్కించారు. అసలు ఈ చట్టం క్రింద ఏ పోలీసు కానిస్టేబులయినా ఏ ఫక్తూను పెద్దమనిషినైనా అరెస్టుచేసి నిరవధికంగా జైల్లో వుంచవచ్చు.

శ్రీ గఫార్‌ఖాన్ ఈ రాక్షస చర్యలను ఎదుర్కొనటానికి ప్రజలను ఆయత్త పర్చటానికి అనేక గ్రామాలు పర్యటించారు. అనేకమంది ప్రముఖులను కలుసుకున్నారు, కాని బ్రిటిష్‌వారి హింసాకాండకు, తంత్రాలకు జడిసిపోయిన ప్రజలు ఆయనతో సహకరించే పరిస్థితులలో లేరు. ఈ లోపల మొదటి ప్రపంచ యుద్ధం వచ్చింది.

## అరెస్టులు – కారాగారవాసం

19.8 నాటికి ప్రపంచ యుద్ధం ముగిసింది. 19.9లో రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా ఆందోళన సాగింది. గఫార్ అందులో పాల్గొన్నారు. రౌలట్ బిల్లుకు వ్యతిరేకంగా శ్రీ గఫార్‌ఖాన్ స్వగ్రామంలో జరిగిన సభలో లక్షమంది ప్రజలు పాల్గొన్నారు, ఈ విధంగా అనేకచోట్ల సభలు, సమావేశాలు ఫక్తూన్ ప్రాంతం అంతా జరిగినై, దాంతో ఫక్తూన్ ప్రజలలో ఒక విధమైన చైతన్యం బ్రిటిష్‌వారిపట్ల ఏవగింపు కలిగినై. బ్రిటిష్ ప్రభుత్వం సైనిక శాసనం ప్రకటించింది. గఫార్‌ఖాన్‌ను మార్షల్లా క్రింద అరెస్టుచేసి ఆరు మాసాలు జైల్లో వుంచారు.

జైలు నుంచి విడుదలైన తర్వాత శ్రీ గఫార్‌ఖాన్, ఖిలాఫత్ ఉద్యమంలో పాల్గొన్నారు. పెషావర్‌లోని ఖిలాఫత్ కమిటీకి అధ్యక్షులుగా కూడా వున్నారు. అధ్యక్షులుగా వుంటూనే ఫక్తూన్ ప్రాంతం అంతా పర్య

టీస్తూ బ్రిటిష్ వ్యతిరేక ఉద్యమం నడుపసాగారు. ఫక్తూన్ ప్రజలలో స్వాతంత్ర్య బీజాలు వెదజల్ల నారంభించారు. గఫార్‌ఖాన్ ఉపన్యాసాలకు కంగారుపడిన బ్రిటిష్ ప్రభుత్వం 1921 డిసెంబరులో బ్లాక్‌లా క్రింద అరెస్టుచేసి మూడు సంవత్సరాలు జైలు శిక్ష విధించారు.

ఈ మూడు సంవత్సరాలు పెషావర్, దేరా ఇస్మేల్‌ఖాన్, బాలీ జైళ్ళలో గడిపారు. దేరో ఇస్మాల్‌ఖాన్ జైల్లో గఫార్‌ఖాన్ చేత రోజూ 20 శేర్ల గోధుమలు దంపించేవారు, త్రాళ్ళు నేయించేవారు, కుక్కలు కూడా ముట్టని తిండి పెట్టేవారు. వీటన్నింటి వలన గఫార్‌ఖాన్ నాల్గు మాసాల్లోనే 45 పౌనులు బరువు తగ్గిపోయారు. ఆరోగ్యం పూర్తిగా దెబ్బతినిపోయింది. కొంతకాలం తర్వాత పెషావర్ జైలుకు మార్చారు. అక్కడ పరిస్థితి కొస్త మెరుగుగా వుండేది.

## ఫక్తూన్

జైలు నుంచి విడుదలైన తర్వాత శ్రీ గఫార్‌ఖాన్ ఫక్తూన్ ప్రజల కొరకు వార్తాపత్రిక అవసరం అని భావించారు. అప్పటికి వారికి వారి భాష అయిన 'పుస్తు'లో వార్తాపత్రిక అని పిలువదగిన దేదీలేదు. 1928లో "ఫక్తూన్" అనే పేరుతో గఫార్‌ఖాన్ వార్తా పత్రిక వెలుపరించారు. ఫక్తూన్ అనతికాలంలోనే విశేష ప్రచారం పొందింది. గాంధీజీ "హరిజన్" పత్రిక ఇండియాలో ఎంత ప్రచారం పొందిందో ఫక్తూన్ పఠాన్ ప్రజలలో అంత ప్రచారం పొందింది, ఇతర దేశాలలో వున్న అనేకమంది పఠాన్లు దీనికి ఆర్థిక సహాయం చేశారు.

## కాంగ్రెసులో ప్రవేశం

1928లో ఖిలాఫత్ సమావేశం కలకత్తాలో జరిగింది. గఫార్‌ఖాన్ అక్కడకు వెళ్ళారు. అదే సమయంలో కాంగ్రెసు సభలు కూడా అక్కడే జరుగుతున్నాయి. ఖిలాఫత్ సమావేశంలో మహమ్మదాలీ హిందువులపై చేసిన విమర్శలు గఫార్ ఖాన్‌ను ఎంతగానో బాధించాయి. అందుమీదట

సమావేశం నుండి బయటకు వచ్చేసి కాంగ్రెసు సమావేశానికి హాజరైనారు. మళ్ళీ తిరిగి ఎన్నడు ఖిలాఫత్ సమావేశాలకు హాజరు కాలేదు.

1929లో లాహోర్ కాంగ్రెసు సమావేశానికి వెళ్ళారు. ఆ సమావేశంలో దేశ స్వాతంత్ర్యం కోసం ఎన్ని త్యాగాలకైనా వోర్చి పోరాడాలని నిశ్చయించబడింది. గఫార్ ఖాన్ కాంగ్రెసు తీర్మానాలకు మద్దతు పొందటానికి ఫక్తూన్ ప్రాంతం అంతా పర్యటించారు. గ్రామాల్లో సభలు పెట్టారు. గ్రామ గ్రామాన కమిటీలు ఏర్పరచారు. ఈ విధంగా పఠాన్లలో స్వాతంత్ర్యోద్యమం వ్యాపింప చేస్తున్న గఫార్ ఖాన్‌ను బ్రిటిష్ ప్రభుత్వం 1930లో అరెస్టుచేసింది. ఈ అరెస్టుతో పఠాన్ ప్రజలు రెచ్చిపోయి ప్రదర్శనలు జరిపారు. బ్రిటిష్ ప్రభుత్వం సైన్యాన్ని పంపి కాల్పులు జరిపించింది. కొంతమంది చనిపోయారు. ప్రజలు గఫార్ ఖాన్‌ను వుంచిన జైలును ముట్టడించారు. గఫార్ ఖాన్ ప్రజలను శాంతియుతంగా ప్రవర్తించవలసిందని పదేపదే ప్రార్థించడంతో పరిస్థితి అదుపులోకి వచ్చింది.

## ఎర్ర చొక్కాలు

సరిహద్దు రాష్ట్రంలో బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా రెండు ఉద్యమాలు నడుస్తూవుండేవి. ఒకటి హింసాయుతమైనది. ఇది ఎంతోకాలం నిలువలేదు. రెండవది శ్రీ గఫార్ ఖాన్ ఆధ్వర్యాన నడిచే అహింసాయుత ఉద్యమం. గఫార్ ఖాన్ అనుయాయుల్ని "ఖుదైతిద్‌మత్గర్స్"అనే వారు. అనగా భగవంతుని ఉద్యమానికి సేవకులు అని అర్థం. వీరందరు యూనిఫారంగా ఎర్ర చొక్కాలు ధరించేవారు. అందువలన వీరిని ఎర్రచొక్కాలు (రెడ్ షర్ట్స్) అని కూడా పిలిచేవారు.

బ్రిటిష్‌వారు ఎర్ర చొక్కాల వారిని నానాహింసలు పెట్టేవారు. ఉదాహరణకు వారేమీ చేయకపోయినా కేవలం పికిటింగ్ చేసినందుకు ఎర్ర చొక్కాలవారిని దిగంబరంగా బజార్లలో నడిపించేవారు.

ఈ విధంగా వారిని అనేక విధాల అమానుషంగా హింసించేవారు. వారి గ్రామాలను ముట్టడించి అనేక రోజులు మిగతా ప్రపంచంతో సంబంధాలు లేకుండా, ఆహారధాన్యాలు సరఫరా కాకుండా చేసేవారు. ఎన్నిచేసినా ఎర్ర చొక్కాలవారి ధైర్యం సడలలేదు. మీదుమిక్కిలి వారి సంఖ్య పెరిగిపోయింది.

## గఫార్ ఖాన్—గాంధీజీ

గాంధీ-ఇర్విన్ ఒప్పందం ప్రకారం రాజకీయ ఖైదీల నందరిని విడుదల చేశారు. కాని గఫార్ ఖాన్‌ని మాత్రం విడుదల చేయలేదు. గాంధీజీ ఇర్విన్‌తో మాట్లాడి వత్తిడి తెచ్చిన తర్వాత మాత్రమే గఫార్ ఖాన్‌ను విడుదల చేశారు. విడుదల చేసిన తర్వాత కూడా గఫార్ ఖాన్ హింసాకాండ రెచ్చగొడుతున్నాడనే నెపంవేసి గాంధీజీనికూడా నమ్మించి ఆయన అనుమతితో అరెస్టు చేయాలని చూశారు బ్రిటిష్‌వారు. కాని కుదరలేదు. శ్రీ గఫార్ ఖాన్ గాంధీజీని బార్డోలీలో కలుసుకొని సుదీర్ఘచర్చలు జరిపారు. ఫక్తూన్ల పరిస్థితి, తన ఉద్యమం గురించి విపులంగా వివరించి చెప్పారు. సరిహద్దు రాష్ట్రంలో గాంధీజీని పర్యటించవలసిందని కోరారు. అందుమీదట గాంధీజీ వైస్రాయ్‌కి ఉత్తరం వ్రాశారు తమ సరిహద్దు రాష్ట్రంలో పర్యటించటానికి అనుమతి ఇవ్వవల్సిందని, వైస్రాయ్ అందుకు అంగీకరించలేదు. దాంతో బ్రిటిషువారు గఫార్ ఖాన్‌పై ఆరోపిస్తున్నవన్నీ బూటకమని తేలిపోయింది గాంధీజీకి. గాంధీజీ గఫార్ ఖాన్‌ను తన ఉద్యమం కొనసాగించవలసిందని అనుమతి ఇచ్చారు.

## దేశ విభజన-గఫార్ ఖాన్ నిరాశ

1945 ఎన్నికలలో గఫార్ ఖాన్ పాల్గొనకూడదనే మొదట అనుకున్నారు. కాని తర్వాత రంగంలోకి దిగక తప్పలేదు. ఎర్ర చొక్కాలతో వారికి వ్యతిరేకంగా బ్రిటిషువారి మద్దతుతో ముస్లింలీగ్ పోటీచేసింది.

బ్రిటిష్‌వారు ఎన్ని మాయోపాయాలు పన్నినా ముస్లింలీగ్ దారుణంగా ఓడిపోయింది గఫార్‌ఖాన్ వర్గం పెద్ద మెజారిటీతో గెల్చింది

ఇంతలో అమాత్య రాయబారం ఇండియాకు వచ్చింది. అమాత్య రాయబారంతో చర్చలు జరపడానికి నిర్ణయించబడిన నల్గురు సభ్యులలో శ్రీ గఫార్‌ఖాన్ ఒకరు.

ముస్లింలీగ్ ప్రత్యేక పాకిస్తాన్ నినాదం తీవ్రతరం చేసి హిందూ ముస్లిం కలహాలు రెచ్చగొట్టింది. గఫార్‌ఖాన్ బీహార్ రాష్ట్రంలో పర్యటిస్తూ మత కలహాలను నివారించడానికి కష్టనష్టాలకు గురైన వారిని ఓదార్చడానికి విశేష కృషి సల్పారు.

దేశ విభజన విషయం కాంగ్రెసు కార్యవర్గంలో చర్చకు వచ్చింది. విభజనకు పటేల్, రాజాజీలు అనుకూలత చూపగా గాంధీజీ, గఫార్‌ఖాన్‌లు తీవ్రంగా వ్యతిరేకించారు. అనేక తర్జన భర్జనలు జరిపిన తర్వాత ఎట్టకేలకు కాంగ్రెసు కార్యవర్గం హెచ్చుమంది విభజనకే నిర్ణయించారు. అంతే కాదు. సరిహద్దు రాష్ట్రంలో జనవాక్య సేకరణ తీసుకోవాలని కూడా నిశ్చయించారు. జనవాక్య సేకరణ అనేది శ్రీ గఫార్‌ఖాన్‌కు సుతరామూ ఇష్టంలేదు. అంటే ఇండియా మొత్తం కలసివుండాలి, లేకపోతే ఫక్తూన్ ప్రాంతం స్వతంత్ర రాజ్యంగా రూపొందించాలని ఆయన ఆశయం. మత ప్రాతిపదికపై ఫక్తూను పాకిస్తాన్‌లో చేరాలనడం ఆత్మహత్యా సదృశమని ఆయన భావం.

పాకిస్తాన్ ఏర్పడిన మొదటి 18 సంవత్సరాలలోను గఫార్‌ఖాన్‌ను 15 సంవత్సరాలు జైలులోనే వుంచారు. (బ్రిటిషు వారి హయాంలో మరొక 15 సంవత్సరాలు జైలులో వున్నారు) జైలులో గఫార్‌ఖాన్‌ను బహు అమానుషంగా చూసేవారు. గఫార్ ఆస్తినంతా స్వాధీనం చేసుకున్నారు. అనేక మంది గఫార్‌కాన్ వర్గీయుల్ని జైల్లో పెట్టించడమో, చంపడమో చేశారు పాక్ నియంతలు.



పిసినారి పెద్దలకు పెద్ద

# నిజాం నవాబ్

పిసినారి పెద్దల గురించి చెప్పాలంటే ముందుగా మాజీ నిజాం నవాబ్ ఉస్మాన్ అలీఖాన్ గురించే చెప్పాల్సి వుంటుంది. ప్రపంచంలో కెల్లా భాగ్యవంతుడుగా ప్రసిద్ధి పొందిన మీర్ ఉస్మాన్ అలీఖాన్ విచిత్ర వ్యక్తి. ఆయన అలవాట్లు చూస్తే ఎవరికైనా జుగుప్స కలుగకమానదు.

## గుడ్డ ఆదా కోసం

అయిదు అడుగుల మూడు అంగుళాలు మాత్రమే ఎత్తు, కేవలం 90 పౌన్లు బరువు కల్గిన నైజాం నవాబు అతి చౌకగా దొరికే గుడ్డతో చొక్కాలు కుట్టించుకునేవాడు. తొడిగే పైజమా తన కాలితలకు సరిపడ బారుగా కుట్టించుకునేవాడు కాదు. గుడ్డ ఆదా అవుతుందని ఒకటి రెండు అంగుళాలు తగ్గించి కుట్టించుకునేవాడు. ఆ పైజమా చూసే వారికి ఎగ లాక్కుపోయినట్లు సగం కాళ్ళు కనబడుతూ అసహ్యంగా వుండేది.

## జీవితాంతం ఒకే టోపీ

ఆయన జీవితాంతం ఒకే టోపీతో కాలక్షేపం చేశాడు. ఆ టోపీ నిండా పేలు పట్టి వుండేవి. ఆయన చెప్పులు "హవాయి స్లిప్పర్సు

మాత్రమే. వాటిని కూడా బజార్లో అతి తక్కువ ధరకు దొరికే వాటిని వాడేవాడు.

ఇక ఆయన కాల్చే సిగరెట్లు అన్నిటికన్నా చౌక అయిన చార్మినార్ మార్కు మాత్రమే! చార్మినార్ సిగరెట్లను ఆయన నిర్విరామంగా కాలుస్తూ ఉండేవాడు. ఎవరైనా అతిథులు వచ్చినప్పుడు ఖరీదైన సిగరెట్లు తనకు ఇవ్వబోతే "ఇంకా రెండు ఇవ్వండి" అని అడిగేవాడు పోనీ వాటిని వాడేవాడా అంటే లేదు. వాటిని భద్రంగా తన సిగరెట్టు పెట్టెలో దాచుకొని మాటమాటికి చూసుకొని ఆనందిస్తూ వుండేవాడు. ఆ విధంగా ఖరీదైన సిగరెట్లపై మోజు తీర్చుకునేవాడు.

## నవాబుగారి పడకగది సొగసు

నవాబుగారి పడకగది ఎంతో చీదరగా వుండేది. రోజూ ఊడ్పించుకునేవాడు కాదు. కాల్చివేసిన సిగరెట్టు పీకలు పోగులు పడి వుండేవి. ఆయన పడకగదిలో పాతకాలపు పడక మంచం ఒకటి, ఒక బల్ల, ఇక్ష్వాకుల నాటి కుర్చీలు మూడు మాత్రం వుండేవి. వీటిని ఏ విధంగానూ కదిలించడానికి ఎవరికీ అధికారం లేదు. ఆ పడక గదిలోనే నవాబు చాప మీద కూర్చొని భోజనం చేసేవాడు. సంవత్సరానికి ఒక్కనాడు మాత్రమే నవాబుగారి పుట్టినరోజున గది అంతా బూజు దులిపి యాష్ట్రేలు, చెత్తకుండీలు ఖాళీచేసి గది ఊడ్చేవారు.

వక్కపొడి, నల్లమందు ఎక్కువగా వాడేవాడు నైజాం నవాబు. ఎల్లప్పుడూ వక్కపొడి నమలటంవల్ల పళ్ళు గారపట్టి వుండేవి. ఏనాడూ దంతవైద్యుడి చేత శుభ్రం చేయించుకునేవాడు కాదు.

నవాబు తన వద్దకు వచ్చే గౌరవాతిథులకు కేవలం ఒక్క బిస్కట్టు అరకప్పు టీ మాత్రమే ఇచ్చేవాడు. పొరపాటున కూడా రెండో బిస్కట్టు పెట్టేవాడు కాదు.

# పార్లమెంట్ ఎన్నికల ఖర్చు పదిరూపాయలు

నైజాం నవాబు లాంటి వాడే మరొక పిసినారి జాన్ ఎల్విస్. ఈయన బ్రిటన్‌కు చెందినవాడు. ఇరవై కోట్ల పౌన్ల ఆస్తిగల ఆసామి. పన్నెండు సంవత్సరాలు పార్లమెంట్ సభ్యుడిగా వున్న ఈ మహానుభావుడు ఎన్నికల ప్రచార నిమిత్తం కేవలం పది రూపాయలు మాత్రమే ఖర్చు పెట్టాడట. పార్ల మెంట్ సభ్యుడిగా వున్న 13 సంవత్సరాలు ఒకే ఒక్క సూటుతో కాలక్షేపం చేశాడట.

పార్ల మెంట్‌లో ఏనాడూ నోరెత్తిన పాపాన పోలేదు. మిగతా పార్ల మెంట్ సభ్యులకు ప్రోనోట్లపై హెచ్చు వడ్డీలకు అప్పులు పెడుతూ వుండేవాడు. అయితే ఆ పార్ల మెంటు సభ్యులు తిరిగి ఆ మొత్తాల్ని ఇచ్చేవారు కాదు. అలాగని జాన్ ఎల్విస్ ఆ నోట్లను ప్లయింట్ చేసేవాడు కాదు. ఎందు వలనంటే కోర్టులకెక్కితే ప్లీడరు ఫీజు ఇవ్వాల్సి వస్తుందని. ఈ విధంగా నోట్లు వాయిదాపోయి రెండు కోట్లు నష్టపోయాడు.

ఈ విధంగా నష్టపోయిన ధనాన్ని పూరించుకోవడానికి తను చేసే ఖర్చులలో ఇంకా కోత విధించుకోవడం ప్రారంభించేవాడు. చెత్త కుండీలలో పారవేసిన టోపీలు ఏరి తెచ్చుకొని వాటిని ధరించేవాడు. కొత్త బూట్లు కొనుక్కోకుండా బజార్లో పారవేసిన వాటినే తెచ్చుకుని వాడుతూ వుండేవాడు. పైగా వాటికి ఏనాడూ పాలీష్ వేసేవాడు కాదు. పాలిష్ వేస్తే ఆ బూట్లు తొందరగా అరిగిపోతాయేమోనని భయం.

అన్నింటికన్నా విచిత్రం ఏమంటే పెళ్ళి చేసుకుంటే పెళ్ళాన్ని పోషించవలసి వస్తుంది, పైగా పిల్లలు పుడితే అదొక ఖర్చు అని పెళ్ళి చేసుకోవడం మానేసి వెనకాముందు ఎవరూలేని ఒక వంటావిడ్ని తెచ్చుకొని వంట చేయించుకునేవాడు. అయితే ఆ వంటావిడతో అక్రమ

సంబంధం వల్ల ఇద్దరు కొడుకులు పుట్టారు. చనిపోయే నాటికి జాన్ ఎల్విస్ కోట్లాది ఆస్తికి వాళ్ళే వారసులయ్యారు.

## పేడ పోగుచేసిన కోటీశ్వరుడు!

బ్రిటన్‌లోనే 150 సంవత్సరాలకు పూర్వం మరొక పిసినారి డేనియల్ డాన్సర్ వుండేవాడు. ఈయనకు అనేక కోట్ల రూపాయల సంపద వుండేది. వందలాది ఎకరాల పొలం వుండేది. అయినా రోజూ తట్టనెత్తిన పెట్టుకుని వీధుల వెంట తిరిగి పేడ పోగుచేస్తూ వుండేవాడు ఆ పేడనే పొలంలో ఎరువుగా వేస్తూ వుండేవాడు.

కుటుంబంలో ఎవరికైనా జబ్బుచేస్తే ఎట్టి పరిస్థితులలోను డాక్టర్‌ని పిలిచేవాడు కాదు. మందులు వాడేవాడు కాదు. ఎవరైనా ఈ విషయమై చెప్పినా "ఆ ఈ పాడు మందులతో జబ్బులు తగ్గుతాయా, పెడతాయా భగవదేచ్ఛ ఎలా వుంటే అలా జరుగుతుంది" అంటూ వుండేవాడు.

## 40 కోట్ల ఆస్తి ధర్మాసుపత్రి వైద్యం

ఇక అమెరికాకు చెందిన పిసినారి పెద్దమ్మ హెట్టీ గ్రేస్ వీళ్ళందరినీ మించి పోతుంది. ఈవిడకు 40 కోట్ల రూపాయల ఆస్తి వుంది. ఒక్కగా నొక్క కొడుకు. కొడుక్కి కారు ప్రమాదంలో కాలు విరిగితే డబ్బు ఖర్చు పెట్టాల్సి వస్తుందని ప్రయివేటు ఆసుపత్రికి పోకుండా కానీ ఖర్చు లేని ధర్మాసుపత్రిలో చేర్పించింది. ఆ ధర్మాసుపత్రివారు సరిగా వైద్యం చేయకపోవడం వల్ల సెప్టిక్ అయి కాలు తీసివేయవలసి వచ్చింది. అయినా కానీ ఖర్చు లేకుండా వైద్యం జరిగిందని ఆ మహాతల్లి సంబరపడింది తప్ప కొడుకు కాలు పోయిందని ఏ మాత్రం చింతించలేదట. ఈ మహా తల్లి ఈ మధ్యనే కోట్లాది రూపాయిల సంపదను కాలులేని కొడుక్కి అప్పగించి చనిపోయింది.

